ఆల్బర్ట్ కామూ

# అపరిచితుడు

తెలుగు: జి. లక్ష్మి













# అపరిచితుడు

(The Outsider/The Stranger)

మూలం

**ఆల్బర్ట్ కామూ**

తెలుగు

**జి. లక్ష్మి**





పీకాక్ క్లాసిక్స్ ● హైదరాబాద్

అపరిచితుడు

*"Aparichithudu"*, a Telugu version of
Albert Camus' *"The Outsider/The Stranger"*,
rendered into Telugu by Ms. G. Laxmi
published by **Peacock Classics,** Publication wing of **People's Trust**

**Cover Design: Chandra and Suri**

Publication No: 72



Price: Rs.60

First Published in 2012
Hyderabad, Andhra Pradesh, India

copies printed: 1000

Printed at Himalaya Graphics, Hyderabad

Sole Distributors: Visalaandhra Publishing House, Hyd.

Address for Communication
G2, BLOCK NO. 6, PANCHAVATI, PRAGATHI NAGAR,
OPP. JNTU, KUKKATPALLY, HYDERABAD - 72

EDITOR, PEACOCK CLASSICS
Phs: 98499 40791, 901020 4633, 040 2389 0328 (R)
emails: agaandhi@gmail.com, agaandhi@yahoo.co.in



# అపరిచితుడు

అమ్మ ఈ రోజు చనిపోయింది. లేదా నిన్న అయినా అయిండొచ్చు. ఎందుకంటే వృద్ధాశ్రమం నుండి వచ్చిన టెలిగ్రామ్‌లో "మీ అమ్మ చనిపోయింది. రేపు అంత్యక్రియలు. మీకు మా సానుభూతి" అని మాత్రమే ఉంది. దానితో బహుశా ఆవిడ చనిపోయింది నిన్నయినా అయి ఉండొచ్చని నాకు సందేహం కలిగింది.

అమ్మ ఉండే వృద్ధాశ్రమం అల్జీర్స్‌కు యాభై మైళ్ళ దూరంలో మారెంగోలో ఉంది. రెండు గంటలకు బస్సెక్కితే నేను అక్కడికి రాత్రయ్యే లోపలే చేరుకోగలను. అక్కడ రాత్రంతా అమ్మ భౌతిక కాయం పక్కన గడపాల్సి ఉంటుంది. రేపు సాయంత్రం కల్లా నేను వెనక్కి తిరిగి వచ్చెయ్యవచ్చు. అందుకే మా యజమానిని రెండు రోజులు లీవ్ కావాలని అడిగాను. ఆయన ఇవ్వనని తిరస్కరించలేనటువంటి కారణం. అయితే ఆయన కోపంగా చూశాడని నాకెందుకో అనిపించింది. వెంటనే ఇంకో నిముషం కూడా ఆలోచించకుండా "సారీ, సర్ ! కానీ అది నాతప్పు కాదు. మీకు తెలుసు కదా" అన్నాను.

అయితే నాకు తర్వాత అనిపించింది – నేను అలా అని ఉండకూడదేమోనని. అట్లా అనాల్సిన అవసరం కూడా లేదు. నేను సారీ చెప్పాల్సిన కారణం కూడా ఏమీ లేదు. నిజానికి ఆయనే నాకు సానుభూతి తెలియ జేయాల్సి ఉంది. రేపు బహుశా నేను నల్లని సంతాప సూచక దుస్తుల్లో ఆఫీసులోకి అడుగు పెట్టినపుడు ఆయన ఆ పని చేయొచ్చు. ప్రస్తుతానికి అమ్మ ఇంకా చనిపోనట్టే. అంత్య క్రియలు అయిన తర్వాత కానీ ఆ విషాదానికి అధికారికంగా ఆమోద ముద్ర పడదు.

రెండు గంటల బస్సెక్కి ఆ ఊరు బయలుదేరాను. మధ్యాహ్నం ఎండ మండిపోతోంది. ఎప్పటిలాగానే సెలెస్టి రెస్టారెంట్‌లో లంచ్ చేశాను. అందరూ ఎంతో సానుభూతి చూపించారు. సెలెస్టి అయితే "అమ్మలాంటి వాళ్ళు లోకంలో ఇంకెవ్వరూ ఉండరు" అన్నాడు. నేను బయలు దేరి వెళ్ళేటపుడు వాళ్ళందరూ గుమ్మంవరకూ వెంట వచ్చి సాగనంపారు. హడావుడిగా బయలుదేరి వస్తూ ఆఖరి నిముషంలో నేను ఇమాన్యుయల్

ఇంటికి కూడా వెళ్ళాల్సి వచ్చింది. బ్లాక్‌టై, సంతాప సూచకంగా ధరించే బాండ్‌ను అతన్నుంచి తీసుకుందామని వెళ్ళాను. కొన్ని నెలలకిందట ఇమాన్యుయెల్ మామ చనిపోయాడు.

బస్సుకోసం చివర్లో పరుగులు పెట్టాల్సి వచ్చింది. బయట నిప్పులు కక్కుతున్న సూర్యుడు, బస్సు కుదుపులతో కళ్ళు మూతలు పడటం ప్రారంభించాయి. దానితో ఎక్కువ సేపే నిద్రపోయాను. లేచేటప్పటికి నా పక్కన కూర్చున్న ఓ సైనికుడి భుజానికి నా తల ఆనుకుని ఉంది. అతను నన్ను చూసి చిన్నగా నవ్వాడు. నవ్వి, చాలా దూరంనుంచి వస్తున్నారా అని అడిగాడు. నేను తల మాత్రం ఆడించి ఊరుకున్నాను. నేను మాట్లాడగలిగే పరిస్థితిలో లేను.

వృద్ధాశ్రమం ఊరికి ఒక మైలు దూరంలో ఉంది. అక్కడికి కాలి నడకనే వెళ్ళాను. అమ్మను ఒకసారి చూడనిస్తారా అని అక్కడ ఉన్న వాచ్‌మెన్‌ను అడిగాను. అయితే ముందు వార్డెన్‌ను కలవాల్సి ఉంటుందని అతను చెప్పాడు. వార్డెన్ పని వత్తిడిలో ఉన్నాడు. కాసేపు బైట వేచి ఉండాల్సి వచ్చింది. వాచ్‌మెన్ నాతో మాట్లాడుతూ అక్కడే ఉండి పోయాడు. తర్వాత అతనే నన్ను వెంటబెట్టుకుని వార్డెన్ ఆఫీసుకి తీసుకుని వెళ్ళాడు.

వార్డెన్ చాలా చిన్న మనిషి. తెల్లబడి పోతున్న జుట్టుతో షర్టు బటన్ హోల్‌లో గులాబీ పువ్వు రూపంలో తయారు చేసిన గౌరవ చిహ్నాన్ని ధరించి ఉన్నాడు. అతను నా వంక కొద్దిసేపు తన నీలికళ్ళతో సుదీర్ఘంగా చూస్తూ కూర్చున్నాడు. తర్వాత మేం షేక్‌హాండ్ ఇచ్చుకున్నాం. ఆయన నా చేతిని ఓదారుస్తున్నట్టుగా చాలాసేపు నొక్కుతూ ఉండిపోవడం నాకు కొంచెం ఇబ్బందిగా అనిపించింది. తర్వాత తన ముందున్న రిజిస్టర్‌ని ఒకసారి తిరగేసి "మేడమ్ మెర్‌సాల్ట్ మూడేళ్ళ కిందట వృద్ధాశ్రమానికి వచ్చారు. ఆవిడకు వేరే జీవనాధారం ఏదీ లేదు. పూర్తిగా మీ పైనే ఆధారపడ్డారు" అన్నాడు. ఆయన ఎందుకో నన్ను తప్పుపడుతున్నాడేమోనని నాకు అనిపించి సంజాయిషీ ఇచ్చుకోబోయాను. కానీ ఆయన దానికి అవకాశమివ్వలేదు.

"ఇందులో నువ్వు సంజాయిషీ ఇచ్చుకోవలసిన అవసరం ఏం లేదు. నేను రికార్డు అంతా చూశాను. మీ అమ్మను జాగ్రత్తగా చూసుకోగలిగిన పరిస్థితిలో నువ్వు లేవు. ఆవిడ వెంట ఎప్పుడూ ఎవళ్ళో ఒకళ్ళు ఉండి చూసుకుంటూ ఉండాలి. నీలాగా చిన్న చిన్న ఉద్యోగాల్లో ఉండేవారికి ఎక్కువ జీతం ఉండదు. అయితే ఆవిడ వృద్ధాశ్రమంలో చాలా సంతోషంగా ఉందనే చెప్పాలి" అన్నాడు.

"అవునండి. ఆ విషయం నిజమే" అన్నాను.

"ఆవిడకు ఇక్కడ తన వయస్సువారే మంచి స్నేహితులు దొరికారు. ఎవరికి వారు వాళ్ళ వయస్సువాళ్ళతోనే కలసి పోగలరు. నువ్వు ఇంకా చిన్నవాడివి. ఆమెకు నువ్వు

సరైన తోడు అవలేవు" అన్నారాయన. అది నిజమే. అమ్మా, నేనూ కలసి ఉన్నప్పుడు ఆవిడ ఎప్పుడూ నన్ను నిశితంగా గమనిస్తూ ఉండేది. అంతే తప్ప మేం మాట్లాడుకోటం అరుదు. వృద్ధాశ్రమానికి వచ్చిన కొత్తల్లో ఆమె ఏడ్చింది కూడా. అయితే అక్కడి కొత్త వాతావరణానికి అలవాటు పడేవరకే అది. నెలా రెండునెలల తర్వాత ఆమెను వృద్ధాశ్రమం నుంచి పంపించివేస్తామని ఎవరన్నా అని ఉంటే ఆవిడ ఇంకా ఎక్కువ ఏడ్చి ఉండేది. నిజానికి అది కూడా నాకు శ్రమనీ బాధని కలిగించే విషయమే. అందుకే పోయినేడాది నేను ఆమెను చూడటానికి కనీసం ఒక్కసారన్నా వెళ్ళలేదు. అంతే కాదు అక్కడికి వెళ్ళడమంటే నేను నా ఆదివారాన్ని కాస్తా పోగొట్టుకున్నట్టే. పైగా టిక్కెట్టు తీసుకుని బస్సులో కూర్చుని రెండూ రెండూ నాలుగు గంటలు రానూపోనూ ప్రయాణం చేయడం గురించి సరేసరి చెప్పక్కర్లేదు.

తర్వాత వార్డెన్ కాసేపు మాట్లాడాడు. నేను అంతగా పట్టించుకోలేదు. చిట్టచివరికి, "మీరు మీ అమ్మను చూడాలని అనుకుంటున్నారా" అని నన్ను అడిగాడు. నేను సమాధానం చెప్పకుండా వెంటనే లేచి నుంచున్నాను. ఆయన కూడా నాతో పాటు నడుస్తూ గుమ్మంవరకూ వచ్చాడు. మేం మెట్లు దిగుతున్నప్పుడు "ఆమె భౌతిక కాయాన్ని నేను మా మార్చురీకి పంపించాను. ఎందుకంటే – మిగిలిన వృద్ధులందరూ ఆ కారణంగా మానసికంగా ఇబ్బంది పడకుండా ఉండాలని. మీకు అర్థం అయ్యిందనుకుంటాను. ఇక్కడ ఎవరైనా చనిపోయినప్పుడల్లా రెండు మూడు రోజుల పాటు వాళ్ళు గందరగోళ పడుతుంటారు. దాని మూలంగా మా సిబ్బందికి మరింత అదనపు పని, అదనపు ఆందోళన" అన్నాడాయన. మేం కిందకు దిగినప్పుడు అక్కడి ఆవరణలో కొంతమంది వృద్ధులు చిన్నచిన్న గుంపులుగా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. మేం వాళ్ళ దగ్గరకు రాగానే వాళ్ళు మాట్లాడుకోడం ఆపేశారు. మేం వాళ్ళని దాటి రాగానే మాట్లాడుకోటం ప్రారంభించారు. వాళ్ళ గొంతులు నాకు బోనులోని చిలుకల ధ్వనిని గుర్తుకు తెచ్చాయి. వార్డెన్ ఒక చిన్న భవన ప్రవేశ ద్వారంవద్ద ఆగాడు.

"ఇంక నేను వెళతాను మిస్టర్ మెర్‌సాల్ట్. మీకు నాతో ఏదన్నా పని ఉంటే నేను ఆఫీసులోనే ఉంటాను. అక్కడికి రండి. అంత్య క్రియలు రేపు పొద్దున జరపాలని అనుకుంటున్నాం. ఈ రాత్రంతా మీకు మీ అమ్మ భౌతికకాయం పక్కనే గడపడానికి అవకాశం లభిస్తుంది. మీరూ దానినే కోరుకుంటున్నారని నాకు తెలుసు. ఇంకో విషయం, మీ అమ్మ స్నేహితులనుంచి నేను తెలుసుకున్న విషయం ఒకటుంది. చర్చి ప్రీస్టుల ఆధ్వర్యంలో తన భౌతికకాయాన్ని ఖననం చేయాలని ఆవిడ కోరికట. అది కూడా మీకు చెప్పడం మంచిదని చెబుతున్నాను."

నేను ఆయనకు కృతజ్ఞతలు తెలిపాను. నాకు తెలిసినంత వరకు మా అమ్మ అంత

గాఢమైన భక్తురాలు కాదు. ఆవిడ మతం గురించి తన జీవితంలో ఎప్పుడూ అంతగా ఆలోచించలేదు. నేను మార్చురీలోకి అడుగుపెట్టాను. అది పరిశుభ్రంగా, ప్రకాశవంతంగా ఉన్న పెద్దగది. గోడలకు వెల్లవేసి ఉండటంతో గది మరింత ప్రకాశవంతంగా ఉంది. గదిలో కొన్ని కుర్చీలు, బల్లలు, ఉన్నాయి. రెండు బల్లల్ని గది మధ్యలో చేర్చి దానిపై శవపేటికను ఉంచారు. శవపేటిక పై మూతవేసి ఉన్నప్పటికీ స్క్రూలను వదులుగా ఒకటి రెండు చుట్లు బిగించి ఉంచారు. ఒక అరబ్ స్త్రీ – బహుశా నర్సు కావచ్చు. శవ పేటిక పక్కన కూర్చుని ఉంది. ఆవిడ నీలి రంగు బురఖా వేసుకుని ముతకగా ఉన్న స్కార్ఫ్‌ను తలచుట్టూ కప్పుకుని ఉంది. వాచ్‌మన్ నా వెనుకనే అక్కడికి పరుగెత్తుకుని వచ్చాడు. పరిగెత్తడం మూలంగా కొంచెం సేపు రొప్పుతూ నుంచుని "శవపేటికపై మూత వేసి ఉంచాం. అయితే మీరు రాగానే మీ అమ్మను చూడటానికి వీలుగా మూత తొలగించమని నాకు చెప్పారు" అన్నాడతను. అతడు శవపేటిక వైపు నడుస్తుండగా అంత అవసరం లేదని నేను చెప్పాను.

"అరె. ఏమిటి మీరంటున్నది? శవపేటిక మీద మూత ......" అంటూ అర్థోక్తిగా ఆగాడతను.

"అక్కర్లేదు" అన్నాన్నేను.

అతను స్క్రూడ్రైవర్ని తిరిగి తన జేబులో పెట్టుకుని నావంక ఆశ్చర్యంగా తదేకంగా చూస్తూ నిలబడ్డాడు. అక్కర్లేదని అనకుండా ఉండాల్సిందేమోనని నాకు తర్వాత అనిపించింది. అది నన్ను కొంత ఇబ్బంది పెట్టింది. అతడు కొన్ని క్షణాలు నన్ను అలాగే చూసి "ఎందుకు వద్దన్నారు"? అని అడిగాడు. అయితే అందులో తృణీకార భావం ఏమీలేదు. కేవలం తెలుసుకోవడానికి అడిగినట్లుంది. "ఎందుకో నేను స్పష్టంగా చెప్పలేను" అన్నాన్నేను. అతను కొద్దిసేపు మీసాలు సరిచేసుకుంటూ నిలబడ్డాడు. తర్వాత నా వైపు కూడా చూడకుండానే నెమ్మదిగా "నేను అర్థం చేసుకోగలను" అన్నాడు.

అతను నీలి కళ్ళతో ప్రసన్నంగా కనిపించే వ్యక్తి. అతను శవపేటిక పక్కన నా కోసం ఒక కుర్చీని జరిపి నా వెనుకగా తను కూర్చున్నాడు. నర్సు లేచి గుమ్మంవైపు నడిచింది. ఆమె మా పక్క నుంచి దాటి పోగానే "ఆమెకు పాపం ట్యూమర్" అని వాచ్‌మన్ నా చెవిలో గుసగుసగా అన్నాడు. ఆమె వంక నేను మరింత పరిశీలనగా చూశాను. ఆమె తల చుట్టూ కళ్ళ కింద నుంచీ బ్యాండేజీ కట్టబడి ఉంది. అది ఆమె ముక్కును కూడా దాదాపు కనబడనట్టు చేసి తెల్లని బ్యాండేజీ తప్ప మొహాన్ని పూర్తిగా మూసివేసినట్టు చేసింది. ఆమె వెళ్ళి పోగానే వాచ్‌మన్ కూడా లేచి నిలబడ్డాడు.

"నేను కాసేపు మిమ్మల్ని ఒంటరిగా వదిలివేస్తున్నాను" అంటూ. ఏమనాలో నాకు వెంటనే తోచలేదు. అయితే ఆ మాట అని, వెంటనే వెళ్ళిపోకుండా కాసేపు నా కుర్చీ

వెనుకే నిలబడ్డాడు. నా వెనుక అలా నిలబడడం నాకు కొంచెం అసౌకర్యంగా అనిపించింది. సూర్యుడు ఆకాశంలోంచి నెమ్మదిగా దిగిపోతున్నాడు. గది అంతా ఆహ్లాదకరమైన లేత కాంతితో నిండి పోయింది. రెండు కందిరీగలు జుమ్మని శబ్దం చేస్తూ తలమీదుగా ఎగురుతున్నాయి. నాకు బాగా నిద్ర కమ్ముకు వస్తోంది. కళ్ళు కూడా పూర్తిగా తెరిపిడి పడటంలేదు. వాచ్‌మన్ వంక పూర్తిగా చూడనన్నా చూడకుండానే అతను ఈహోమ్‌లో ఎన్నేళ్ళ నుంచీ ఉంటున్నాడని అడిగాను. 'అయిదేళ్ళ నుంచీ' అని చెప్పాడు. టపీమని సమాధానం చెప్పిన తీరు చూస్తే నేను ఈ ప్రశ్న అడుగుతానని ముందే ఊహించినట్టు అనిపించింది.

ఇక అక్కడి నుంచీ ఆగకుండా కబుర్లు చెప్పడం మొదలు పెట్టాడు. మారెంగోలోని ఒక వృద్ధాశ్రమంలో వాచ్‌మన్‌గా ఉండాల్సి వస్తుందని పదేళ్ళ కిందట ఎవరన్నా చెప్పినా నమ్మి ఉండేవాడు కాదు. అతనికి అరవైనాలుగేళ్ళట. పారిస్ అతని స్వస్థలం. ఆ మాట చెప్పగానే నేను ఒక్క నిముషం కూడా ఆలోచించకుండా వెంటనే "అయితే మీరు ఇక్కడి వాళ్ళు కాదా" అని అడిగాను.

అప్పుడు గుర్తొచ్చింది వార్డెన్ దగ్గరికి తీసుకువెళ్ళడానికి ముందు అతను అమ్మ గురించి కొన్ని విషయాలు చెప్పాడని. ఇక్కడి మైదానాల్లో ఎండలు విపరీతంగా ఉంటాయి. అందువల్ల అమ్మను వీలైనంత త్వరగా ఖననం చేయడం మంచిదని చెప్పాడు. "పారిస్‌లో భౌతిక కాయాన్ని కనీసం మూడు రోజుల పాటు అలాగే ఉంచేస్తారు. ఒకోసారి నాలుగు రోజులు కూడా. ఇక్కడ అన్ని పనులు త్వరత్వరగా చేయాలి. ఎవరన్నా చనిపోతే ఆ విషయం మనకు అర్థమయ్యేలోపే అంత్య క్రియలు కూడా పూర్తి చేయాల్సి ఉంటుంది" అన్నాడు. అంతలో అతని భార్య జోక్యం చేసుకుని "ఇంక చాల్లే ఆపు. పాపం అంత చిన్నాయనతో ఆ మాటలేంటి" అంటూ వాచ్‌మన్‌ను మందలించింది. అతను సిగ్గుపడి క్షమాపణ అడగటం మొదలు పెట్టాడు. ఏం ఫరవాలేదని నేను సర్ది చెప్పాను. నిజానికి అతను చెబుతున్నదంతా నాకు చాలా ఆసక్తికరంగా కనిపించింది. అలాంటి విషయాల గురించి నేను అంతకు ముందు ఆలోచించలేదు.

అతను వృద్ధాశ్రమంలో మొదట ఉండడానికన్నట్టు వచ్చాడట. అయితే అతని ఆరోగ్యం చాలా బాగుండేదట. దానితో వాచ్‌మెన్ ఉద్యోగం ఖాళీ అవడంతో అందులో చేరతావా అని అడగ్గానే ఒప్పుకుని చేరిపోయాడట. అయినప్పటికీ అతను ఆ ఆశ్రమంలో ఒకడిగానే అన్పిస్తున్నాడని నేను అన్నాను. అయితే అతను ఆ మాట వినిపించుకునే ధోరణిలో లేడు. అతను అక్కడ "అధికార వ్యక్తి".

వెంటనే నాకు ఆశ్రమంలో వారి గురించి అతను 'వాళ్ళు', 'ఆ వృద్ధులు' అన్నట్టు మాట్లాడటం గుర్తొచ్చింది. ఇప్పుడు ఆ మాటల్లోని అర్థం నాకు స్ఫురణకు వచ్చింది.

వాచ్‌మన్‌గా అతనికి ఆ వృద్ధాశ్రమంలో ఒక సుస్థిరమైన, అధికారిక స్థానం ఉంది. మిగిలిన వాళ్ళకు అది లేదు. అప్పుడే నర్సు తిరిగి వచ్చింది. చాలా త్వరగా రాత్రి అయిపోయినట్టు అనిపించింది. ఆకాశం నల్లగా ఉంది. వాచ్‌మన్ లైట్లు వేశాడు. ఆ కాంతికి నాకు ఒక్కసారి కళ్ళు బైర్లు కమ్మినట్టు అనిపించింది. డిన్నర్ చేయడానికి భోజనాల గదికి వెళ్ళాల్సి ఉంటుందని వాచ్‌మన్ నాకు చెప్పాడు. అయితే నాకు ఆకలనిపించలేదు. ఒక కప్పు కాఫీ తీసుకురానా అని అడిగాడు. నాకు కాఫీ అంటే ఇష్టం. అందుకే అతనికి 'థ్యాంక్స్' చెప్పాను. కొద్ది నిముషాల తర్వాత ఒక ట్రేతో వచ్చాడు. నేను కాఫీ తాగాను. తర్వాత సిగరెట్ తాగాలనిపించింది. అయితే ఈ పరిస్థితుల్లో అమ్మ సమక్షంలో సిగరెట్ తాగవచ్చో లేదో తెలీలేదు. "అంతా అయిపోయింది" ఇక ఇందులో అంత ఆలోచించాల్సింది ఏముందని నాకు అనిపించింది. అందుకే నేనొక సిగరెట్ తీసుకుని వాచ్‌మెన్‌కు ఒక సిగరెట్ ఇచ్చాను. సిగరెట్ పీల్చిన తర్వాత అతను తిరిగి మాట్లాడటం మొదలుపెట్టాడు.

"మీ అమ్మ స్నేహితులు కొందరు ఇప్పుడు ఇక్కడికి వస్తారు. భౌతిక కాయం పక్కన శవ జాగరణ చేయడానికి. ఇక్కడ ఎవరు చనిపోయినా ఇలా శవ జాగరణ చేస్తారు. నేను వెళ్ళి కొన్ని కుర్చీలు, కొంచెం బ్లాక్ కాఫీ తీసుకురావాల్సి ఉంటుంది" అని అతను చెప్పాడు. తెల్లని గోడల నుంచి వెలువడుతున్న కాంతి కళ్ళకి మిరుమిట్లు గొలుపుతున్నట్టు అనిపించింది. ఒక లైటునన్నా ఆర్పి వేయమని అడిగాను. అతను 'లాభం లేదు' అన్నాడు. ఉంటే అన్ని లైట్లు ఉంటాయి. లేకపోతే అన్ని లైట్లు ఒకేసారి పోయేలా వాటిని అమర్చారని చెప్పాడు. తర్వాత నేను ఇంక అతని మాటల్ని అంతగా పట్టించుకోలేదు. అతను వెళ్ళి కొన్ని కుర్చీలు తీసుకుని వచ్చి శవపేటిక చుట్టూరా అమర్చాడు. ఒక కుర్చీలో కాఫీ పాట్‌ని, డజను కప్పుల్ని పెట్టాడు. తర్వాత అమ్మకు దూరంగా నాకు అభిముఖంగా ఒక కుర్చీలో కూర్చుండిపోయాడు. నర్సు – గదికి మరో వైపు ముందుకు తిరిగి కూర్చుని ఉంది. ఆమె ఏం చేస్తోందో నాకు కన్పించలేదు. అయితే ఆమె చేతుల కదలికలను బట్టి ఆమె ఏదో అల్లుతున్నట్లు ఊహించగలిగాను. నాకు కాస్త తేలికగా, సుఖంగా అనిపించింది. కాఫీ కొంచెం వెచ్చదనాన్ని కలిగించింది. తెరచి వున్న తలుపుల నుంచి మధురమైన పూల పరిమళాలు, చల్లటిగాలి తేలి వస్తున్నాయి. నేను కాసేపు నిద్ర కూడా పోయినట్టున్నాను.

ఏదో ఒకలాంటి ధ్వని వినిపించి మేల్కొన్నాను. కాసేపు కళ్ళు మూసుకుని ఉండటంతో లైట్ల కాంతి ఇది వరకటి కన్నా ఇంకా ఎక్కువ అయినట్టు అనిపించింది. ఎక్కడా చీకటి ఛాయ కూడా లేదు. ప్రతి వస్తువు, గదిలోని ప్రతి మూలా కళ్ళకు కట్టినట్టు కనిపిస్తోంది. అమ్మ స్నేహితులు ఒకరొకరే గదిలోనికి వస్తున్నారు. వాళ్ళు పదిమంది ఉన్నట్టు

లెక్కపెట్టాను. ఆ తెల్లటి కాంతిలో దాదాపు ఏ చిన్న చప్పుడూ కాకుండా వాళ్ళు వస్తున్నారు. వాళ్ళు కుర్చీల్లో కూర్చుంటున్నప్పుడు ఏ కుర్చీ కూడా ఎలాంటి శబ్దం చేయలేదు. వీళ్ళనింత నిశితంగా గమనించినంతగా నా జీవితంలో అంతకు ముందెప్పుడూ నేను ఎవర్నీ గమనించలేదు. వాళ్ళ ముఖ కవళికలు కానీ, వాళ్ళు ధరించిన దుస్తులు - ఏవీ నా కళ్ళ నుంచి తప్పించుకోలేకపోయాయి. అయితే వాళ్ళ నుంచి ఒక్క శబ్దమూ రావడం లేదు. అసలు ఆ గదిలో వాళ్ళు ఉన్నట్టే అనిపించలేదు.

అక్కడ ఉన్న ఆడవాళ్ళలో దాదాపు అందరూ యాప్రన్‌లు ధరించి ఉన్నారు. యాప్రన్‌ల బొందుల్ని నడుము చుట్టూ తిప్పి ముడివేయడంతో వాళ్ళ పొట్టభాగం మరింత ముందుకు వచ్చినట్టు అనిపించింది. వృద్ధ స్త్రీలకు అంత పెద్ద పొట్ట ఉండడం అంతకు ముందు నేనెన్నడూ అంతగా చూడలేదు. అయితే మగవాళ్ళలో చాలా మంది గడకర్రల్లా సన్నగా ఉన్నారు. అందరూ చేతి కర్రలతో వచ్చారు. వాళ్ళ మొహాల్లో కళ్ళు అంత త్వరగా కనిపించడం లేదు. ముడుతలలో చిక్కుకుపోయి సన్నటి రేఖల్లా కనిపించీ కనిపించ నట్టున్నాయి.

కుర్చీల్లో కూర్చుంటూ వాళ్ళు నావైపు చూశారు. పళ్ళు లేని దవడలతో నోటిని తాటిస్తూ నావైపు చూసి తలలు ఊగించారు. వాళ్ళు నాకు అభివాదం తెలుపుతున్నారా లేక నాకేదైనా చెప్పడానికి ప్రయత్నిస్తున్నారా అనేది నాకు అర్థం కాలేదు. లేక అది వృద్ధాప్య లక్షణమా అనిపించింది. వాళ్ళు నాకు అభివాదం చేసినట్టే నేను భావించాను. అయితే అంత మంది వృద్ధులు ఒకే దగ్గర కూర్చుని నా వంకే చూస్తూ మధ్య మధ్యలో అలా తలలు అటూ ఇటూ ఊపడం చూడటం కొంచెం వింతగా అనిపించింది. ఒక్క నిమిషం వాళ్ళంతా నా మీద తీర్పుచెప్పడానికి వచ్చి అలా కూర్చున్నట్టు అనిపించి నాకు కొంచెం ఇబ్బంది కలిగింది.

కొన్ని నిమిషాల తర్వాత వాళ్ళలో ఒకావిడ ఏడవడం మొదలుపెట్టింది. ఆవిడ రెండో వరుసలో కూర్చుని ఉంది. మొదటి వరుసలోని ఒక స్త్రీ మొహం అడ్డం రావడంతో ఆవిడ మొహం నాకు కన్పించడంలేదు. ఏడుపు మధ్యలో ఆగి ఆగి వెక్కిళ్ళు పెడుతోంది. అది చూస్తోంటే ఇక ఏడుపు ఆపదేమో అనిపించింది. అయితే మిగిలినవాళ్ళు దానిని పట్టించుకోకుండా నిశ్శబ్దంగా కూర్చుని ఉన్నారు. కుర్చీల్లో కూరుకుపోయి కూర్చుని శవపేటికవంకా, వాళ్ళ చేతికర్రలవైపూ కంటికి ఎదురుగా కనిపించిన ప్రతిదాని వైపూ మార్చి మార్చి చూస్తూ కూర్చున్నారు. ఏడుస్తున్న ఆవిడ వెక్కిళ్ళు పెడుతూనే ఉంది. ఆవిడ ఎవరో నాకు అర్థంకాక కొంచెం ఆశ్చర్యమనిపించింది కూడా. ఆవిడని ఏడవద్దని చెబుదామని అనుకుని కూడా, ధైర్యం చాలక ఆ పని చేయలేక పోయాను. కాసేపు గడచిన తరువాత వాచ్‌మన్ ఆమె వైపు ఒంగి చెవిలో ఏదో చిన్నగా చెప్పాడు. అయితే

ఆవిడ తలకొంచెం ఆడించి ఏదో చిన్నగా గొణిగి తిరిగి వెక్కిళ్ళు పెట్టడం మొదలు పెట్టింది. వాచ్‌మన్ లేచి తన కుర్చీని నాకు దగ్గరగా జరుపుకొన్నాడు. మొదట కాసేపు నిశ్శబ్దంగా ఉండి తర్వాత చెప్పడం మొదలుపెట్టాడు "ఆమెకు మీ అమ్మంటే చాలా ఇష్టం. ఈ ప్రపంచంలో మీ అమ్మ ఒక్కటే తన స్నేహితురాలని ఆవిడ ఎపుడూ అంటూ ఉండేది. ఇప్పుడు ఆవిడ పూర్తిగా ఒంటరిదైపోయింది" అని చెప్పాడు.

నాకు ఏం చెప్పాలో తోచలేదు. తర్వాత కొంత సేపు నిశ్శబ్దం కొనసాగింది. ఆవిడ వెక్కిళ్ళు కూడా క్రమంగా తగ్గుముఖం పడుతున్నాయి. కాసేపు ముక్కు తుడుచుకుని ఎగబీల్చుతూ కూర్చుంది. తర్వాత నిశ్శబ్దంగా ఉండిపోయింది.

నాకు నిద్ర అయితే రావడంలేదు కానీ బాగా అలసిపోయాను. కాళ్ళు విపరీతంగా లాగుతున్నాయి. ఇక్కడ ఇట్లా నిశ్శబ్దంగా వీళ్ళు కూర్చోవడం వల్ల నా నరాలు తోడేస్తున్నట్టు అన్పిస్తోందేమోనని అనుకున్నాను. కాసేపటికి ఒక వింత శబ్దం వస్తున్నట్టు గమనించాను. ఏంటా అని పరిశీలనగా చూస్తే వాళ్ళు బోసి దవడలను ఆడించడం వల్ల వస్తున్న శబ్దంగా అర్థం చేసుకోగలిగాను. వాళ్ళ వాళ్ళ ఆలోచనల్లో ఎంత దీర్ఘంగా మునిగిపోయి ఉన్నారంటే వాళ్ళు ఎలాంటి శబ్దాన్ని చేస్తున్నారో కూడా గమనించేలా లేరు. అసలు వాళ్ళ మధ్యలో ఉన్న భౌతికకాయం గురించి కూడా ఏమీ పట్టించుకోవడం లేదేమో అని ఒక దశలో అనిపించింది కూడా. అయితే అలా అనుకోవడంలో నేను పొరబడి కూడా ఉండవచ్చని అనుకున్నాను.

వాచ్‌మన్ ఇచ్చిన కాఫీని అందరం తాగాం. తర్వాత ఏం జరిగిందన్నదీ నాకు అంతగా గుర్తులేదు. మొత్తానికి ఎలాగో ఆ రాత్రి గడిచింది. అయితే ఒక్కటి మాత్రం నాకు గుర్తుండిపోయింది. నేను ఒకసారి కళ్ళు తెరచి చూసినప్పుడు ఒకే ఒక్కరు తప్ప మిగిలిన వాళ్ళంతా కుర్చీల్లోనే ఒరిగి నిద్రపోతూ కనిపించారు. ఒకాయన మాత్రం చేతి కర్ర చుట్టూ ఉన్న చేతులపై గడ్డం ఆనించి నా కేసే చూస్తూ నేను ఎప్పుడు లేస్తానా అని చూస్తున్నట్టు కనిపించాడు. తర్వాత నేను మళ్ళీ నిద్రపోయాను. పాదాల్లోని నెప్పి కాస్తా మారి కాళ్ళు మొద్దు బారినట్టు అయిపోవడంతో కాసేపటికి నాకు మళ్ళీ మెలుకువ వచ్చింది.

ఆకాశంలో ప్రభాత ఛాయలు కనిపిస్తున్నాయి. ఒక నిముషం తర్వాత వాళ్ళలో ఒకాయన లేచి అదేపనిగా దగ్గడం మొదలు పెట్టాడు. దగ్గినపుడల్లా చేతిలోని పెద్ద గళ్ళ కర్చీఫ్‌లో ఉమ్మడం చేస్తున్నాడు. ఈ శబ్దం మిగిలిన వాళ్ళను కూడా నిద్ర లేపింది. ఇక వెళ్ళిపోవచ్చని వాచ్‌మన్ చెప్పడంతో అందరూ ఒక్కసారిగా పైకి లేచారు. అంతటి దీర్ఘమైన కష్టమైన శవ జాగరణవల్ల వాళ్ళ మొహాలు నల్ల కప్పేసినట్టు పీక్కుపోయాయి. నాకు ఆశ్చర్యం కలిగించేలా వాళ్ళలో ప్రతి ఒక్కరూ నాతో కరచాలనం చేశారు. కనీసం

ఒక్కమాట కూడా మాట్లాడుకోపోయినా ఒక రాత్రి అంతా అలా కలసి కూర్చోవటంతో మా మధ్య ఏదో తెలీని దగ్గరితనం ఏర్పడినట్లు అనిపించింది. నేను పూర్తిగా అలసిపోయాను. వాచ్‌మన్ నన్ను తన గదికి తీసుకువెళ్ళాడు. అక్కడ నేను కాళ్ళు చేతులు, మొహం శుభ్రం చేసుకున్నాను. అతను నాకు ఇంకొంచెం కాఫీ ఇచ్చాడు. దానితో నాకు కొంచెం ప్రాణం లేచి వచ్చినట్టు అనిపించింది. నేను బయటకి వచ్చేటప్పటికి సూర్యుడు ఆకాశంలో ఉన్నాడు. మారెంగో ఊరికి, సముద్రానికి మధ్యన ఉన్న కొండల పైనుంచి అరుణ కాంతిని పులుముకుంటున్నాడు. ప్రభాత సమీరం వీస్తోంది. ఉప్పటి గాలి ఆహ్లాదకరంగా వీస్తూ ఆ రోజు వాతావరణం చక్కగా ఉంటుందని చెబుతోంది. నేను పల్లెటూరిని వదిలి కొన్ని సంవత్సరాలు అయింది. అమ్మ కోసం ఈ పరిస్థితుల్లో కాకుండా ఉంటే – అంత ఆహ్లాదకరంగా ఈ మధ్య కాలంలో నేను నడిచి ఉండలేదని అనిపించింది.

కొంత దూరం నడిచి ఆవరణలోని ఒక చెట్టు కింద ఆగాను. నేల నుంచి వస్తున్న చల్లటి గాలిని ఎగబీల్చిన తరువాత ఇంక నిద్ర దూరమైనట్టే అనుకున్నాను. అప్పుడు మా ఆఫీసులోని మిగిలిన వాళ్ళు నాకు గుర్తుకు వచ్చారు. వాళ్ళు ఈ పాటికే నిద్ర లేచి ఆఫీసుకి వెళ్ళడానికి తయారవుతూ ఉంటారనిపించింది. నాకు మాత్రం ఈ రోజంతటి దుర్దినం ఇంకోటి లేదు. అలా ఒక పదినిముషాల పాటు నాలో నేను ఆలోచించుకుంటూ ఉండిపోయాను. భవనం నుంచి వినబడిన గంట నా దృష్టిని ఆకర్షించింది. కిటికీల వెనక కొన్ని కదలికలు కనిపించి మళ్ళీ అంతా నిశ్శబ్దమైపోయింది. సూర్యుడు ఆకాశంలో మరింత పైకి వచ్చాడు. కాళ్ళకు వేడి తెలుస్తోంది. వాచ్‌మన్ నా దగ్గరకు వచ్చి వార్డెన్ నన్ను చూడాలని అనుకుంటున్నట్టు చెప్పాడు. నేను ఆయన ఆఫీసుకి వెళ్ళాను. ఆయన ఏదో డాక్యుమెంట్‌పై నాతో సంతకం చేయించుకున్నాడు. నల్లని దుస్తుల్లో ఉన్నాడు. ఆయన టెలిఫోన్ రిసీవర్ అందుకుంటూ నా వైపు చూశాడు.

"కొద్ది సేపటి కిందట అంత్యక్రియలు చేసే మనుషులు వచ్చారు. శవపేటికను స్క్రూలు బిగించి సిద్ధం చేయడానికి వాళ్ళు మార్చురీకి వెళుతున్నారు. మీ అమ్మని చివరిసారిగా చూసేందుకు వాళ్ళని కాసేపు ఆగమని చెప్పనా" అన్నాడు.

'అక్కర్లేదు' నేను చెప్పాను.

ఆయన రిసీవర్‌లో గొంతు తగ్గించి, చెప్పాడు "వాళ్ళను అక్కడికి వెళ్ళి పని ప్రారంభించమని చెప్పు".

తను కూడా అంత్యక్రియల్లో పాల్గొనడానికి వస్తున్నట్టు ఆయన తర్వాత నాతో చెప్పాడు. నేను ఆయనకు కృతజ్ఞతలు తెలియజేశాను. ఆయన తన పొట్టి కాళ్ళను ఒకదానిపై ఒకటి వేసి కుర్చీలో వెనక్కు వాలి కూర్చున్నాడు. డ్యూటీలో ఉన్న నర్సు కాకుండా

ఆయనా, నేను మాత్రమే అంత్యక్రియల్లో పాల్గొనబోతున్నట్టు ఆయన చెప్పాడు. వృద్ధాశ్రమంలోని వాళ్ళు అంత్యక్రియల్లో పాల్గొనరాదని అక్కడ నిబంధన ఉన్నట్టు చెప్పాడు. అయితే రాత్రిపూట శవజాగరణ చేయడానికి కొంతమంది పాల్గొనడంలో మాత్రం అభ్యంతరం లేదని కూడా అన్నాడు.

"ఇదంతా వాళ్ళకోసమే. వాళ్ళ అభిప్రాయాల్ని అనుభూతుల్ని పట్టించుకోవడం కోసమే. అయితే ప్రత్యేకంగా ఇవాళ మాత్రం మీ అమ్మ స్నేహితుడిని ఒకరిని అంత్యక్రియల్లో పాల్గొనడానికి నేను అనుమతి ఇచ్చాను. ఆయన పేరు థామస్ పెరజ్ అంటూ వార్డెన్ నవ్వాడు. ఒక రకంగా ఇది హృదయాలను కదిలించే కథ. మీ అమ్మ, ఆయనా విడదీయలేనంత మంచి స్నేహితులు అయిపోయారు. మిగిలినవారు మీ అమ్మను కాబోయే భార్య అంటూ పెరజ్‌ను ఏడ్పించేవారు. ఎప్పుడు పెళ్ళిచేసుకో బోతున్నావు అంటూ వెంట పడేవారు. ఆయన నవ్వుతూ కొట్టి పడేసేవాడు. అది ఒక జోక్‌గా మిగిలిపోయింది. ఇప్పుడు మీ అమ్మ మరణం ఆయనను ఎంతగా కదిలించి ఉంటుందో నువ్వు అర్ధం చేసుకోగలవనుకుంటాను. అందుకే అంత్య క్రియలకు హాజరు కాకుండా ఆయనను నేను అడ్డుపెట్టలేక పోయాను. అయితే మా ఆశ్రమ వైద్యుడి సలహామేరకు నేను ఆయనను రాత్రి శవజాగరణలో పాల్గొనకుండా ఆపాను" ఆయన చెప్పుకొచ్చాడు. కొంచెం సేపు మేం మాట్లాడకుండా ఉండిపోయాం. తర్వాత వార్డెన్ లేచి కిటికీ దగ్గరకు వెళ్ళాడు. తనలో తను అనుకుంటున్నట్టు "మారెంగో నుంచి ఫాదర్ వచ్చారు. ఆయన రావాల్సిన దాని కన్నా ముందే వచ్చేశారే" అన్నాడు. గ్రామంలోని చర్చి వద్దకు నడుచుకుంటూ వెళ్ళడానికి దాదాపు ముప్పావు గంట పడుతుందని చెప్పాడు. తర్వాత మేం కిందకు దిగాం.

మార్చురీ గుమ్మం దగ్గర మతాధికారి నిలబడి ఉన్నాడు. ఆయన వెంట ఇద్దరు సహాయకులు ఉన్నారు. వాళ్ళలో ఒకరి చేతుల్లో ధూపం వేసే కలశంలాంటిది ఉంది. మతాధికారి ముందుకు వంగి ధూపం వేసే కలశానికి ఉన్న వెండి గొలుసు పొడవును సరిచేస్తున్నాడు. మమ్మల్ని చూడగానే ఆయన లేచి సరిగా నిలబడి నన్ను 'నా కుమారా' అంటూ కొన్ని మాటలు చెప్పాడు. తర్వాత మేం మార్చురీకి వెళ్ళాం. నల్ల దుస్తులున్న నలుగురు వ్యక్తులు అక్కడ అప్పటికే శవపేటికకు స్క్రూలను బిగించి సిద్ధం చేస్తున్నారు. శవవాహనం కూడా వచ్చినట్టు వార్డెన్ చెప్పగానే ప్రీస్టు ప్రార్థనలు మొదలు పెట్టాడు. అప్పుడు అందరం ముందుకు కదిలాం. నల్లని రిబ్బన్ లాంటి వస్త్రాన్ని పట్టుకుని ఆ నలుగురూ శవపేటిక వద్దకు వెళ్ళారు. ప్రీస్టు, అతని సహాయకులు, నేనూ ఓ ప్రక్కన నిలబడిపోయాం. అంతకుముందు నేను చూడని ఒకామె గుమ్మం పక్కన నిలబడింది. "ఈయనే మెర్‌సాల్ట్" అని వార్డెన్ ఆమెకు చెప్పాడు. ఆవిడ పేరు నాకు తెలియకపోయినా

ఆవిడ ఆశ్రమంలోని నర్సు అయి ఉండొచ్చని ఊహించాను. నన్ను పరిచయం చేసినప్పుడు మొహంలో చిన్న చిరునవ్వు అయినా లేకుండా తలవంచి అభివాదం చేసింది. మొహం పొడవుగా, సన్నగా ఉంది. శవపేటిక వెళ్ళడానికి వీలుగా మేం ఒక ప్రక్కన నిలబడ్డాం. శవవాహకుల వెనుక మేం సింహద్వారం దగ్గరకు వచ్చేసరికి అక్కడ శవవాహనం సిద్ధంగా ఉంది. వార్నిష్ వేసి అద్దాలతో ఉన్న ఆ దీర్ఘచతురస్రాకారపు శవవాహనాన్ని చూడగానే నాకు ఆఫీస్‌లోని పెన్నులను పెట్టుకునే ట్రే గుర్తుకు వచ్చింది. శవవాహనం ప్రక్కన వింతైన వస్త్ర ధారణ వేసిన ఒక వ్యక్తి నిలబడి ఉన్నాడు. చూడగానే మతపరమైన శ్రాద్ధ కర్మలను నిర్వహించే వ్యక్తిగా అర్థం చేసుకున్నాను. ఆయన ప్రక్కన సిగ్గుపడుతున్నట్టు నిల్చున్న వ్యక్తినే మా అమ్మ ప్రియమైన స్నేహితుడు పెరజ్‌గా పోల్చుకోగలిగాను. ఆయన తలపై మెత్తగా అనిపించే టోపీని పెట్టుకుని ఉన్నాడు. గుమ్మంలోంచి శవపేటికను బైటకు తీసుకురాగానే ఆయన టోపీని తీసి చేతితో పట్టుకున్నాడు. షూస్ వరకూ అంటి పెట్టుకున్న ట్రౌజర్లు, షర్టుకి ఏ మాత్రం సరిపోని చిన్న నల్లని టై కట్టుకుని ఉన్నాడు. మొటిమలతో నిండి ఉన్న ముక్కు కింద ఆయన పెదాలు సన్నగా వణుకుతున్నాయి. అయితే మెరుస్తున్న తెల్లటి వెంట్రుకలు నిండి ఉన్న ఆయన పెద్దచెవులు అన్నిటికన్న నన్ను ఎక్కువ ఆకర్షించాయి. అంత్యక్రియలు నిర్వహించే వ్యక్తి మమ్మల్ని మామా స్థానాల్లో నిలబెట్టాడు. శవవాహనం ముందు ప్రీస్టు, నల్లని దుస్తులు ధరించిన నలుగురు వ్యక్తులు వాహనానికి ఇరువైపులా ఉండేట్టు, వార్డెనూ, నేనూ శవవాహనం వెనుక ఉండేట్టు మా వెనుక పెరజ్, నర్సు ఉండేలా సర్దాడు.

ఆకాశంలో సూర్యుడు మండుతున్నాడు. గాలి కూడా వేగంగా వీస్తోంది. సూర్యుడి వేడి కిరణాలు నా వీపుకి గుచ్చుకుంటున్నాయి. నేను వేసుకున్న ముదురురంగు సూట్ నా పరిస్థితిని మరింత దిగజార్చింది. బయలు దేరడానికి మాకు ఎందుకు అంత ఆలస్యం అవుతోందో నాకు అర్థం కాలేదు. పెరజ్ మళ్ళీ తన టోపీ తీసి చేత్తో పట్టుకున్నాడు. వార్డెన్ ఆయన గురించి ఎక్కువగా చెప్పడంతో నేను మధ్యమధ్యలో ఎక్కువగా పెరజ్‌ను గమనిస్తూ ఉండిపోయాను. పెరజ్, మా అమ్మ సాయంత్రాలు వ్యాహ్యాళికి వెళ్ళేవారని వార్డెన్ చెప్పడం నాకు గుర్తొచ్చింది. ఒక్కోసారి నర్సు వెంటరాగా దాదాపు గ్రామం వరకూ నడుచుకుంటూ వెళ్ళి వచ్చేవారట.

నేను కనబడుతున్నంతవరకూ పరిసరాలు చూస్తూ ఉండిపోయాను. పొడవుగా వరుసల్లో పేర్చినట్టున్న సైప్రస్ వృక్షాలు దాదాపు ఆకాశాన్నీ, కొండల్నీ తాకుతున్నట్టు ఉన్నాయి. ఎర్రటి నేల అంతా ఓ తివాచీ పరిచినట్టు కనుల విందుగా ఉంది. అక్కడొకటీ ఇక్కడొకటీ విసిరేసినట్టుగా ఒకటీ అరా ఇళ్ళు బొమ్మరిళ్ళులా ఉన్నాయి. అమ్మకు అలాంటి పరిసరాలు ఇష్టమని నాకు తెలుసు. సాయంత్రాలు ఇలాంటి ఏకాంత ప్రదేశాలు

మనుషుల్ని ఎంతగానో సేద తీరుస్తాయి. అయితే ఇప్పుడు ఈ ఉదయపు ఎండ మాత్రం తట్టుకోలేనంత బాధాకరంగా అమానుషంగా అనిపించింది.

చిట్ట చివరికి మా యాత్ర బయలు దేరింది. పెరెజ్ కాలు కొంచెం కుంటుతూ నడుస్తున్నట్టు అప్పుడే నేను గమనించాను. శవవాహనం కొంచెం వేగంగా వెళ్ళేటప్పటికి పెరెజ్ వెనుకబడి పోయాడు. నల్లని దుస్తుల్లో ఉన్న వ్యక్తుల్లో కూడా ఒకడు వెనుకబడి నాతో పాటు వరుసలోకి వచ్చాడు. సూర్యుడు ఆకాశంలోకి అంత త్వరగా ఎగబాకడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. గాలి రకరకాల కీటకాల ధ్వనులను మోసుకువస్తోంది. నా మొహం నుండి చెమట ధారలు కట్టి కారుతోంది. తలపై టోపీ కూడా లేకపోవడంతో చేతి రుమాలుతో విసురుకోవడం మొదలుపెట్టాను.

నల్లని దుస్తుల్లో ఉన్న వ్యక్తి నా వైపు తిరిగి ఏదో అన్నాడు. అయితే నాకు అది అర్థం కాలేదు. అదే సమయంలో అతను కుడిచేత్తో టోపీ తీసి పట్టుకుని ఎడమచేతిలో ఉన్న చేతి రుమాలుతో నడినెత్తిన ఉన్న చెమటను తుడుచుకోవడం మొదలు పెట్టాడు. మీరు ఏదో అన్నారని ఆయనను అడిగాను. ఆయన ఆకాశం వైపు చూపించి "ఇవాళ ఎండ ఎక్కువగా ఉంది కదా" అన్నాడు. నేను 'అవును' అన్నాను. అతను కొంచెం సేపు ఊరుకుని "ఇప్పుడు ఖననం చేయబోయేది మీ అమ్మనేనా" అని అడిగాడు. నేను మళ్ళీ 'అవును' అన్నాను.

"ఆమె వయసు ఎంత"

"ఏదో నడుస్తోంది" అన్నాన్నేను. నిజానికి అమ్మ వయసు కచ్చితంగా ఎంతో నాకు తెలీదు. తర్వాత అతను మౌనంగా ఉండిపోయాడు. నేను వెనక్కి తిరిగి చూశాను. పెరెజ్ యాభై అడుగుల వెనగ్గా మెల్లగా కుంటుతూ వస్తున్నాడు. ఆయన తన టోపీ తీసి చేత్తో గిర్రున తిప్పుతూ నడుస్తున్నాడు. నేను వార్డెన్ వంక చూశాను. ఆయన ప్రతి అడుగు జాగ్రత్తగా కొలిచివేసినట్టు మరీ లెక్కపెట్టుకుంటూ నడుస్తున్నాడు. ఆయన నుదిటిన కూడా చెమట బిందువులు మెరుస్తున్నాయి. అయితే ఆయన వాటిని తుడుచుకునే ప్రయత్నం చేయడం లేదు.

మా చిన్న ఊరేగింపు మరీ అంత వేగంగా వెళ్ళడం లేదేమోనని నాకు అనిపించింది. ఆకాశంలోకి ఎప్పుడు చూసినా అదే సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. సూర్యకిరణాలు కళ్ళెత్తి చూడలేనంత తీక్షణంగా ఉన్నాయి. ఊరంతా సూర్యకిరణాల తాకిడికి ఉడికి పోతూంది. అప్పుడే కొత్తగా వేసిన తారురోడ్డులోకి మా యాత్ర మలుపు తిరిగింది. ఆ రోడ్డు మీద నుంచీ వేడి ఆవిర్లు వస్తున్నట్లు అనిపించింది. చెమట తడికి అడుగు తీసి అడుగు వేయడం కష్టంగా ఉంది.

బండి నడిపే వ్యక్తి పెట్టుకున్న నల్లటి టోపీ శవవాహనం పైనుంచి వింతగా

కన్పిస్తోంది. ఆకాశంలో మండుతున్న తెల్లటి ఎండ, కింద శవవాహనం, దాని చుట్టూ పరుచుకున్న నల్లదనం, రోడ్డుపై బూడిద, వెండి కలిపిన రంగుల్లోపడిన బండి చారలు అన్నీ కలిపి ఏదో కలలోని వింత దృశ్యంలా కనిపిస్తున్నాయి. దానికి తోడు ఏవో వింత వాసనలు - శవవాహనాన్ని లాగుతున్న గుర్రాల పేడ, అగరవత్తులు, తోలు వాసన అన్నీ కలగలిపి వస్తున్న చిత్రమైన వాసన. వీటన్నింటికి తోడు రాత్రంతా నిద్ర లేకుండా ఉండడంతో కళ్ళే కాదు ఆలోచనలు కూడా మసకబారుతున్నట్టు అనిపించింది.

నేను మళ్ళీ వెనక్కి తిరిగి చూశాను. పెరెజ్ ఎక్కడో దూరంగా కనిపించాడు. తరువాత ఉన్నట్టుండి కనబడకుండా పోయాడు. ఏమయ్యాడో అని నేను ఆలోచిస్తున్నంతలో ఆయన బహుశా పొలాల్లోకి దిగి అడ్డదారిలో వస్తుండవచ్చని నాకు తట్టింది. ఈ ప్రాంతాలన్నీ ఆయనకు పరిచితమైనవే కదా. తర్వాత ఆయన రోడ్డెక్కి కొంత దూరం నడిచి మళ్ళీ రోడ్డు మలుపు తిరిగినపుడు కనిపించకుండా పోయాడు. మేం నడిచిన ఆ అరగంటలో ఆయన అనేకసార్లు అలా కనిపించకుండా పోయాడు. తర్వాత నేను ఆయన కదలికలను పట్టించుకోవడం మానేశాను. నా కాలి మడమలు ఎంతగా నెప్పి పుడుతున్నాయంటే నేను కాళ్ళను దాదాపు ఈడ్చుకుంటూ నడవాల్సి వస్తోంది.

ఆ తర్వాత అన్నీ త్వరత్వరగా జరిగిపోయాయి. అవి ఎంత త్వరగా జరిగిపోయాయి అంటే నాకు ఖచ్చితంగా ఏది ఎట్లా జరిగిందనే వివరాలు కూడా గుర్తులేకుండా పోయాయి. ఊరి పొలిమేర్లలో ఉన్నప్పుడు నర్సు నాతో మాట్లాడటం మినహా నాకు ఇంకే విషయమూ గుర్తులేకుండా పోయింది.

ఆమె గొంతు నన్ను ఆశ్చర్య చకితుడ్ని చేసింది. ఆమె మొహానికి ఏ మాత్రం సంబంధం లేని గొంతు. ఆమె గొంతు సంగీత భరితంగా మృదు మధురంగా ఉంది. "మరీ నిదానంగా వెళితే ఎండ దెబ్బ తగుల్తుంది. అలాగని వేగంగా వెళదామంటే చెమటపట్టి ఆయాసం వస్తుంది. మళ్ళీ చర్చిలోని అతి చల్లటి గాలి వణుకు పుట్టిస్తుంది" అని ఆమె అంది.

ఆమె చెప్పింది నాకు అర్థమైంది. ప్రతిదానిలో ఏదో ఒక ఇబ్బంది ఉంది.

అంత్య క్రియలకు సంబంధించి ఇంకొన్ని జ్ఞాపకాలు నాకు మనసులో పాతుకుని పోయాయి. ఊరి బయట చివరిసారిగా చూసిన వాచ్‌మన్ మొహం, అతని కళ్ళ నుండి కారిన కన్నీరు కిందకు జారకుండా ముడతల్లో చిక్కుకుపోయి చెల్లాచెదురుగా మొహాన్ని కప్పేయడం, అలసి వాడినట్టున్న మొహం, ఊళ్ళోని చర్చి, వీధుల్లోని గ్రామస్తులు, ఎర్రటి రంగుల్లోని సమాధులు, కుంటుతున్న బొమ్మలాంటి పెరెజ్, అమ్మ శవపేటిక పైన పరిచిన ఎర్రటి మట్టి, మట్టిలోని తెల్లటి వేర్లు అన్నీ మనో ఫలకం మీద అలా

నిలిచిపోయాయి.

తర్వాత గుంపులు గుంపులుగా జనం, రకరకాల ధ్వనుల మధ్య బస్సుకోసం ఎదురు చూడడం, ఇంజన్ శబ్దం, అల్జీర్స్ వీధుల్లోకి, వీధి దీపాలతో ప్రకాశవంతంగా ఉన్న నగరపు సరిహద్దుల్లోకి ప్రవేశించగానే కలిగిన ఆనందం - ఇదంతా మరొకరకం అనుభవం. ఇంటికి వెళ్ళి సరాసరి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళడం మాత్రమే నాకు గుర్తుంది. తర్వాత ఏక ధాటిగా దాదాపు పన్నెండు గంటల పాటు నిద్రపోయాను.

# 2

రెండు రోజుల సెలవు అడిగినప్పుడు మా యజమాని మొహం ఎందుకు అదోలా అయిందో నాకు నిద్ర లేచిన తర్వాత గానీ అర్థంకాలేదు. ఇవాళ శనివారం. ఈ విషయం నాకు ఆరోజు తట్టలేదు. మంచం మీద నుండి లేస్తూండగా ఇప్పుడు తట్టింది. అంటే నాకు వరుసగా నాలుగు రోజుల సెలవు దొరికినట్టు. ఆయనకు ఇలాంటి విషయాలు అంతగా రుచించవని మాకు తెలిసిందే. అయితే అమ్మను ఇవ్వాళ కాకుండా నిన్న ఖననం చేయడం అనేది నా తప్పు కాదు. అట్లా అయినా నాకు శని, ఆదివారాలు సెలవులు వచ్చేవి. అయితే మా యజమాని దృష్టిలోంచి ఈ విషయాన్ని చూడక నాకు తప్పింది కాదు.

మంచంమీద నుంచి లేవడం కూడా కష్టమయింది. నిన్నటి రోజు ఎదురైన అనుభవాలన్నింటితో పూర్తిగా అలసిపోయాను. గడ్డంచేసుకుంటూ ఇవాల్టి ఉదయాన్ని ఎలా గడపాలా అని ఆలోచించాను. నేనున్న పరిస్థితుల్లో ఈత కొట్టడం వల్ల కాస్త సేద తీరవచ్చని అనిపించింది. దానితో హార్బర్‌కు వెళ్ళే ట్రామ్ పట్టుకున్నాను.

స్విమ్మింగ్ పూల్ ఎప్పటిలాగే జన సమ్మర్ధంగా యువతీ యువకులతో నిండిపోయి ఉంది. వాళ్ళల్లో ఒకప్పుడు మా ఆఫీసులో టైపిస్టుగా పనిచేసిన మేరీ కార్డొనా అనే ఆమె కూడా ఉంది. ఆ రోజుల్లో ఆమె అంటే నాకు కొంచెం ఆసక్తి ఉండేది. నేను అన్నా ఆమెకు ఇష్టం ఉండి ఉండేదని నా నమ్మకం. అయితే ఆమె మా ఆఫీసులో చాలా కొద్ది కాలం మాత్రమే ఉండటంతో అది అంతలోనే ముగిసిపోయింది.

స్విమ్మింగ్ పూల్ ఒడ్డున ఉన్న కొయ్య పలక మీదకు ఎక్కేందుకు ఆమెకు చెయ్యి అందించినప్పుడు నా చేయి అనుకోకుండా ఆమె రొమ్ములకు తగిలింది. తర్వాత ఆమె కొయ్య పలక మీద వెల్లకిలా పడుకుని విశ్రాంతి తీసుకుంటుండగా నేను కాసేపు ఈత కొట్టాను. తర్వాత కొద్ది సేపటికి ఆమె నా వైపు తిరిగి నన్ను చూసింది. జుట్టు కళ్ళను కప్పేస్తుండగా ఆమె నన్ను చూసి నవ్వింది. నేను కూడా కొయ్య పలక మీదకు చేరి ఆమె పక్కనే కూర్చున్నాను. వీస్తున్న గాలి నులి వెచ్చగా ఆహ్లాదకరంగా ఉంది. నేను

ఏదో నవ్వులాటకు చేసినట్టు నా తలను ఆమె ఒడిలో పెట్టి పడుకుండిపోయాను. దానికి ఆమె ఏమీ అనుకున్నట్టు అనిపించకపోవడంతో కాసేపు అలాగే ఉండిపోయాను. ఆకాశం నా కళ్ళల్లో నీలం, బంగారు రంగుల్లో ప్రతిఫలిస్తోంది. మేరి పొట్ట నా తల కింద మెల్లగా ఎగిసి పడుతుండడం నాకు తెలుస్తోంది. ఆ కొయ్య పలక మీద మేం దాదాపు అరగంట పాటు అలా మగత నిద్రలో ఉండిపోయాం. ఎండ బాగా పెరగడంతో ఆమె లేచి మళ్ళీ నీళ్ళలోకి దూకింది. నేను కూడా ఆమెను అనుసరించాను. నేను ఆమెను పట్టుకుని ఆమె నడుము చుట్టూ చేయి వేశాను. తర్వాత మేం పక్కపక్కనే ఈత కొట్టాం. ఆమె ఇంకా నవ్వుతూనే ఉంది.

స్విమ్మింగ్ పూల్ చివర తడి తుడుచుకుంటూ నిలబడినప్పుడు ఆమె "నేను నీ కన్నా ఎక్కువ కలర్‌గా ఉన్నాను" అంది. ఆ సాయంత్రం ఆమె నాతో సినిమాకు రాగలదేమో అని అడిగాను. ఆమె నవ్వుతూనే సరే అంది. అందరి నోళ్ళలో నానుతున్న ఫెర్నాండెల్ కామెడీ సినిమాకు ఆమెను తీసుకువెళ్ళాలని అనుకున్నాను.

మేం బట్టలువేసుకుంటున్నప్పుడు నేను కట్టుకున్న నల్లని టై వంక తదేకంగా చూసి నేను ఏదన్నా సంతాప దినాలను పాటిస్తున్నానా అని ఆమె అడిగింది. అమ్మ చనిపోవడం గురించి ఆమెకు నేను వివరించాను. 'ఎప్పుడు' అని ఆమె అడగ్గా 'నిన్న' అని నేను సమాధానమిచ్చాను. ఆమె పైకి ఏమీ అనకపోయినప్పటికి కొంచెం కంగుతిందని నేను అర్థం చేసుకున్నాను. కానీ అది నా తప్పుకాదని ఆమెకు సంజాయిషి ఇద్దామనుకుని నన్ను నేను అదుపు చేసుకున్నాను. మా యజమానికి కూడా నేను అదే మాట చెప్పి తర్వాత అది మూర్ఖత్వమని అనుకున్న విషయం గుర్తుకువచ్చింది. అది మూర్ఖత్వం అయినా కాకపోయినా అలాంటప్పుడు ఎవరికైనా ఏదో తప్పుచేసినట్లు అనిపించక మానదు. ముఖ్యంగా ఇలాంటి పరిస్థితుల నేపథ్యంలో. అయితే ఆరోజు సాయంత్రంకల్లా మేరీ ఈ విషయాలన్నింటినీ మర్చి పోయింది. సినిమా అక్కడక్కడా సరదాగా ఉన్నప్పటికీ ఎక్కువ భాగం అర్థంపర్థం లేనట్టు ఉంది. సినిమా హాల్లో ఉన్నప్పుడు ఆమె కాలిని నా కాలికి తాకించింది. నేను ఆమె రొమ్ముల్ని తాకాను. సినిమా చివరికి వచ్చే సరికల్లా నేను ఆమెను గట్టిగా ముద్దు పెట్టుకున్నాను. తర్వాత ఆమె నాతో పాటు మా అపార్ట్‌మెంట్‌కు వచ్చింది.

నేను లేచేటప్పటికల్లా మేరీ వెళ్ళిపోయింది. ఆమె ఉదయాన్నే తన ఆంటీ దగ్గరకు వెళ్ళాలని చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది. ఆ రోజు ఆదివారమని కూడా గుర్తుకువచ్చింది. ఆదివారాన్ని నేను అంతగా లెక్కచేయను. నేను నా తలను పక్కకు తిప్పి తలగడకు మేరీ తలనుంచి అంటిన సెంటు తాలూకా పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ బద్ధకంగా పడుకుండిపోయాను. తర్వాత పదింటి వరకూ మళ్ళీ నిద్రపోయాను. ఆ

తర్వాత మధ్యాహ్నం వరకూ సిగరెట్లు కాలుస్తూ పక్కమీదే గడిపాను. ఎప్పుడూ భోంచేసే సెలెస్టి రెస్టారెంట్‌కు లంచ్‌కు వెళ్ళొద్దని నిర్ణయించుకున్నాను. వాళ్ళంతా నన్ను ప్రశ్నలతో వేధిస్తారు. అలా నన్ను ఎవరైనా ప్రశ్నించడం నాకు ఇష్టం ఉండదు. అందుకని కోడిగుడ్లు వేయించుకుని వేడివేడిగా తినేసాను. ఇంట్లో బ్రెడ్ కూడా ఏమీ లేదు. కొనడానికి కిందకు దిగి వెళ్ళబుద్ధి కూడా కాలేదు.

లంచ్ చేసిన తర్వాత ఏం చేయాలో తోచక ఆ చిన్న అపార్ట్‌మెంట్‌లోనే అటూ ఇటూ తిరగటం మొదలు పెట్టాను. అమ్మ నాతో ఉన్నప్పుడు ఆ అపార్ట్‌మెంటు మా ఇద్దరికీ చక్కగా సరిపోయేది. ఇప్పుడది నా ఒక్కడికీ చాలా పెద్దదిగా అనిపించసాగింది. అందుకే డైనింగ్ టేబుల్‌ను నేను బెడ్‌రూంలోకి చేర్చేశాను. ఇప్పుడు నేను ఉపయోగిస్తోంది ఒక్కగదినే. నాకు కావలసిన ఫర్నిచర్ అంతా ఈ గదిలోనే ఉంది. మంచం, డ్రెస్సింగ్ టేబుల్, సీట్లు లోపలికి అణిగిపోయినట్లుండే కొన్ని కేన్ కుర్చీలు, కొంచెం మసకేసిన అద్దంతో ఉన్న వార్డ్‌రోబ్ ఇవన్నీ అందులోనే ఉన్నాయి. ఫ్లాట్‌లో మిగిలిన భాగం నాకు ఉపయోగంలో లేదు. దానితో నేను దానిని బాగుచేసే పని కూడా పెట్టుకోలేదు.

కొంచెం సేపయిన తరువాత ఏంచేయాలో తోచక నేలమీద పడి ఉన్న పాత వార్తా పత్రికను తీసి కాసేపు చదివాను. కృశ్చేన్ సాల్ట్స్ గురించి అందులో కనిపించిన ప్రకటన ఒకటి నన్ను ఆకర్షించింది. నేను ఆ ప్రకటన వరకూ కత్తిరించి దానిని ఆల్బమ్‌లో పెట్టాను. పేపర్లలో అలా సరదాగా ఉండే వాటిని కత్తిరించి దాయడం నాకు అలవాటు. తర్వాత చేతులు కడుక్కుని ఇంక ఏం చేయాలో తెలీక చివరి ప్రయత్నంగా బాల్కనీలోకి నడిచాను. నా బెడ్‌రూమ్ మెయిన్ రోడ్‌కు ఎదురుగానే ఉంది. అది ఒక చక్కటి మధ్యాహ్నం. రోడ్డు నల్లగా మెరుస్తున్నట్టుంది. మొదట కొంత మంది ఏదో పనిమీద హడావుడిగా వెళుతూ కనిపించారు. ఒక కుటుంబం ఆదివారపు మధ్యాహ్నపు నడక కోసం కాబోలు బయలుదేరింది. ఈత కొట్టే దుస్తుల్లో ఇద్దరు చిన్న అబ్బాయిలు మోకాళ్ళ వరకూ దిగిన ట్రౌజర్లతో అసౌకర్యంగా ఉన్నట్టు నడుస్తున్నారు. తరువాత గులాబి రంగు విల్లులాంటి దాన్ని పట్టుకుని లెదర్ బూట్లు వేసుకున్న పిల్ల కనిపించింది. తర్వాత వెనుకగా వాళ్ళ అమ్మ గోధుమరంగు సిల్క్ డ్రెస్‌లో తన భారీ శరీరాన్ని ఈడ్చుకుంటూ వస్తూండగా ఆ పిల్లల తండ్రి కాస్త పొట్టిగా గడ్డితోచేసిన టోపీ పెట్టుకుని చేతికర్రతో నడుస్తూ కనిపించాడు. ఆయన భార్య పక్కన ఆయన్ని చూడగానే ఆయన మంచి కుటుంబం నుంచి వచ్చాడని తనకన్నా తక్కువ స్థాయి కుటుంబానికి చెందిన ఆవిడను వివాహం చేసుకున్నాడని అందరూ ఎందుకు అంటుంటారో నాకు అర్థం అయింది.

తర్వాత స్థానికంగా ఉండే కొంత మంది యువకుల గుంపు వచ్చింది. నూనె రాసి నున్నగా దువ్విన జుట్టు, ఎరుపు రంగు టైలు, నడుము దగ్గర బిగుతుగా ఉన్న కోట్లు,

అల్లిక పని చేసిన జేబులు, చదరంగా ఉన్న బూట్లు వేసుకుని సినిమా థియేటర్‌కు వెళుతున్నట్టున్నారు. అందుకే అంత త్వరగా బయలుదేరారు. ట్రామ్ బళ్ళు ఆగేచోటు దగ్గరికి హడావుడిగా నవ్వుతూ తుళ్ళుతూ గట్టిగట్టిగా మాట్లాడుకుంటూ పోతున్నారు వాళ్ళు. వాళ్ళు వెళ్ళిన తర్వాత వీధి దాదాపు ఖాళీ అయిపోయినట్టుగా అయింది. ఈ సరికల్లా అన్ని థియేటర్లలో మధ్యాహ్నపు ఆటలు మొదలైపోతాయి. ఇళ్ళల్లో ఒకళ్ళూ అరా షాపుల యజమానులు మిగిలినట్టున్నారు. రోడ్డుకి రెండు వైపులా ఉన్న ఆకాశ హర్మ్యాలపై ఆకాశం ఒక్క మబ్బు తునక కూడా లేకుండా నీలంగా ఉంది. అయితే సూర్య కాంతి మృదువుగానే ఉంది. రోడ్డుకు అటువైపున్న దుకాణాల్లోని పొగాకు వ్యాపారస్థుడొకడు తన గుమ్మం ముందున్న పేవ్‌మెంటు మీదకు కుర్చీ తెచ్చుకుని కాళ్ళు బార జాపి కూర్చున్నాడు. కొద్దిసేపటి ముందు వరకూ కిక్కిరిసి వెళ్ళిన ట్రాము బళ్ళు ఇప్పుడు దాదాపు ఖాళీగా వెళుతున్నాయి. పొగాకు వ్యాపారస్థుడి పక్కనే ఉన్న చెజ్‌పియెరాట్ రెస్టారెంట్ వెయిటర్ ఒకడు ఖాళీగా ఉన్న రెస్టారెంట్‌లో చెత్తాచెదారాన్ని ఊడుస్తున్నాడు. ఆదివారం మధ్యాహ్నం అచ్చంగా అలాగే ఉంటుంది.

నేను కూడా కుర్చీని జరుపుకుని అచ్చంగా ఆ పొగాకు వ్యాపారస్థుడిలాగా కాళ్ళు బార జాపుకొని కూర్చున్నాను. అలా కూర్చోవడం సౌకర్యంగా అనిపించింది కూడా. రెండు సిగరెట్లు తాగిన తర్వాత గదిలోకి వెళ్ళి ఒక చాక్లెట్ తీసుకుని తిరిగి కిటికీ వద్దకు వచ్చి కూర్చున్నాను. కాసేపటికి ఆకాశంలో మేఘాలు కమ్ముకున్నాయి. వేసవిలో వచ్చే తుఫానులాంటిది వస్తుందేమోననుకున్నాను. అయితే మేఘాలు క్రమ క్రమంగా చెల్లాచెదురయ్యాయి. అయితే అదే సమయంలో ఏ క్షణాన్నయినా వర్షం రావచ్చు అనే భయాన్ని పుట్టించి ఒక్కసారిగా చీకటి పడేట్లు చేశాయి. కాసేపు ఆకాశాన్ని చూస్తూ అలాగే కూర్చున్నాను.



ఐదింటికి ఒక్కసారిగా ట్రాముల కోలాహలం మొదలైంది. స్టేడియంలో జరుగుతున్న ఫుట్‌బాల్ మ్యాచ్ నుంచి చుట్టు ప్రక్కల ప్రాంతాలకు వస్తున్న ట్రాముల్లాగా ఉన్నాయి. అన్నీ జనాలతో కిటకిటలాడి పోతున్నాయి. మెట్ల మీద కూడా జనాలు నిలబడి కనిపించారు. ఇంకో ట్రాములో ఫుట్‌బాల్ క్రీడాకారులు వచ్చారు. వాళ్ళు పట్టుకున్న చిన్న సూట్‌కేసులను బట్టి వాళ్ళు క్రీడాకారులయి ఉండవచ్చని ఊహించాను. “బంతిని పరిగెత్తనివ్వండి అమ్మాయిలూ” అంటూ వాళ్ళ టీమ్ పాటను క్రీడాకారులు గొంతెత్తి పాడుతున్నారు. వాళ్ళలో ఒకడు తలపైకెత్తి నన్ను చూసి “మేం వాళ్ళను ఓడించాం” అంటూ కేకపెట్టాడు. నేను కూడా చెయ్యిఊపి “మంచి పనిచేశారు” అంటూ వాళ్ళను మెచ్చుకున్నాను. ఇక తరువాత నుంచీ వరుసగా కార్ల రాక మొదలయింది.

ఆకాశం మళ్ళీ రంగులు మార్చుకుంది. అరుణిమ పులుముకున్న ఆకాశం ఇళ్ళ

పైకప్పుల నుంచీ మనోహరంగా కనిపిస్తోంది. సంధ్యా సమయం అవుతుండటంతో వీధుల్లో జనాల రాకపోకలు ఎక్కువయ్యాయి. కాలి నడకన వ్యాహ్యాళికి వెళ్ళినవారు తిరిగి వస్తున్నారు. ఆ పొట్టిమనిషి, లావు పాటి ఆయన భార్య కూడా తిరిగి వస్తున్న వాళ్ళలో ఉన్నారు. తల్లి దండ్రుల వెనుక పిల్లలు అలసిన మొహాల్తో నిదానంగా కాళ్ళీడ్చుకుంటూ వస్తున్నారు. మరికొద్ది సేపటికి సినిమాలు వదిలిపెట్టే సమయం కూడా అయ్యింది. అంతకు ముందు వెళ్ళిన యువకుల గుంపు పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ తిరిగి వస్తోంది. వాళ్ళు భయంకరమైన సినిమా చూసి ఉంటారన్నది వాళ్ళను చూసి ఊహించుకోవచ్చు. టౌన్ మధ్యలోని సినిమాహాళ్ళకు వెళ్ళిన వారు కూడా రావడం మొదలయింది. కొందరు బద్ధకంగా నిద్రమత్తులో ఉన్నట్టు నడుస్తుండగా కొందరు నవ్వుకుంటూ వస్తున్నారు. మొత్తానికి అందరిలో ఏదో అలసిపోయిన వైఖరి కనిపించింది. కొంత మంది నేనున్న కిటికీ కింద రోడ్డు మీద నిలబడిపోయి కబుర్లు చెప్పుకుంటున్నారు. కొంతమంది అమ్మాయిలు చేయీ చేయీ పట్టుకుని కబుర్లు చెప్పుకుంటూ నడుచుకుంటూ వచ్చారు. కిటికీ కింద నిలబడిన అబ్బాయిలు వాళ్ళ వైపు చూస్తూ సరదాగా వ్యాఖ్యలు చేసినట్టున్నారు. అమ్మాయిలు వాళ్ళ వైపు తలలు తిప్పి చూస్తూ ముసిముసిగా నవ్వుతున్నారు. వాళ్ళను మా వీధిలోని అమ్మాయిలుగా గుర్తుపట్టాను. అందులో ఇద్దరు ముగ్గురు తెలిసిన అమ్మాయిలు పైకి చూసి నాకు చెయ్యూపారు.

అప్పుడే వీధి లైట్లన్నీ ఒక్కసారిగా వెలిగాయి. దానితో ఆకాశంలో అప్పటివరకూ మెరుస్తున్న నక్షత్రాలు ఒక్కసారిగా కాంతి తగ్గినట్టు అనిపించాయి. లైట్ల వెలుతురుకి, అంతసేపు కదలకుండా అక్కడే కూర్చుని వీధుల్లో వచ్చీ పోయే వాళ్ళను చూస్తూ కూర్చున్నదానికి నా కళ్ళు అలసిపోయినట్టు అనిపించాయి. వీధి దీపాల కింద చిన్న చిన్న వెలుతురు సరస్సులు ఏర్పడ్డాయి. అప్పుడప్పుడూ ఒకటీ అరా ట్రాములు వస్తూ అమ్మాయిల జుట్టునో, నవ్వునో, వెండి గాజుల్నో మెరిపించి వెళుతున్నాయి.

తర్వాత తర్వాత ట్రాముల రాక ఇంకా తగ్గిపోయింది. చెట్లు, వీధి లైట్ల పైనుంచీ ఆకాశం నల్లగా కనిపిస్తోంది. వీధులు దాదాపు ఖాళీ అయిపోయాయి. తర్వాత కాసేపటికి దాదాపు నిర్మానుష్యమైపోయాయి. ఒక పిల్లి ఏ మాత్రం తొందరపడకుండా నిదానంగా రోడ్డుని దాటి ఆవలి వైపుకి వెళ్ళింది. నేను భోజనం గురించి ఏదైనా ఏర్పాటు చేసుకోవడం మంచిదని నాకు తట్టింది. కుర్చీలో చాలా సేపు ముందుకు వంగి కూర్చుని రోడ్డువైపు చూడడంవల్ల నిటారుగా కూర్చోగానే ఒక్కసారిగా మెడపట్టినట్టు అయింది. నేను కిందకు వెళ్ళి కొంచెం బ్రెడ్డు, స్పాగెట్టీలను తెచ్చుకున్నాను. వంటచేసుకుని నిలబడే తినడం అయిందనిపించాను. కిటికీ దగ్గర నిలబడి ఇంకో సిగరెట్టు కాలుద్దామని అనిపించినా అప్పటికే బాగా చలి మొదలవడంతో ఆ పని మానుకున్నాను. కిటికీ మూసేసి గదిలోకి

వస్తూండగా గదిలోని అద్దంలోనుంచి టేబుల్ మీద పెట్టి ఉన్న బ్రెడ్ ముక్కలు కనిపించాయి. అంటే నేను ఇంకో ఆదివారాన్ని ఎలాగోలాగ ముగించానన్నమాట. అమ్మ ఖననం అయిపోయింది. రేపు నేను యధావిధిగా ఆఫీసుకి వెళ్ళాల్సి ఉంటుంది. నిజానికి నా జీవితంలో ఏదీ మారలేదు.

# 3

ఆఫీసులో ఉదయమంతా విపరీతమైన పని వత్తిడితో గడిచిపోయింది. మా యజమాని ఆ రోజు ఎందుకో చాలా సరదాగా ఉన్నాడు. నేను బాగా అలసి పోయానా అని కూడా అడిగి తెలుసుకున్నాడు. తరువాత అమ్మ వయసు ఎంతుంటుందని అడిగాడు. నేను మళ్ళీ తప్పు చేయదలుచుకోలేదు. అందుకే 'దగ్గర దగ్గర అరవై ఉంటుంది' అని సమాధానం ఇచ్చాను. ఆయన ఎందుకో తేలిగ్గా నిట్టూర్చినట్టు నాకు అనిపించింది. ఎందుకనేది నాకు తెలియక పోయినా ఇక ఆ విషయం అక్కడితో ఆగిపోయింది.

నా డెస్క్ మీద నేను చూడాల్సిన బిల్లులు గుట్టలుగా పేరుకుపోయి ఉన్నాయి. వాటి నన్నిటినీ చూసి తీరాలి. లంచ్‌కు వెళ్ళడానికి ముందు చేతులు కడుక్కున్నాను. మధ్యాహ్నం పూట ఈ పనిచేయడమంటే నాకు చాలా ఇష్టంగా ఉంటుంది. సాయంత్రం ఆ పని అంత ఆనందాన్ని ఇవ్వదు. ఎందుకంటే అప్పటికే చాలా మంది ఉపయోగించడం వల్ల టవల్ తడితడిగా ఉంటుంది. నేను ఒకసారి దీన్ని మా యజమాని దృష్టిలోకి కూడా తీసుకువెళ్ళాను. ఇది ఆలోచించవలసిన విషయమేనని ఆయనా ఒప్పుకున్నాడు. అయితే ఆయనకు సంబంధించినంత వరకు అది చాలా చిన్న విషయం. అంతే. ఎప్పటికన్నా ఆ రోజు ఇంకాస్త ఆలస్యంగా ఆఫీసు భవనం నుండి పన్నెండున్నర ప్రాంతాల్లో బయలు దేరాను. రవాణా విభాగంలో పని చేసే ఇమాన్యుయల్‌తో కలసి బయటకు వచ్చాను. మా భవనం సముద్రానికి ఎదురుగా ఉంటుంది. మెట్లు దిగుతూ హార్బరులోని ఓడల్ని చూడడానికి ఒక్క నిముషం అక్కడే నిలబడ్డాం.

ఎండ మండిపోతోంది. అప్పుడే ఒక పెద్ద ట్రక్కు అటుగా వచ్చింది. ఆ ట్రక్కులోకి దూకుదామని ఇమాన్యుయల్ అన్నాడు. దానితో నేను పరుగెత్తడం మొదలు పెట్టాను. ఆ ట్రక్కు అప్పటికే కొద్ది దూరం వెళ్ళి పోయింది. కొద్ది దూరం పాటు దాని వెంట పరిగెత్తాల్సి వచ్చింది. పైన మాడ్చేస్తున్న ఎండ, ట్రక్కు ఇంజన్ నుంచి వస్తున్న శబ్దంతో తల దిమ్మెక్కిపోయినట్టు అయింది. నాకు తెలిసిందల్లా సముద్ర తీరం పొడవుగా ఉన్న క్రేన్లు, ఇతర ఓడ పరికరాలు, తెరచాపల పక్కనుంచీ పిచ్చి పట్టినట్టు పరుగెత్తడం. మొదట నేనే ట్రక్కుని పట్టుకున్నాను. ట్రక్కులోకి ఒక్కసారిగా ఎగిరి దూకి ఇమాన్యుయల్‌ను కూడా చేయి పట్టుకుని ట్రక్కులోకి లాగాను. పరిగెత్తడం వలన కలిగిన రొప్పుతో

ఇద్దరికీ ఒక నిముషం ఊపిరి ఆడనట్టయింది. ట్రక్కు ఎగిరెగిరి పడడంవల్ల కలిగిన కుదుపులతో పరిస్థితి మరింత అధ్వానంగా అయింది. ఇమాన్యుయల్ చిరునవ్వు నవ్వాడు. నా చెవిలో గుసగుసగా "మనం సాధించాం" అన్నాడు.

సెలెస్టి రెస్టారెంట్‌కు చేరేసరికల్లా మేం చెమటతో తడిసి పోయాం. సెలెస్టి యధాతథంగా ప్రవేశ ద్వారం వద్ద తన స్థానంలో కూర్చుని ఉన్నాడు. ఆయన కున్న పెద్దపొట్ట మూలంగా యాప్రన్ కూడా ముందుకు పొడుచుకు వచ్చినట్టు కనిపిస్తోంది. అతని మీసాలు తెల్లబడి పోయాయి. ఆయన మమ్మల్ని చూడగానే సానుభూతి చూపించాడు. నేను మరీ బాధపడడం లేదు కదా అని అడిగి తెలుసుకున్నాడు. నేను లేదని సమాధానం ఇచ్చాను. కానీ నేను బాగా ఆకలితో ఉన్నాను. త్వరత్వరగా తినడం మొదలు పెట్టాను. తిన్న తర్వాత చివరగా కాఫీ తాగాను. తర్వాత ఇంటికి వెళ్ళి ఒక చిన్న కునుకు తీసి లేచాను. లేవగానే మంచం మీద నుంచి కూడా లేవకుండా సిగరెట్ తాగాను. అప్పటికే కొంచెం ఆలస్యం అవడంతో ట్రామ్ కోసం పరుగెట్టాల్సి వచ్చింది. ఆఫీసులో వంచిన తల ఎత్తకుండా కష్టపడి పనిచేయాల్సి వచ్చింది. పని అంతా పూర్తిచేసి అఫీసు నుంచి బయట పడగానే ఎంతో హాయిగా అనిపించింది. ఓడరేవు పక్కనుంచీ వచ్చే చల్లదనాన్ని అనుభవిస్తూ మెల్లగా నడవడం మొదలు పెట్టాను. ఆకాశం ఆకుపచ్చగా ఉంది. చికాకు పెట్టే ఆఫీసు వాతావరణం నుంచి బయట పడడం మరింత ఆహ్లాదాన్ని కలిగిస్తోంది. అయితే నేను సరాసరి ఇంటికి వెళ్ళి పోయాను. బంగాళాదుంపలు ఉడక బెట్టుకోవాల్సిన పని ఉంది.

హాలులో చీకటిగా ఉంది. మెట్లు ఎక్కబోతూ నేను మా అంతస్తులోనే ఉండే ముసలి సాలమనోను దాదాపు గుద్దుకున్నంత పనిచేశాను. ఎప్పటిలాగే ఆయనతోపాటు ఆయన కుక్క కూడా ఉంది. ఎనిమిది సంవత్సరాల నుంచి వాళ్ళిద్దరూ అలా కలిసే ఉన్నారు. సాలమనో పెంచుకుంటున్న కుక్క స్పానియల్ జాతికి చెందింది. దానికి ఏదో చర్మ వ్యాధి సోకడం వల్ల చూడడానికి కూడా వికారంగా ఉంటుంది. ఆ వ్యాధి మూలంగా వెంట్రుకలన్నీ ఊడిపోయి శరీరమంతా గోధుమ రంగు మచ్చలతో ఉంటుంది. ఒక చిన్న గదిలో దానితో పాటు అన్ని సంవత్సరాలు కలసి ఉండేటప్పటికేమో సాలమనోకు కూడా కొంచెం ఆ కుక్క లక్షణాలే వచ్చినట్టున్నాయి. ఆయనకు కూడా జుట్టు ఊడిపోయి మొహం మీద ఎర్రటి మచ్చల్లాంటివి వచ్చాయి. కుక్కకి కూడా తన యజమానికి లాగా కొంచెం గూని వచ్చినట్టుంది. అది ఎప్పుడూ వళ్ళంతా సాగదీసి ముక్కుతో నేలను వాసన చూస్తూ నడుస్తుంటుంది. ఇద్దరూ ఒకరికొకరు అన్ని రకాలుగా సరిపోతారు. ఇద్దరూ ఒకరికొకరు ద్వేషించుకుంటారు.

రోజుకు రెండు సార్లు ఉదయం పదకొండింటికి, సాయంత్రం ఆరింటికి ఆయన

తన కుక్కను బైటకు తీసుకువెళతాడు. గత ఎనిమిదేళ్ళలో ఈ దినచర్యలో ఎలాంటి మార్పు లేదు. వీధిలో ఆ కుక్క తన యజమానిని లాక్కుంటూ తీసుకువెళుతుండడం, చివరికి ముసలాయన పట్టు తప్పి దాదాపు పడిపోయినంత పని చేయడం అందరికీ పరిచితమైనదే. అప్పుడు ఆయన కుక్కను కొట్టి గట్టిగా తిట్లదండకం ప్రారంభిస్తాడు. అప్పుడు ఆ కుక్క వెనకెనక పడుతూ రావడానికి మొరాయిస్తుంటుంది. ఇప్పుడు గొలుసుపట్టుకుని దానిని లాక్కురావడం ముసలాయన వంతు. తరువాత కుక్క జరిగింది మరిచిపోయి నేలను వాసన చూస్తూ ఎక్కడో అక్కడ దాక్కోవడానికి చూస్తుంది. మళ్ళీ తిట్లు తింటుంది. అప్పుడు ఇద్దరూ పేవ్‌మెంట్‌మీద నిలబడిపోయి ఒకరివంక ఒకరు చూసుకుంటారు. కుక్క ఆయన వంక భయంతో చూస్తే ఆయన దాని వంక ద్వేషంగా చూస్తాడు. వాళ్ళు బైటకు వచ్చినప్పుడల్లా ఎక్కువగా జరిగేదిదే. కుక్క ఎక్కడన్నా కరెంటు స్థంభం దగ్గర ఆగాలని చూస్తుంది. కానీ సాలమనో దానికి ఒప్పుకోకుండా దాన్ని లాక్కుంటూ తీసుకు వెళతాడు. దానితో ఆ దౌర్భాగ్యపు కుక్క దారి పొడవునా మూత్రపు చుక్కలు రాల్చుకుంటూ పోతుంది. అయితే అది ఆపని గదిలో కనుక చేసిందా ఇక దానికి మూడినట్టే.

ఎనిమిదేళ్ళుగా ఇది ఇలాగే జరుగుతూ వస్తోంది. సెలెస్టి - ఇంతకన్నా దరిద్రం ఇంకోటి ఉండదు, దీని గురించి ఏదో ఒకటి చేయాల్సిందే, అంటూ ఉంటాడెప్పుడూ. అయితే ఏం చేయాలనేది ఎవరికీ కచ్చితంగా తెలీదు. నేను హాలులో కలిసినప్పుడు సాలమనో కుక్క మీద అరుస్తున్నాడు. దానిని దరిద్రపు కుక్క అని పిచ్చి తిట్లు తిడుతున్నాడు. అది మూలుగుతూ ఏడుస్తోంది. నేను ఆయనకు 'గుడీవినింగ్' అని చెప్పాను. కానీ ఆయన వినిపించుకోలేదు. కుక్కను అదే పనిగా శపిస్తున్నాడు. కుక్క ఏం చేసిందని నేను ఆయన్ని అడిగాను. ఆయన దానికి కూడా సమాధానం చెప్పకుండా 'ఓసి ముదనష్టపుదానా' అంటూ కుక్కను మళ్ళీ తిట్టడంలో మునిగిపోయాడు. నాకు అంతగా కనిపించకపోయినా ఆయన కుక్క మెడలో ఏదో బిగిస్తున్నాడని అర్థమయింది. నేను గొంతు ఇంకొంచెం పెంచాను. ఆయన తలెత్తి చూడకుండానే కోపాన్ని అణిచి పెట్టుకుంటున్న గొంతుతో "ఎప్పుడూ దారికి అడ్డమే దీనిని నరికెయ్యాలి" అని గొణుగుతున్నట్టు అంటున్నాడు. తర్వాత ఆయన మెట్లు ఎక్కడం మొదలు పెట్టాడు. అది రానని మొరాయిస్తూ నేలపై కాళ్ళు గిట్టకరిచి పడుకుంది. దానితో ఆయన దానిని బలవంతంగా మెట్టుమెట్టుకీ లాక్కుంటూ వెళ్ళసాగాడు.

సరిగా అదే సమయంలో నేనుండే అపార్ట్‌మెంట్ పై అంతస్థులో ఉండే ఆయన బైటి నుంచి వచ్చాడు. ఆయన బ్రోకరు పనిచేస్తుంటాడని ఇక్కడ అందరూ అనుకుంటుంటారు. అయితే నువ్వేంచేస్తావని ఎవరయినా అడిగితే మాత్రం ఆయన గిడ్డంగుల సంస్థలో

పనిచేస్తుంటానని చెబుతుంటాడు. ఒకటి మాత్రం నిజం. ఆయనకు మా వీధిలో అంత మంచి పేరు లేదు. అయితే ఆయన నాతో కాస్త మంచిగానే ఉంటాడు. అప్పుడప్పుడూ ఏదన్నా మాట్లాడడానికి నా గదికి వస్తుంటాడు. ఆయన చెప్పేదంతా నేను వినడమే దానికి కారణం కావచ్చు. నిజానికి ఆయన చెప్పేదంతా నాకు ఎప్పుడూ ఆసక్తికరంగానే ఉంటుంది. అందుకనే ఆయనతో మాట్లాడకుండా ఉండడానికి నాకు తగిన కారణం అంటూ ఏదీ కనబడదు. ఆయన పేరు సెంటిస్. రేమాండ్ సెంటిస్. ఆయన పొట్టిగా కాస్త బలంగా ఉంటాడు. బాక్సర్‌కు ఉండే ముక్కులాంటి ముక్కు. ఎప్పుడూ నీట్‌గా మంచి బట్టలు వేసుకుంటూ ఉంటాడు. సాలమనోను ఆయన కూడా ఎప్పుడూ ఏదో ఒకటి అంటుంటాడు. సాలమనో కుక్కను చూసే విధానం చూస్తే మీకు ఏమీ అనిపించదా అని నన్ను అడిగాడు. నేను లేదని సమాధానం ఇచ్చాను.

మేం ఇద్దరం మెట్లు కలిసే పైకి ఎక్కాం. నేను మా ఇంటి వైపు వెళ్ళడానికి మలుపు తిరుగుతున్నప్పుడు "నాతో పాటు కలిసి భోజనం చేయకూడదా? నావద్ద పుడ్డింగ్, కొంత వైను ఉంది" అని ఆయన నాతో అన్నాడు.

ఆయన చెప్పిన దానికి ఒప్పుకుంటే నేను ఇంటికి వెళ్ళి వంట చేసుకునే పనుండదు అనే విషయం నాకు తట్టింది. దానితో నేను అతనికి 'థాంక్స్' చెప్పి నా అంగీకారం తెలిపాను.

అతనిది కూడా ఒకే ఒక్క గది, చిన్న వంటిల్లుతో కూడిన అపార్ట్‌మెంటు. వంటింటికి కిటికీ కూడా లేదు. ఆయన గదిలోని గోడలన్నీ క్రీడాకారులు, నగ్నంగా ఉన్న అమ్మాయిల ఫొటోలతో నిండి పోయి ఉన్నాయి. పక్క అంతా చిందరవందరగా గది కూడా మురికి పట్టినట్టు అసహ్యంగా ఉంది. ఆయన పారఫిన్ లైటు వెలిగించాడు. తర్వాత జేబులోంచి బ్యాండేజీ తీసి కుడి చేతికి కట్టుకట్టడం మొదలు పెట్టాడు. ఏం జరిగిందని నేను అతడ్ని అడిగాను. తనకు కోపం తెప్పించిన ఒక వ్యక్తిపై చేయిచేసుకోవల్సి వచ్చిందని అతను చెప్పాడు. "గొడవలు పెట్టుకోవడం నా నైజం కాదు. కాకపోతే కొంచెం కోపం ఎక్కువ. ఆ వ్యక్తి నాతో సవాలు చేశాడు." 'నువ్వు కనుక మనిషివైతే ట్రాము దిగి నా దగ్గరికి రా' అంటూ కయ్యానికి కాలు దువ్వాడు. 'అనవసరంగా మాట్లాడకు నేను నిన్నేం అనలేదే' అని నేనన్నాను. అప్పుడు అతను నాకు ధైర్యం లేదని అన్నాడు. ఇక దానితో నా ఓపిక చచ్చిపోయింది. నేను ట్రాముదిగి "ఇంక చాలు నోరు మూసుకో లేకపోతే నేను మూయించాల్సి వస్తుంది" అన్నాను. "నువ్వు ఆ పని చేస్తే చూడాలని ఉంది" అని అతడన్నాడు. అప్పుడు నేను అతని మొహం మీద లాగి పెట్టి ఒకటి ఇచ్చుకొన్నాను. తరువాత అతను పైకి లేవడానికి నేను సహాయం చేయబోయాను. అయితే అతను పడిపోయిన చోటు నుంచే నాపై చేయి విసిరాడు. దానితో నేను మోకాలితో అతన్ని

ఒకసారి కుళ్ళబొడిచి ఇంకో రెండు తన్నులు తన్నాను. దానితో అతను పందిలాగా రక్తం కార్చుకుంటూ కూర్చుండిపోయాడు. ఇప్పుడు సరిపోయిందా అని అడిగాను. సరిపోయిందని అతను సమాధానం ఇచ్చాడు. రేమండ్ చేతికి బ్యాండేజీ కట్టుకుంటూనే ఇదంతా చెప్పుకొచ్చాడు. నేను మంచం మీద కూర్చుని వింటుండి పోయాను. "నువ్వు చెప్పు. ఇది నా తప్పుకాదు. అతను అది కావాలని కోరాడు. అవునా కాదా" రేమాండ్ అన్నాడు. నేను తలూపాను అతను మళ్ళీ మాట్లాడడం మొదలు పెట్టాడు. "నిజానికి నేను ఒక విషయమై నీ సలహా అడగాలనుకొంటున్నాను. అది ఇప్పుడు జరిగిన దానికి సంబంధించినదే. నువ్వు ప్రపంచాన్ని కొంత చూసి ఉన్నావు. అందుకే సహాయం చేయమని నేను నిన్ను అడుగుతున్నాను. దానికి నేను జీవితాంతం నీకు స్నేహితుడిగా ఉండిపోతాను. నా జీవితం మంచి మలుపు తిరగడానికి కారణమైన ఎవర్నీ నేను మర్చిపోను" అని అతనన్నాడు. నేను ఏం మాట్లాడకుండా ఉండిపోవడంతో "మనం ఇద్దరం స్నేహితులం అవడం నీకు ఇష్టమేనా" అని అతను అడిగాడు. నాకు అభ్యంతరం లేదని నేను సమాధానమిచ్చాను. దానితో అతను తృప్తి పడినట్టే కనిపించాడు. అతను పుడ్డింగ్ తయారుచేసి టేబుల్ మీద పెట్టి రెండు వైను సీసాల్ని కూడా పట్టుకొచ్చాడు. ఈ పని చేస్తున్నప్పుడు అతడేమీ మాట్లాడలేదు. మేం డిన్నర్ చేయడం మొదలు పెట్టాం. అతను మొదట కొంత తటపటాయించినా తర్వాత మొత్తం కథంతా చెప్పుకొచ్చాడు."దీని వెనుక అంతా ఒక అమ్మాయి ఉంది. ఆ అమ్మాయితో నేను చాలా రాత్రులు గడిపాను. నిజానికి నేను ఆ అమ్మాయిని చేరదీశాను. దాని కోసం ఆ అమ్మాయి మీద చాలా డబ్బు ఖర్చు పెట్టాను. నేను కొట్టిన ఆ వ్యక్తి ఆ అమ్మాయికి అన్న అవుతాడు".

నేను ఏమి మాట్లాడకపోవడం చూసి తిరిగి అతనే మొదలుపెట్టాడు. "ఇక్కడి వారు నా గురించి ఏం అనుకుంటారో నాకు తెలుసు. అయితే అవన్నీ నిజాలు కావు" అని చెప్పుకొచ్చాడు. అందరిలాగే తనకూ కొన్ని సిద్ధాంతాలు ఉన్నాయని, గిడ్డంగుల సంస్థలో ఉద్యోగం ఉందని చెప్పాడు. "సరే, ఇక నా కథ విషయానికి వస్తే ఆమె నన్ను మోసం చేస్తోందని ఒక రోజు నేను తెలుసుకున్నాను" అని అతను చెప్పాడు. ఆమెకు తను సరిపడా డబ్బులిచ్చే వాడినని, విలాసాలకు పోకుండా చక్కగా బతకడానికి ఆ డబ్బు సరిపోతుందని చెప్పాడు. ఆమె ఉంటున్న ఇంటికి అద్దె కట్టి ఆమెకు రోజు ఇరవైఫ్రాంకులు తిండికోసం ఇచ్చేవాడినని చెప్పాడు. అద్దెకు మూడువందల ఫ్రాంకులు, తిండికి ఇంకో ఆరు వందల ఫ్రాంకులు, తరచుగా ఏదో ఒక బహుమానం ఇస్తుండేవాడినని చెప్పాడు. అయితే ఆమెకు అవి సరిపోలేదు. తనకు ఆ డబ్బు ఏ మాత్రం సరిపోవడం లేదని ఆమె ఎప్పుడూ గొణుగుతూ ఉండేది. దానితో ఒక రోజు నేను "రోజుకి కొన్నిగంటల పాటు ఏదైనా ఉద్యోగం కోసం నువ్వు ప్రయత్నం చేయవచ్చు కదా. దానితో నా పని కూడా

తేలిక అవుతుంది. ఈ నెల నీ కోసం కొత్త గౌను కొన్నాను. అద్దె కట్టాను. రోజుకి ఇరవై ఫ్రాంకులు ఇస్తున్నాను. నువ్వేమో నీ స్నేహితురాళ్ళని వెంటేసుకుని హోటళ్ళకు వెళ్ళి డబ్బంతా వృధా చేస్తున్నావు. వాళ్ళకు కాఫీలకు, టీలకు నువ్విచ్చే డబ్బంతా నా జేబులోంచి వచ్చిందే. నేను నిన్ను అంత ప్రేమగా చూసుకుంటుంటే దానికి నువ్వు ఇచ్చే ప్రతిఫలం ఇదా" అని ఆమెను అడిగాను. నేను ఇచ్చే డబ్బులు చాలడం లేదంటూ గొడవపెడుతూనే తనని ఉద్యోగం చెయ్యమని నేను చెప్పిన మాటల్ని మాత్రం పెడచెవిన పెట్టింది. ఒక రోజున ఆమె చేస్తున్న మోసం నాకు తెలిసిపోయింది. అని చెప్పడం మొదలు పెట్టాడు.

ఒక రోజు ఆమె హ్యాండ్ బ్యాగ్‌లో లాటరీ టిక్కెట్టు కనిపించింది. అది కొనడానికి డబ్బులు ఎక్కడి నుంచీ వచ్చాయని అడిగినప్పుడు ఆమె సమాధానం చెప్పలేదు. ఇంకో రోజున గాజుల్ని తాకట్టు పెట్టిన దానికి సంబంధించిన రశీదు ఒకటి ఆమె బ్యాగ్‌లో కనిపించిందని, ఆ రెండు గాజుల గురించి తనఖా గురించి తనకేమీ తెలియదని చెప్పాడు. "దానితో ఏదో తప్పుడు వ్యవహారం జరుగుతోందని నేను అనుకున్నాను. ఇంక ఆమెతో నాకు పని లేదని ఆమెకు చెప్పేశాను. ఆమెకు కొన్ని పచ్చి నిజాలు కూడా తెలియజేసాను. అవకాశం వస్తే ఎవరితోనన్నా పడకెక్కేందుకు ఆమెకు అభ్యంతరం లేదని తిట్టిపోసాను. అయితే తన ప్రవర్తనకు ఆమె బాధపడే రోజు త్వరలోనే వస్తుందని హెచ్చరించాను. నేను వెనక్కు తిరిగి రావాలని కోరుకుంటావు కూడా. నీకో విషయం తెలుసా. నేను నిన్ను చేరదీయడం వల్ల నీకు పట్టిన అదృష్టం గురించి ఈ వీధిలోని అమ్మాయిలందరూ ఎంత కుళ్ళుకుంటున్నారో తెలుసా అని తిట్టాను. తర్వాత ఆమెను రక్తం వచ్చేట్టు కొట్టాను. అంతకు ముందు ఆమెను ఎప్పుడూ కొట్టలేదు. అంటే ఎప్పుడూ అంత గట్టిగా కొట్ట లేదనుకో. ఏదో ప్రేమతో కొట్టేవాడిని. ఆమె కాసేపు అరచి బొబ్బలు పెట్టేది. దానితో నేను కిటికీ మూసివేయాల్సి వచ్చేది. తర్వాత అంతా యధా ప్రకారంగా మామూలుగా ముగిసి పోయేది. అయితే ఈ సారి నేను బాగా విసిగి పోయాను. ఆమెను నేను అంత గట్టిగా శిక్షించలేదేమో అనిపిస్తోంది.. నేను నీకు చెప్పింది అర్థం అయిందా"? అతను నన్ను అడిగాడు.

ఈ విషయంలోనే అతను నా సలహా అడగాలని అనుకున్నాడని చెప్పాడు. లాంతరు నుంచి పొగ వస్తోంది. అటూ ఇటూ తిరుగుతున్న వాడల్లా ఆగి వత్తి తగ్గించాడు. నేను ఏం మాట్లాడకుండా వింటున్నాను. ఒక వైన్ బాటిల్ మొత్తాన్ని తాగేశాను. తలంతా ఒక రకంగా మొద్దుబారినట్టుగా, గందరగోళంగా ఉంది. నా సిగరెట్లన్నీ అయిపోవడంతో రేమాండ్ సిగరెట్లు తీసుకుని కాల్చడం మొదలుపెట్టాను. చిట్టచివరిగా వచ్చే ట్రాము బళ్ళు వచ్చి వెళ్ళిపోయాయి. వాటితో పాటు వీధులన్నీ ఒక్కసారిగా నిశ్శబ్దమైపోయాయి రేమాండ్ మాట్లాడుతూ పోతున్నాడు. ఆమె మీద ఒకప్పుడు తనకున్న వ్యామోహం

ఇప్పుడు తగ్గిపోయి విసుగుపుడుతోందని, అయితే ఆమెకు గట్టి పాఠం చెప్పాలని మాత్రం గట్టిగా తీర్మానించుకున్నానని చెప్పాడు.

మొదట ఏదైనా హొటల్‌కు తీసుకు వెళ్ళి తర్వాత స్పెషల్ పోలీసులను పిలిచి పట్టించాలని, ఆమెపై వ్యభిచారం చేస్తోందని కేసు పెట్టించి కోపం తెప్పించాలని అనుకున్నానని చెప్పాడు. స్మగ్లర్‌లలో తనకు కొంతమంది స్నేహితులు ఉన్నారని, వాళ్ళలో కొంతమందికి కూడా స్నేహితురాళ్ళు ఉన్నారని, ఈ విషయంలో వాళ్ళేమైనా సలహా ఇవ్వగలరేమో అని కూడా అడిగిచూశానని అయితే దానివల్ల ఏం ఉపయోగం లేకుండా పోయిందని రేమాండ్ చెప్పాడు. అయితే తన మిత్రుల్లాంటి వాళ్ళు ఉండే చోట అది మామూలేనని అయినా మోసం చేసే స్నేహితురాళ్ళని ఏం చేయాలనే విషయం కూడా తెలీకుండా అలాంటి చీకటి ప్రపంచంలో వాళ్ళేం చేయగలుగుతారని అతను అన్నాడు. ఆమె విషయం చెప్పినప్పుడు వాళ్ళు ఆమెకు కాల్చి వాత పెట్టమని సలహా ఇచ్చారని అయితే తనకు అది ఇష్టం లేదని అన్నాడు. దానిని గురించి ఇంకా బాగా ఆలోచించాల్సి ఉందని చెబుతూ అంతకన్నా ముందు నన్నోవిషయాన్ని అడుగదలచుకున్నానని చెప్పాడు. అది అడగబోయే ముందు మొత్తం ఈ కథకు సంబంధించి నా అభిప్రాయాన్ని తెలుసుకోవాలని అనుకుంటున్నానని అన్నాడు.

అయితే దానిపై నాకు ఎలాంటి అభిప్రాయం లేదని, కానీ అతని కథ ఆసక్తికరంగా మాత్రం ఉందని చెప్పాను. ఆమె అతన్ని మోసం చేస్తోందని నేను అనుకుంటున్నానా అని రేమాండ్ అడిగినప్పుడు కొంచెం అలాగే అనిపిస్తోందని సమాధానమిచ్చాను. అయితే ఆమెను శిక్షించడం సరైనదే అని నేను అనుకుంటున్నానా లేదా, అతని స్థానంలో నేనే ఉండి ఉంటే ఏంచేసి ఉండేవాడిని అని అతను అడిగాడు. అలాంటి సందర్భాల్లో ఇలా చేస్తామని కచ్చితంగా చెప్పడానికి ఏమీ ఉండదని, అయితే ఆమె చేసిన దానికి శిక్ష అనుభవించాలని అతను పట్టుబట్టడాన్ని నేను అర్థంచేసుకోగలనని చెప్పాను.

నేను ఇంకొంచెం వైన్ తాగాను. రేమాండ్ ఇంకో సిగరెట్ వెలిగించాడు. తర్వాత తను ఏం అనుకుంటున్నదీ చెప్పాడు. ఆమెకు ఒక ఉత్తరం రాయాలని అనుకుంటున్నాడు. అసభ్యంగా పచ్చిగా ఉండే విధంగా రాయాలని, చదివి ఆమె పశ్చాత్తాపపడాలని అనుకుంటున్నాడు. ఆమె తిరిగి వచ్చిన తరువాత ఆమెతో పడకపై ఉన్నప్పుడు సరైన సమయం చూసి ఆమె మొహంపై ఉమ్మేసి బయటకు గెంటాలని అనుకుంటున్నట్టు అతను చెప్పాడు. అది మరీ అంత చెత్త ప్లాన్ కాకపోవచ్చని నేనన్నాను. ఆ శిక్ష ఆమెకు సరిపోతుందని చెప్పాను.

అయితే అలాంటి ఉత్తరం ఎలా రాయాలో తనకు తెలియడం లేదని చెప్పాడు. నేను సహాయం చేయాల్సింది ఆ విషయంలోనే అని అతనన్నాడు. నేను ఏమీ

మాట్లాడకుండా ఉండిపోయేటప్పటికి ఉత్తరం రాయడానికి నేనేమైనా అనుకుంటున్నానా అని అడిగాడు. అలాంటిదేమీ లేదని నేను చెప్పాను.

ఒక గ్లాస్ వైన్ తాగి లేచి నిలబడ్డాడు. ప్లేట్లను పక్కకు జరిపి మిగిలిన పుడ్డింగ్‌ను తీసేసి టేబుల్‌ను ఖాళీ చేశాడు. టేబుల్ క్లాత్‌ను శుభ్రంగా తుడిచిన తర్వాత టేబుల్ సొరుగు లాగి ఒక తెల్ల కాగితాన్ని, ఒక కవర్‌ని, ఎరుపు రంగులో ఉన్న పెన్నులస్టాండ్‌ని, ఇంక్ సీసాను తీసుకువచ్చి టేబుల్‌పై పెట్టాడు. అతను ఆ అమ్మాయి పేరు చెప్పగానే ఆమె మూర్ జాతికి చెందిన అమ్మాయని అర్థమయింది.

నేను ఉత్తరం రాశాను. దానికోసం కష్టపడలేదు కూడా. రేమాండ్‌కు తృప్తి కలిగేలా ఉత్తరం రాయాలని మాత్రం ప్రయత్నించాను. నిజానికి అతన్ని తృప్తి పరచడానికి నాకేం కారణం లేదు. తర్వాత నేను రాసిన ఉత్తరాన్ని పైకి చదివాను. అతను సిగరెట్ పీలుస్తూ మధ్య మధ్యలో తలూపుతూ వినసాగాడు. ఒక్కోసారి "దయచేసి ఇంకోసారి చదువు" అంటూ అభ్యర్థించాడు. చాలా సంతోషించినట్టు కనబడ్డాడు. "అదీ ఉత్తరమంటే" అంటూ అతను ఇకిలించాడు. "నీకు మంచి బుర్ర ఉందని చెప్పొచ్చు ఓల్డ్ బాయ్. ఏది ఏంటి అనేది నీకు బాగా తెలుసు" అంటూ మెచ్చుకున్నాడు. 'ఓల్డ్ బాయ్' అన్నది నన్నేనని నాకు మొదట అర్థం కాలేదు. అయితే అతను నా భుజం మీద చరవడంతో అది తర్వాత అర్థం అయింది. "ఇప్పుడు మనం స్నేహితులమయ్యాం. అవునా కాదా" అని అడిగాడు. నేను మౌనంగా ఉండి పోవడంతో అదే మాట తిరిగి రెట్టించాడు. అయినా కాకపోయినా నాకెలాంటి బాధ లేదు. అయితే ఆ విషయాన్ని పదేపదే రెట్టించడంతో తల ఊపి అవునన్నాను.

అతను ఉత్తరాన్ని కవర్‌లో పెట్టాడు. మేం వైన్ తాగడం పూర్తిచేశాం. తర్వాత మేం ఇద్దరం ఏం మాట్లాడకుండా కాసేపు సిగరెట్లు తాగుతూ ఉండిపోయాం. వీధంతా పూర్తిగా నిశ్శబ్దమైపోయింది. అప్పుడప్పుడూ ఒకటీ అరా కార్లు వస్తున్నాయి. అప్పటికే చాలా పొద్దుపోయిందని నేనన్నాను. రేమాండ్ దానికి అంగీకరించాడు. ఈ సాయంత్రం సమయం చాలా తొందరగా గడిచిపోయిందని అన్నాడు. ఒక రకంగా అది నిజమే. నాకు బాగా నిద్రపోవాలని ఉంది. అయితే కూర్చున్న చోటు నుంచీ కదలల్లేక పోతున్నాను. నేను అలసి పోయినట్టు ఉండడం గమనించి "పరిస్థితులు మనల్ని కుంగదీసేలా వాటికి అవకాశం ఇవ్వకూడదు" అన్నాడు. ఆ మాట ఎందుకు అన్నాడో నాకు అర్థం కాలేదు. మా అమ్మ చనిపోయిందనే విషయం తనకు తెలిసిందని తర్వాత నాకు వివరించాడు. అయితే అది ఏదో ఒక రోజు జరగక తప్పదని అన్నాడు. అతనితో నేను కూడా ఏకీభవించాను. నేను వెళ్ళడానికి లేచినపుడు రేమాండ్ ఎంతో ఆపేక్షగా నాతో కరచాలనం చేశాడు. మగవాళ్ళు ఒకరినొకరు బాగా అర్థం చేసుకోగలరని వ్యాఖ్యానించాడు. అతను

తలుపేసుకోగానే నేను కాసేపు గుమ్మం బైట అలాగే నిలబడిపోయాను. భవనం అంతా అచ్చంగా శ్మశానంలోలా నిశ్శబ్దంగా ఉంది. మెట్ల ప్రక్కనే ఉన్న డ్రెయినేజీ గొట్టంలోంచి మురుగు వాసన వస్తోంది. చెవుల్లో రక్తం ప్రవహిస్తున్న చప్పుడు తప్ప నాకు ఇంకేమీ వినిపించడం లేదు. ఆ చప్పుడు వింటూ కాసేపు అలాగే నిలబడి పోయాను. అప్పుడు సాలమనో గదిలోంచి కుక్క మూలగటం మొదలుపెట్టింది. నిద్రపోతున్న భవనంలోంచి ఆ బాధాకరమైన ధ్వని క్రమంగా పెరగనారంభించింది. ఆ నిశ్శబ్దపు చీకటిలోనుంచి పువ్వు విచ్చుకున్నట్టుగా రోదనా ధ్వని వ్యాపిస్తోంది.

# 4

ఆ వారమంతా ఆఫీసులో పనివత్తిడితో గడిచి పోయింది. ఆమెకు లెటర్ పంపినట్టు చెప్పడానికి రేమాండ్ ఒకసారి ఆఫీసుకి వచ్చాడు. ఇమాన్యుయల్‌తో రెండుసార్లు సినిమాకు వెళ్ళాను. అయితే అతనికి సినిమా సరిగా అర్థం కాదు. మధ్య మధ్యలో ఏం జరుగుతోందని అడుగుతుంటాడు. నిన్న శనివారం. మేం ముందుగా అనుకున్నట్టుగా మేరీ నా గదికి వచ్చింది. ఎరుపు, తెలుపు చారలు కలిగిన అందమైన డ్రెస్‌లో మేరీ మరింత అందంగా మెరిసిపోతోంది. ఆమె నుంచి కళ్ళు తిప్పుకోలేక పోయాను. ఆమె దుస్తుల్లోంచి పలుచని చనుకట్టు ప్రస్ఫుటంగా తెలుస్తోంది. ఎండలో కాస్త కమిలినట్టున్న మొహం ఊదా రంగులో ఉన్న పువ్వులా ముచ్చటగా ఉంది. మేం బస్సెక్కి అల్జీర్స్‌కు కొన్ని మైళ్ళ దూరంలో ఉన్న బీచ్‌కు వెళ్ళాం. అది రెండు పెద్దరాళ్ళ మధ్య ఏర్పడిన నీటిపాయ. వెనుకంతా దట్టంగా పెరిగిన రెల్లుపొదలు ఉన్నాయి. నాలుగింటికి సూర్యుడు మరీ అంత వేడిగా అయితే లేదు. నీళ్ళు గోరువెచ్చగా ఆహ్లాదకరంగా ఉన్నాయి. చిన్నచిన్న అలలు ఇసుకను తాకుతున్నాయి.

మేరీ నాకు ఒక కొత్త ఆట నేర్పింది. నీళ్ళలో ఈదుతూ అలలు వచ్చినపుడు నోటితో నీళ్ళను పుక్కిట పట్టాలి. నోరంతా నురగతో నిండి పోగానే నీటిపై వెల్లికిలా పడుకుని నురగని ఆకాశం వైపు ఉమ్మాలి. అది గాలిలో కలిసిపోతుంది లేదా వెచ్చటి జల్లులా మొహంమీద పడుతుంది. ఇదీ ఆట. అయితే ఆట మొదలయిన కాసేపటికే నా నోరు ఉప్పునీటి మూలంగా ఉప్పగా అయిపోయింది. అప్పుడు మేరీ లేచి వచ్చి నీళ్ళలోనే నన్ను గట్టిగా హత్తుకుని పెదాలపై ముద్దుపెట్టింది. ఆమె నాలుక నా పెదాలను చల్లబరిచింది. ఒక్క నిముషంపాటు తాకుతున్న అలల మధ్య అలాగే ఉండిపోయాం. తర్వాత ఒడ్డుకు ఈదుకుంటూ వచ్చాం. మేం బట్టలు వేసుకున్న తర్వాత మేరీ నన్ను తదేకంగా చూస్తుండిపోయింది. ఆమె కళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. నేను ఆమెను ముద్దు పెట్టుకున్నాను. తర్వాత ఇద్దరం మాట్లాడకుండా కాసేపు అలాగే ఉండి పోయాం.

మేం ఒడ్డుకి నడుస్తున్నపుడు ఆమెను నాకేసి గట్టిగా అదుముకున్నాను. బస్సెక్కి త్వరగా మా ఇంటికి చేరి పడకపై వాలిపోవాలని ఇద్దరం త్వరపడుతున్నాం. నేను కిటికీ తెరిచాను. సూర్యుడి వేడితో కాలిపోయిన మా శరీరాలను రాత్రిపూట వీచే ఆ చల్లటి గాలి సేద దీరుస్తోంది.

మరునాటి ఉదయం తను ఖాళీగానే ఉంటానని మేరీ చెప్పింది. ఆమె నాతో కలసి భోజనం చేయాలని నేను అడిగాను. దానికి ఆమె ఒప్పుకుంది. నేను మాంసం కొని తేవడానికి కిందకు వెళ్ళాను. నేను తిరిగి వచ్చేటప్పుడు రేమాండ్ గదిలోంచి ఒక అమ్మాయి గొంతు వినిపించింది. తర్వాత కాసేపటికి సాలమనో తన కుక్కను తిడుతున్న శబ్దం, చెక్క మెట్లమీద బూట్ల చప్పుడు వినిపించింది. 'మురికి దయ్యమా తొందరగా కదులు' అంటున్న మాటలు, తర్వాత ఆ ఇద్దరూ వీధిలోనికి వెళ్ళిన చప్పుడు వినిపించాయి. నేను సాలమనో అలవాట్ల గురించి మేరీకి వివరించాను. ఆమె పగలబడి నవ్వింది. ఆమె నా పైజమా వేసుకుని ఉంది. పొడవవడంతో పాదాల దగ్గర మడిచి పెట్టుకుంది. ఆమె నవ్వుతుంటే నాకు మళ్ళీ ఆమె కావాలని అనిపించింది. కాసేపాగి ఆమె నేను తనను ప్రేమిస్తున్నానా అని అడిగింది. అలాంటి ప్రశ్నకు ఎలాంటి అర్థమూ ఉండదని నేనన్నాను. ఆమెను బహుశా నేను ప్రేమించడంలేదని చెప్పాను. ఆమె కాసేపు విషాదంగా మౌనంగా కూర్చుంది. అయితే మా భోజనం సిద్ధం అయే సమయానికి ఆమె తిరిగి మామూలుగా అయి నవ్వగలిగింది. ఆమె నవ్వినప్పుడల్లా నాకు ఆమెను ముద్దుపెట్టుకోవాలని అన్పిస్తుంటుంది. సరిగ్గా అదే సమయానికి రేమాండ్ గదిలో గొడవ మొదలయింది.

మొదట అతని గదిలోనుంచి ఒక స్త్రీ గొంతు గట్టిగట్టిగా అరుస్తూ వినిపించింది. తర్వాత "నువ్వు నన్ను మోసం చేశావు, వంచకురాలా నాకు తెలుసు. నన్ను మోసం చేశావు" అంటూ రేమాండ్ గట్టిగా వేస్తున్న కేకలు, తర్వాత వెన్ను జలదరించేలా ఒక భయంకరమైన కేక వినిపించింది. తర్వాత కాసేపటికి అతని అపార్ట్‌మెంటు ముందు జనం గుమి కూడారు. మేరీ, నేనూ కూడా చూడడానికి వెళ్ళాం. ఆ స్త్రీ ఇంకా అరుస్తూనే ఉంది. రేమాండ్ కూడా ఇంకా కొడుతూనే ఉన్నాడు. "అబ్బ! దారుణంగా లేదూ అంది మేరీ. నేను సమాధానం చెప్పలేదు. వెళ్ళి పోలీసులను తీసుకురమ్మని మేరీ నాతో అంది. అయితే నాకు పోలీసులంటే ఇష్టం ఉండదని ఆమెకు చెప్పాను. అయినా త్వరలోనే ఒక పోలీస్ వచ్చాడు. పై అంతస్థులో ఉండే ఒక ప్లంబర్ పోలీసును వెంటబెట్టుకుని వచ్చాడు.అతను తలుపుపై కొట్టగానే లోపల చప్పుడు ఆగిపోయింది. అతను మళ్ళీ తలుపు కొట్టాడు. కాసేపటికి లోపల స్త్రీ ఏడుపు వినిపించింది. రేమాండ్ తలుపు తెరిచాడు. అతని కింద పెదవి కింద సిగరెట్ నలుగుతోంది. బైటకు వస్తూ అతను

నవ్వలేక నవ్వాడు. 'నీ పేరు' అని పోలీస్ అడుగగా రేమాండ్ పేరు చెప్పాడు.

"నువ్వు నాతో మాట్లాడేటప్పుడు ముందు ఆ సిగరెట్ తీసి పారేసి మాట్లాడు" అని పోలీస్ కోపగించుకున్నాడు. రేమాండ్ తటపటాయించి, నా వైపొకసారి చూసి, సిగరెట్‌ను అలాగే నోటిలో ఉంచుకున్నాడు. అప్పుడు పోలీసు చేయి చాచి రేమాండ్ ఎడమ చెంపమీద గట్టిగా లాగిపెట్టి ఒకటి కొట్టాడు. సిగరెట్ అతని నోట్లోనుంచి ఎగిరి ఒక అడుగు అవతల పడింది. రేమండ్ మొహం అదోలాగ మారిపోయింది. ఒక నిముషంపాటు ఏమీ అనలేదు. తర్వాత గొంతును వినయంగా మార్చి తన సిగరెట్‌ను కిందనుంచి తీసుకోవచ్చునా అని అడిగాడు. దానికి పోలీసు 'సరే' అన్నాడు. అయితే గుర్తుంచుకో రెండో సారి ఇలాంటి గొడవలు చేస్తే సహించేది లేదు. అందులోను నీ లాంటి తిరుగుబోతుల్ని" అని అతను అన్నాడు. ఈ లోగా ఆ అమ్మాయి వెక్కుతూ "అతడు నన్ను కొట్టాడు. పిరికివాడు. వాడో వ్యభిచారి" అంటూ అనసాగింది. "నన్ను క్షమించండి సార్. ఇంతమంది ఎదుట ఆమె నన్ను వ్యభిచారి అని తిట్టింది. అది నేరం కాదా" అని రేమాండ్ అడగ్గా "నీ ఎత్తులు ఆపి నోరు మూసుకో" అని పోలీసు విసుక్కున్నాడు. రేమాండ్ అప్పుడు ఆ అమ్మాయి వైపు తిరిగి "బాధపడకు ప్రియా మనం మళ్ళీ కలుద్దాం" అన్నాడు. 'చాలు ఇంక ఆపు' అని పోలీసు అతనిపై అరిచి ఇంక నువ్వు వెళ్ళిపొమ్మని ఆ అమ్మాయికి చెప్పాడు. రేమాండ్ పోలీస్ స్టేషన్‌కి రావాల్సి ఉంటుందని అతను అన్నాడు. తర్వాత రేమాండ్ వైపు తిరిగి "నీకు ఏ మాత్రం సిగ్గనిపించడం లేదా? కదలకుండా కాసేపు కూడా సరిగ్గా నిలబడలేవా"? అని అరిచాడు.

"మీరు అక్కడ నిలబడి అదేపనిగా నన్ను చూస్తోంటే నాకు కొంచెం కాళ్ళు వణుకుతున్నాయి. అంతే. అది సహజమే కదా" అని రేమాండ్ సమాధానమిచ్చాడు. తర్వాత అతను తలుపు వేసుకుని లోపలకు వెళ్ళిపోయాడు. మేరీ, నేను భోజనం అయిందనిపించాం. ఆమె తనకు అంత ఆకలిగా లేదంది. నేను మొత్తం తినేసాను. ఆమె వెళ్ళిపోయిన తరువాత నేను చిన్న కునుకు తీసాను.

దాదాపు మూడవుతుండగా తలుపు తట్టి రేమాండ్ గదిలోకి వచ్చాడు. మంచం చివర కూర్చుని ఒక నిముషం మాట్లాడకుండా అలాగే ఉండిపోయాడు. ఇదంతా ఎలా జరిగిందని నేను ప్రశ్నించాను. మొదట అంతా ముందుగా అనుకున్న ప్రకారమే జరిగిందని, అయితే ఆమె తన చెంపపై కొట్టడంతో పరిస్థితి మొత్తం మారిపోయి తను కూడా కొట్టడం మొదలుపెట్టానని అతను చెప్పాడు. తర్వాత జరిగింది అతను చెప్పాల్సిన అవసరం లేకపోయింది. అప్పుడు నేను అక్కడే ఉన్నాను.

"సరే ఆమెకు సరైన పాఠం చెప్పాలని అనుకున్నావు. చెప్పావు. ఇదేగా నువ్వు కోరుకుంది" నేను అడిగాను. అతను ఒప్పుకున్నాడు. పోలీస్ రావడం వల్ల జరిగినదానిని

పక్కన పెడితే ఆమెకు సరైన శిక్ష పడిందని అనేదానిలో మాత్రం తేడా లేదని అతను అన్నాడు. ఇక పోలీస్ విషయానికి వస్తే వాళ్ళను ఎలా చూసుకోవాలో తనకు బాగా తెలుసని అన్నాడు. అయితే పోలీస్ తనను కొట్టినప్పుడు అతను తిరిగి కొట్టి ఉండాల్సిందని నేను అనుకున్నానా అని రేమాండ్ అడిగాడు. నేను అలాంటిదేమీ లేదని అతనికి చెప్పాను. పోలీసులంటే నాకు అంత సదభిప్రాయంలేదని అన్నాను. రేమాండ్ సంతోష పడినట్టు కనిపించాడు. నేను తనతో కొద్ది సేపు షికారుకు రాగలనా అని అడిగాడు. నేను పడక మీద నుంచి లేచి తల దువ్వుకున్నాను. నేను తన తరపున సాక్ష్యం చెప్పాలని అతను అడిగాడు. నాకు అభ్యంతరం లేదని చెప్పాను. అయితే నేను ఏం చెప్పాల్సి ఉంటుందో చెప్పమని అడిగాను. "చాలా చిన్న విషయం. ఆమె నన్ను మోసం చేసిందని ఒక్క మాట చెబితే చాలు" అని అన్నాడు. దానితో అతని తరపున సాక్ష్యం చెప్పడానికి నేను అంగీకరించాను.

మేం ఇద్దరం బైటకు వెళ్ళాం. రేమాండ్ ఒక కేఫ్‌లో నా కోసం బ్రాందీ కొన్నాడు. తర్వాత మేం కాసేపు బిలియర్డ్స్ ఆడాం. కొద్ది పాయింట్ల తేడాతో నేను ఓడిపోయాను. తర్వాత ఏదన్నా బ్రోతల్ హౌస్‌కి వెళ్దామా అని అతను నన్ను అడిగాడు. నేను వద్దన్నాను. నాకు వెళ్ళాలనిపించలేదు. మేం నిదానంగా నడుచుకుంటూ వెనక్కు వస్తున్నపుడు తన ప్రియురాలికి తగిన గుణపాఠం చెప్పినందుకు తనకు చాలా సంతోషంగా ఉందని రేమాండ్ అన్నాడు. అతడు నాతో ఎంతో ఆప్యాయంగా, ప్రేమగా మాట్లాడాడు. అతనితో కలిసి షికారుకు వెళ్ళడం నాకు సంతోషాన్ని కలిగించింది. మేం ఇంటికి తిరిగి వచ్చినపుడు సాలమనో ఇంటికి దగ్గర్లో నిలబడి ఉన్నాడు. ఆయన చాలా ఉద్వేగంగా ఉన్నాడు. ఆయన వెంట కుక్క లేకపోవడాన్ని నేను గమనించాను. ఆయన పిచ్చి పట్టినట్టుగా అన్ని వైపులకీ తిరిగి చూస్తున్నాడు. మధ్య మధ్యలో తన కళ్ళు చికిలించి హాల్లోని చీకట్లోకి నిశితంగా చూస్తున్నాడు. తర్వాత తనలో తను కాసేపు గొణుక్కుని తిరిగి వీధిలోకి చూడసాగాడు. ఏమయిందని రేమాండ్ ఆయన్ని అడిగాడు. అయితే ఆయన సమాధానం చెప్పలేదు. తర్వాత గట్టిగా "ఆ దరిద్రపు కుక్క, ఆ దయ్యం" అంటూ తిట్టడం మొదలు పెట్టాడు. ఆయన కుక్క ఏమయిందని నేను అడిగినపుడు ఆయన నా వైపు చూసి "పోయింది" అని గట్టిగా కొట్టినట్టు సమాధానం చెప్పాడు. ఒక నిముషం ఊరుకుని చెప్పడం మొదలు పెట్టాడు.

"నేను దానిని మామూలుగా పెరేడ్ గ్రౌండ్‌కి తీసుకువెళ్ళాను. అక్కడ ఏదో సంత జరుగుతోంది. జనం కిక్కిరిసి ఉన్నారు. నేను మధ్యలో ఒక షాపు దగ్గర ఆగి ఏదో చూసి పక్కకు తిరిగేటప్పటికి అది లేదు. ఎక్కడికో పోయింది. ఎప్పటినుంచో చిన్న మెడపట్టీ తెద్దామని అనుకుంటూనే ఉన్నాను. అయితే ఇది ఇలా తప్పించుకుని పోతుందని

నేను కలలో కూడా అనుకోలేదు" అని చెప్పాడు. ఫరవాలేదు కుక్క ఇంటికి తిరిగి వస్తుందిలెమ్మని రేమాండ్ ఆయనకు ధైర్యం చెప్పాడు. వేలకొద్దీ మైళ్ళు ప్రయాణించేసి తమ యజమానుల వద్దకు చేరిన కుక్కల కథల గురించి అతను చెప్పసాగాడు. అయితే ఇవన్నీ ఆ ముసలాయన ఆందోళనను మరింత పెంచినట్టు అనిపించింది. "మీకు అర్థం కాలేదా? దానిని పోలీసు వాళ్ళు తీసుకువెళ్ళి ఉంటారు. దానిని ఎవరైనా తీసుకువెళ్ళి పెంచుకోవడం అంటూ జరగదు. దాని వంటి మీద ఉన్న కురుపులు, మచ్చలు చూసి దాని జోలికి ఎవరూ వెళ్ళరు" అన్నాన్నేను. పోలీస్ స్టేషన్‌లో వీధి కుక్కలుండే బందెలదొడ్డి వంటిది ఉంటుందని ఆయన కుక్క తప్పక అక్కడ ఉండవచ్చని చెప్పాను. ఏదో కొద్ది మొత్తం డబ్బు ఇచ్చి దానిని వెనక్కు తీసుకోవచ్చని చెప్పాను. ఎంత డబ్బు ఇవ్వాలి అని ఆయన నన్ను అడిగాడు. నేను చెప్పలేక పోయాను. తిరిగి ఆయన కోపం తార స్థాయి నందుకుంది.

"అలాంటి దొంగకుక్క కోసం నేను డబ్బులు ఖర్చు పెట్టాలంటారా? సమస్యేలేదు. కావాలంటే వాళ్ళు దాన్ని చంపుకోనీ" అంటూ ఆయన తిరిగి కుక్కను తిట్టడం మొదలు పెట్టాడు. రేమాండ్ పెద్దగా నవ్వి హాల్లోకి నడిచాడు. నేను కూడా అతనితో పాటు పై అంతస్థులోకి వెళ్ళాను. అక్కడ మేం విడిపోయి నేను నా గదిలోకి వెళ్ళాను. ఒకటి రెండు నిముషాల తరువాత సాలమనో తలుపు తట్టాడు. నేను తలుపు తెరవగానే ఆయన గుమ్మం బైటే నిలబడి "క్షమించండి. నేను మీ పనికి అంతరాయం కలిగించడం లేదు కదా" అని అడిగాడు. నేను ఆయనని లోపలకు రమ్మన్నాను. రానన్నట్టు ఆయన తల ఆడించాడు. ఆయన కళ్ళు తనువేసుకున్న బూట్లమీద ఉన్నాయి. ముడతలు పడిన ఆయన చేతులు వణికిపోతున్నాయి. ఆయన నా కళ్ళలోకి చూడకుండానే మాట్లాడడం మొదలుపెట్టాడు. "వాళ్ళు దాన్ని నిజంగా నానుంచి తీసుకుని వెళ్ళి ఉంటారంటారా మెర్‌సాల్ట్ గారూ. కచ్చితంగా అలాంటి పని చేయరేమో అనుకుంటున్నాను. వాళ్ళు కనుక ఆ పని చేసి ఉంటే నేను ఏమవుతానో నాకే తెలీడంలేదు" అన్నాడు. నాకు తెలిసినంత వరకూ పోలీసులు వీధి కుక్కల్ని మూడురోజుల పాటు బందెల దొడ్డిలోనే పెట్టి ఉంచుతారని, వాటి యజమానులు వచ్చి తీసుకువెళ్ళడానికి వీలుగా ఆపని చేస్తారని చెప్పాను. మూడు రోజుల తర్వాత తమకు తోచిన విధంగా నిర్ణయం తీసుకుంటారని చెప్పాను. ఆయన ఏం మాట్లాడకుండా ఒక నిముషం పాటు చూస్తుండి పోయాడు. తర్వాత 'గుడీవినింగ్' అని చెప్పి వెళ్ళిపోయాడు. తర్వాత కాసేపటివరకూ ఆయన గదిలో అటూ ఇటూ పచార్లు చేయడం వినిపించింది. తర్వాత ఆయన మంచం కదిలిన చప్పుడయింది. తర్వాత ఆయన గదిలో నుంచి ముక్కు చీదుతున్న శబ్దం వినిపించింది. ఆయన ఏడుస్తున్నట్టున్నాడని నాకు అర్థమయింది. ఎందుకో తెలీదు నేను అమ్మ గురించి

ఆలోచించడం మొదలు పెట్టాను. అయితే మర్నాడు నేను తొందరగా లేవాలి. అంత ఆకలిగా కూడ అనిపించకపోవడంతో భోజనం చేయకుండానే నిద్రకు ఉపక్రమించాను.

# 5

రేమాండ్ నాకు ఆఫీసుకు ఫోన్ చేశాడు. తనకు ఒక స్నేహితుడు ఉన్నాడని., అతనికి అల్జీర్స్‌కు దగ్గరగా సముద్రపు ఒడ్డున ఒక బంగ్లా ఉందని, అతను వచ్చే ఆదివారం అక్కడ గడపడానికి నన్ను ఆహ్వానించాడని చెప్పాడు. నా గురించి రేమాండ్ తరుచుగా చెప్పడం వల్ల అతను నన్ను కూడా ఆహ్వానించినట్టు చెప్పాడు. వినగానే నాకూ ఆనందం కలిగింది. అయితే ఆదివారం తనతో గడుపుతానని ఒక అమ్మాయికి నేను వాగ్దానం చేశానని అతనితో అన్నాను. రేమాండ్ వెంటనే ఆమె కూడా రావచ్చుని చెప్పాడు. మగవాళ్ళ పార్టీ మధ్య తనకు తోడు దొరికినందుకు నిజానికి తన మిత్రుడి భార్య చాలా సంతోషిస్తుందని కూడా అతనన్నాడు.

మా యజమానికి ఆఫీసు ఫోన్‌ను వ్యక్తిగత అవసరాలకు ఉపయోగించడం అంత ఇష్టం ఉండదు. అందుకే ఫోన్ పెట్టేయబోతుండగా ఇంకో విషయం ఉందని ఫోన్ పెట్టేయవద్దని రేమాండ్ నన్ను కోరాడు. ఆదివారపు ఆహ్వానాన్ని అందజేయడానికి తాను సాయంత్రం వరకూ ఆగేవాడినేనని నిజానికి నాకు చెప్పాల్సిన ముఖ్య విషయం ఇంకోటి వుందని అందుకే ఫోన్ చేశానని చెప్పాడు. "అదేంటంటే ఇవాళ ఉదయం నుంచీ నన్ను కొందరు స్థానికులు (అరబ్బులు) వెంటాడుతున్నారు. వాళ్ళలో నేను గొడవ పెట్టుకున్న అమ్మాయి అన్న కూడా ఉన్నాడు. నువ్వు ఇంటికి తిరిగి వచ్చిన తరువాత కూడా వాళ్ళు అక్కడ ఇంటి దగ్గరే తచ్చాడుతుంటే నాకు ఆ విషయం తెలియచేయి" అని అతనన్నాడు. సరేనని మాటిచ్చాను.

అదే సమయంలో మా యజమాని నాకోసం కబురుచేశాడు. ఒక నిముషం నేను వ్యాకులపడ్డాను. ఆఫీసు ఫోన్‌లో స్నేహితులతో కబుర్లు చెబుతూ సమయం వృధా చేయకుండా పని సంగతి చూడమని చెప్పడానికే ఆయన పిలిపించి ఉండొచ్చని ఊహించాను. అయితే అలాంటిదేమీ జరుగలేదు. ఆయన ఒక ప్రాజెక్ట్ విషయమై నాతో చర్చించడానికి నన్ను రమ్మన్నాడు. ఆయన ఒక్కడే ఏ నిర్ణయానికి రాలేక నన్ను పిలిచాడు. పారిస్‌లో ఒక ఆఫీసు పెడితే ఎలా ఉంటుందని ఆయన ఆలోచిస్తున్నాడు. పెద్దపెద్ద కంపెనీల పనులు పోస్టల్ జాప్యం వలన ఆలస్యం కాకుండా అప్పటికప్పుడు చేయడానికి దీని వల్ల అవకాశం ఉంటుందని అన్నాడు. నాకు పారిస్ వెళ్ళడం ఇష్టమేనా అని అడిగాడు.

"నువ్వింకా యువకుడివి. పారిస్‌లో ఉండడాన్ని నువ్వు చాలా ఇష్టపడతావని నేను

కచ్చితంగా చెప్పగలను. సంవత్సరంలో కొన్ని నెలలు ఫ్రాన్స్‌కు వెళ్ళివస్తే చాలు" అని అన్నాడు. పారిస్ వెళ్ళడానికి నేను సిద్ధంగానే ఉన్నానని చెప్పాను. అయితే వెళ్ళడానికి, మానడానికి పెద్దగా తేడా లేదని అందులో ఆలోచించాల్సిందేమీ లేదని నేనన్నాను. "జీవితంలో మార్పురావాలని నువ్వు కోరుకోవడం లేదా" అని ఆయన నన్ను అడిగాడు.

"ఒకరి వాస్తవ జీవితాన్ని ఒకరు ఎప్పుడూ మార్చలేరు. అయినా ఒకరకమైన జీవితం బాగున్నట్టే ఇంకో రకమైన జీవితం కూడా అంతే బాగుంటుంది. నా ఇప్పటి జీవితం నాకు బాగానే ఉంది" అని నేను సమాధానమిచ్చాను. దానితో ఆయన కొంచెం గాయపడ్డట్టు చూశాడు. నేను ఎప్పుడూ చాదస్తంగా మాట్లాడతానని, జీవితంలో పైకి ఎదగాలనే కోరిక నాకు ఏ మాత్రం లేదని అది వ్యాపారం చేస్తున్న వాళ్ళకి ఉండకూడని అవలక్షణం అని అన్నాడు.

నేను తిరిగి నా సీటు వద్దకు వచ్చి పనిలో పడ్డాను. నేను ఇంక ఆయన్ని ఎక్కువగా బాధించదలచుకోలేదు. అయితే నా జీవితాన్ని మార్చుకోవడానికి నాకు ఏ కారణం కనిపించలేదు. నిజానికి అది ఏమంత అసౌఖ్యంగా లేదు. విద్యార్థిగా ఉన్నప్పుడు ఆయన చెప్పిన ఆశయాలు, కోరికలు లాంటివి చాలానే ఉండేవి. అయితే నేను చదువు వదిలిపెట్టగానే అదంతా వట్టి వృథా ఆలోచనని చాలా త్వరగా తెలుసుకోగలిగాను.

మేరీ ఆ రోజు సాయంత్రం వచ్చి తనను పెళ్ళి చేసుకోమని అడిగింది. నాకు అభ్యంతరం లేదని నేను చెప్పాను. పెళ్ళి చేసుకోవాలని ఆమెకు అంత గట్టి పట్టుదలగా ఉంటే అలాగే చేసుకుందామని చెప్పాను. అప్పుడు మేరీ తిరిగి నేను తనను ప్రేమిస్తున్నానా అని అడిగింది. నేను దాదాపు అంతకు ముందులాగానే సమాధానం చెప్పాను. ఆమె ప్రశ్నకు అర్థం లేదని, తర్వాత కూడా ఉండదని నేను అన్నాను. నేను బహుశా ఆమెను ప్రేమించడం లేదని చెప్పాను. "నువ్వు అలా అనుకుంటున్నప్పుడు నన్ను పెళ్ళిచేసుకోవడం ఎందుకు" అని మేరీ అడిగింది.

నిజానికి వివాహానికి అంత ప్రాధాన్యం ఏమీ లేదని, అయితే దాని వల్ల మేరీకి ఆనందం కలిగేటట్టయితే ఇప్పటికిప్పుడు వివాహం చేసుకుందామని నేను స్పష్టంచేశాను. ఆ ప్రతిపాదన ముందు మేరీ నుంచి వచ్చిందని నేను కేవలం దానికి అంగీకరించానని నేను వివరించాను. వివాహం అనేది లోతుగా ఆలోచించాల్సిన విషయం అని మేరీ వ్యాఖ్యానించింది. కాదని నేనన్నాను. ఆమె కాసేపు మాట్లాడకుండా నావంక కుతూహలంగా చూస్తూ కూర్చుంది. "ఒకవేళ ఇంకొక అమ్మాయి ఎవరైనా వచ్చి నిన్ను వివాహం చేసుకోమని అడిగితే, నేనంటే ఇష్టపడుతున్న విధంగానే ఆ అమ్మాయిని కూడా నువ్వు ఇష్టపడుతున్నట్టయితే ఆమెకు కూడా నువ్వు సరే అనే చెబుతావా" అని మేరీ నన్నడిగింది.

"చెబుతాను" అని నేనన్నాను.

నన్ను నిజంగా ప్రేమిస్తున్నానా లేదా అని తన మీద తనకే సందేహంగా ఉందని మేరీ అంది. ఆమెకు ఆ విషయంలో నేనేమీ బోధపరచదలుచుకోలేదు. తర్వాత కాసేపు మౌనంగా కూర్చుని నేను "విచిత్రమైన మనిషిని" అని తనలో తాను గొణుక్కుంది. అయితే ఆ లక్షణం వల్లనే ఆమె నన్ను ప్రేమిస్తోందని అయితే కేవలం ఆకారణంగానే ఏదో ఒక రోజు నన్ను అసహ్యించుకోవలసి వస్తుందేమోనని మేరీ అంది. దానికి సమాధానం చెప్పడానికి నా దగ్గర ఏమీ లేదు. అందుకే నేను ఏమీ చెప్పకుండా మౌనంగా ఉండిపోయాను. ఆమె కాసేపు ఆలోచించుకుంటూ కూర్చుండిపోయి తర్వాత నవ్వడం మొదలెట్టింది. నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని తనకు నన్ను వివాహం చేసుకోవాలని నిజంగా చాలా కోరికగా ఉందని చెప్పింది. "అయితే సరే. నువ్వు ఎప్పుడు అంటే అప్పుడు వివాహం చేసుకుందాం" అని నేను అన్నాను. తరువాత మా యజమాని చేసిన ప్రతిపాదనను ఆమెకు తెలియజేశాను. తనకు పారిస్ వెళ్ళాలని ఎంతో కోరికగా ఉందని మేరీ చెప్పింది. నేను పారిస్‌లో కొంతకాలం ఉన్నానని చెప్పాను. ఆమె అది ఎలా ఉంటుంది అని అడిగింది. "నా కెందుకో మురికి నగరం అనిపిస్తుంది. గుంపులు గుంపులుగా ఉండే పావురాలు, చీకటిగా ఉండే విశాలమైన ఆవరణలు పాలిపోయి నట్లుండే తెల్లటి మొహాలు" అంటూ పారిస్‌ను వర్ణించాను.

తర్వాత ప్రధాన వీధుల గుండా మేం కాసేపు తిరిగి రావడానికని వెళ్ళాం. కొంత మంది అమ్మాయిలు అందంగా కనిపించారు. మేరీ కూడా ఈ విషయాన్ని గమనించిందా అని అడగ్గా ఆమె అవునని సమాధానమిచ్చింది. నేను ఎందుకన్నానో ఆమెకు అర్థం అయింది. కొన్ని నిముషాల పాటు మేం మాట్లాడుకోలేదు. ఆమె అప్పుడే వెళ్ళిపోవడం నాకు ఇష్టం లేదు. అందుకే సెలెస్టి రెస్టారెంట్‌లో కలసి భోజనం చేద్దామని ఆమెతో అన్నాను. నాతో కలసి భోజనం చేయడం అంటే తనకు ఎంతో ఆనందాన్ని కలిగించే విషయమని అయితే ఆ రోజు సాయంత్రం తనకు వేరే పని ఉందని ఆమె చెప్పింది. మా ఇంటికి రాగానే నేను ఆమెకు గుడ్‌బై చెప్పాను. ఆమె నా కళ్ళలోకి చూసింది.

"ఈ సాయంత్రం నేను ఏం చేయాలనుకుంటున్నానో నీకు తెలుసుకోవాలని లేదా" అని అడిగింది. నిజానికి నాకు తెలుసుకోవాలనే ఉంది. అయితే ఆమెను అడగడం ఇష్టం లేదు. అడిగితే ఆమె ఏమైనా అనుకోవచ్చు అనుకున్నాను. నేను ఇబ్బంది పడినట్టుగా చూశాను. ఆమె అకస్మాత్తుగా నవ్వి నా వైపు తలవంచి పెదాలపై ముద్దుకోసమన్నట్లుగా చూసింది.

సెలెస్టి రెస్టారెంట్‌కు నేను ఒక్కడినే వెళ్ళాను. నేను డిన్నర్ చేయడం ప్రారంభించగానే వింతగా కనిపిస్తున్న ఒక పొట్టి యువతి లోపలికి వచ్చి నా టేబుల్ దగ్గర కూర్చొనవచ్చా

అని అడిగింది. కూర్చోవచ్చని చెప్పాను. ఆమె మొహం పండిన యాపిల్ పండులా గుండ్రంగా ఉంది. కళ్ళు కాంతివంతంగా మెరుస్తున్నాయి. ఏదో వైర్లమీద నడుస్తున్నట్టుగా ఆమె నడక తమాషాగా ఉంది. బిగుతుగా ఉన్న కోటు తీసి కుర్చీలో కూర్చుంటూ ఆమె మెనూ కార్డుని శ్రద్దగా చదవడం మొదలెట్టింది. తర్వాత ఆమె సెలెస్టిని పిలిచి ఏమేం కావాలో చెప్పింది. త్వరత్వరగా చెప్పినా ఎక్కడా ఒక మాట కూడా తేడా లేకుండా చెప్పింది. ఆర్డర్ ఇచ్చిన పదార్థాలు వచ్చేలోపల వట్టిగా ఎదురుచూస్తూ కూర్చోకుండా ఆమె మళ్ళీ బ్యాగ్ తెరచి ఒక పేపరు, పెన్సిల్ తీసుకుని బిల్లు ఎంత అవుతుందో లెక్కగట్టి చూసుకుంది. తిరిగి బ్యాగు లోంచి పర్సు తీసి బిల్లు ఎంత అవుతుందో అంతే మొత్తం టిప్పుతో సహా కలిపి తీసి తన ముందున్న టేబుల్ క్లాత్ మీద పెట్టింది. వెయిటర్ ఆమె చెప్పిన పదార్థాలు తీసుకురాగానే ఆమె గబగబా తినడం మొదలు పెట్టింది. తర్వాతి పదార్థాలు తెచ్చేలోపల ఆమె మళ్ళీ పెన్సిల్ తీసుకుని రేడియో మాగజైన్ తీసి వచ్చే వారం వినాల్సిన కార్యక్రమాలను గుర్తు పెట్టడం మొదలు పెట్టింది. ఓ పక్క తింటూనే దాదాపు పన్నెండు పేజీలున్న ఆ పుస్తకాన్ని ఆమె శ్రద్ధగా పరిశీలించింది. నేను నా భోజనం ముగించేటప్పటికి కూడా ఆమె అదే శ్రద్ధతో కార్యక్రమాలను గుర్తుపెడుతూనే ఉంది. తర్వాత లేచి కోటు తీసుకుని కుందేలులా చాలా వేగంగా రెస్టారెంట్ నుంచి బైటకు నడిచింది.

ప్రత్యేకంగా చేసేపని అంటూ లేకపోవడంతో నేను కొద్ది దూరంలో ఆమె వెనుకే నడవ సాగాను. పేవ్‌మెంట్ పక్కనే అటూఇటూ చూడకుండా అంత చిన్న శరీరంతో ఆమె ఎంత వేగంగా నడిచిందంటే ఆమె నడక వేగాన్ని నేను కూడా అందుకోలేక పోయాను. త్వరలోనే ఆమె నా కంటికి కనిపించకుండా పోవడంతో ఏం చేసేది లేక ఇంటికి తిరుగు ముఖం పట్టాను. ఆ చిన్న కుందేలు లాంటి యువతి నన్ను కొంచెంసేపు చాలా ప్రభావితం చేసింది. అయితే త్వరలోనే నేను ఆమెను మర్చిపోయాను.

నేను నా గదిలోకి వెళ్ళబోయే ముందు సాలమనో దగ్గరికి వెళ్ళి ఆయన్ని నా గదికి రమ్మని పిలిచాను. తన కుక్క ఖచ్చితంగా తప్పిపోయినట్లేనని ఆయన అన్నాడు. తాను పోలీస్ స్టేషన్‌లోని బందెల దొడ్డికి వెళ్ళి అడిగానని అయితే కుక్క అక్కడ లేదని ఆయన చెప్పాడు. అది బహుశా ఏదైనా వాహనం కింద పడిపోయి ఉండొచ్చని అక్కడి సిబ్బంది అన్నారని చెప్పాడు. పోలీస్ స్టేషన్‌లో కనుక్కుంటే ఆ విషయం గురించి ఏమైనా తెలుస్తుందా అని అడగ్గా వీధుల్లో ప్రమాదాలకు గురైన కుక్కల గురించి రికార్డులు తయారుచేయటం కన్నా పోలీసులకు ముఖ్యమైన విషయాలు ఇంకా చాలా ఉంటాయని వారు అన్నారని సాలమనో చెప్పాడు. ఆయన ఇంకొక కుక్కను తెచ్చుకుంటే బాగుంటుందని నేను అనగా ఈ కుక్క తనకు బాగా అలవాటైపోయిందని, ఇంకొక

కుక్క ఈ కుక్కకు సమానం కాదు కదా అని అన్నాడు. నేను మంచంపై కాళ్ళు పైన పెట్టుకుని కూర్చోగా సాలమనో టేబుల్ పక్కనున్న కుర్చీలో మోకాళ్ళ పై చేతులుంచుకుని నాకు ఎదురుగ్గా కూర్చున్నాడు. పాడైపోయి వెలిసిపోయిన టోపీతో ఆయన తనలో తను ఏదో గొణుగుకుంటూ కూర్చున్నాడు. ఆయనతో మాట్లాడటం ఇంక నాకు విసుగనిపించింది. అయితే ఇంక అంతకన్నా చేసేపని లేకపోవడం, నిద్ర కూడా రాకపోవడంతో సంభాషణని అలాగే కొనసాగిస్తూ పోయాను. ఆయన కుక్క గురించి కొన్ని ప్రశ్నలు కూడా అడిగాను. ఆ కుక్క ఆయన దగ్గర ఎన్నేళ్ల నుంచి ఉందని అడిగాను. తన భార్య చనిపోయిన తరువాత నుంచీ తాను ఆ కుక్కను పెంచుకోవడం మొదలు పెట్టానని ఆయన చెప్పాడు. తాను వివాహం ఆలస్యంగా చేసుకున్నట్టు చెప్పాడు. యువకుడిగా ఉన్నప్పుడు తాను నాటకాలు వేసేవాడినని, మిలటరీ సర్వీసులో ఉన్నప్పుడు కూడా అప్పుడప్పుడు అక్కడ వేసే నాటకాలలో పాల్గొంటుండేవాడినని చెప్పాడు. తాను బాగా నటిస్తానని వాళ్ళు చెబుతుండేవారని అయితే చివరకు తాను రైల్వే ఉద్యోగంలో స్థిరపడి పోయానని చెప్పాడు. దానికి తానేమీ చింతించడం లేదని, దాని మూలంగానే ప్రస్తుతం తనకు పెన్షన్ కూడా వస్తోందని చెప్పాడు. తాను తన భార్య అంత గొప్పగా కాకపోయినా ఇంచుమించు అన్యోన్యంగా ఉండే వాళ్ళమని ఆవిడ చనిపోయిన తర్వాత తాను ఒంటరివాడినయ్యానని అన్నాడు. రైల్వేలో తనతో పాటు పనిచేసిన మిత్రుడి ఇంట్లోని కుక్క అప్పుడే పిల్లల్ని పెట్టిందని ఆయన కుక్కపిల్లను తనకు ఇవ్వగా అప్పటి నుంచీ దాన్ని పెంచుకుంటున్నానని చెప్పాడు. మొదట దానికి సీసాలతో పాలు పట్టేవాడినని చెప్పాడు. అయితే కుక్కల జీవితకాలం మనుషుల కన్నా తక్కువ కాబట్టి అది కూడా తనతో పాటే ముసలిదై పోయిందని చెప్పాడు. అనారోగ్యం మూలంగా దానికి చిరాకు ఎక్కువై అప్పుడప్పుడూ కొద్దిగా విసిగించినా అది చాలా మంచి కుక్క అని మెచ్చుకున్నాడు.

దాని అలవాట్లన్నీ మంచివని నేను అనటంతో ఆయన చాలాసంతోషించినట్టు కనబడ్డాడు. దానికి జబ్బు చేయక ముందు నువ్వు చూసి ఉండాల్సింది. దానికి ఒకచక్కటి కోటు ఉండేది. కుక్క ఆరోగ్యాన్ని బాగుచేయడానికి నేను చాలా కష్టపడ్డాను. ఈ చర్మ వ్యాధి వచ్చిన తర్వాత ప్రతి రాత్రి ఆయిట్‌మెంట్ రాస్తుండేవాడిని. నిజానికి దాని అసలు సమస్య వయసు పైబడడం. దానికి ఏ మందు లేదు కదా అని అన్నాడు.

అప్పుడే నేను ఆవలించాను. ఇక తాను వెళ్ళిపోతానని ఆయన అన్నాడు. ఆయన ఇంకాసేపు ఉండొచ్చని, ఆయన కుక్క తప్పిపోవడం గురించి నేను నిజంగా బాధపడుతున్నానని అన్నాను. ఆయన కృతజ్ఞతలు తెలియజేశాడు. మా అమ్మ తన కుక్క అంటే ఎంతో అభిమానం చూపేదని ఆయన అన్నాడు. 'పాపం మీ అమ్మ' అని

ఆయన అంటూ అమ్మ మరణం నన్ను చాలా బాధించి ఉంటుందని అనుకుంటున్నట్టు చెప్పాడు. నేను ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాను. నేను మా అమ్మను వృద్ధాశ్రమానికి పంపించడం గురించి వీధిలో కొందరు నా గురించి చెడ్డగా అనుకుంటున్నారని ఆయన కొంచెం ఇబ్బంది పడుతూ చెప్పాడు. అయితే నిజం ఏమిటనేది తనకు బాగా తెలుసని ఆయన అన్నాడు. "వీధిలోని వాళ్ళు అలా చెడుగా అనుకోవడం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ఆమెను నేను ఇక్కడ ఉంచగలిగిన పరిస్థితి కనిపించక పోవడంతో ఇంక అంతకన్న చేసేదేంలేక ఆమెను వృద్ధాశ్రమానికి పంపించాను. ఆమె ఇక్కడ ఉన్నప్పుడు కూడా సంవత్సరాల తరబడి నాతో ఒక్క మాట కూడా మాట్లాడలేదు. మాట్లాడడానికి ఎవరూ తోడు లేకపోవడంతో ఆమె ఒంటరి తనంతో విసుగెత్తి పోయింది" అని నేనన్నాను.

"అవును. అది నిజమే. వృద్ధాశ్రమంలో అదే వయసులో ఉన్న స్నేహితులు దొరుకుతారు" అని లేచి నిలుచున్నాడు. నిద్రపోవడానికి ఇప్పటికే తనకు చాలా ఆలస్యమయిందని అన్నాడు. మారిన ఈ పరిస్థితుల్లో తనకు రోజు గడవడం కూడా కష్టంగా ఉందంటూ, ఇంత కాలంలో మొదటి సారిగా నాతో కరచాలనానికి చేయి చాచాడు. ఆయన చర్మం నా చేతికి గరుకుగా తగిలింది. గుమ్మం దాటి వెళ్ళబోతూ వెనక్కు తిరిగి కొంచెం నవ్వుతూ "రాత్రికి వీధి కుక్కలు మొరగకుండా ఉండాలని ఆశిద్దాం. కుక్క మొరిగినప్పుడల్లా అది నా కుక్కేమోనని నేను ఉలిక్కిపడుతున్నాను" అని అన్నాడు.

# 6

ఆదివారం ఉదయం అతి కష్టంమీద నిద్ర లేవాల్సి వచ్చింది. మేరీ నా భుజాలు పట్టి కుదుపుతూ పేరుపెట్టి రెండుమూడు సార్లు పిలిచిన తర్వాత కానీ మెలకువ రాలేదు. ఉదయాన్నే నీళ్ళల్లో ఈత కొట్టాలని అనుకోవడంవల్ల పొద్దున్నే ఫలహారం చేసే పని పెట్టుకోలేదు. నాకు కొంచెం తలనెప్పిగా ఉంది. నా మొదటి సిగరెట్ నోటికి చేదుగా అనిపించింది. నేను అంత్యక్రియల సమయంలో దుఃఖించే వ్యక్తిలాగా ఉన్నానని మేరీ అంది. నిజంగా కొంచెం నీరసంగా కూడా ఉంది. మేరీ తెల్లటి డ్రెస్ వేసుకుంది. జుట్టును అలాగే వదిలేసింది. ఆమె అలా చాలా అందంగా ఉందని నేనన్నాను. మేరీ ఆనందంగా నవ్వింది.

మేం బయటకు వస్తూ రేమాండ్ తలుపు మీద తట్టాం. వస్తున్నానని అతను కేక పెట్టాడు. మేం కింద వీధిలోకి వచ్చాం. కొంచెం తలనెప్పిగా ఉండడం, అంతవరకూ గదిలో చీకటిలో ఉండడంతో ఉదయం ఎండ ఒక్కసారిగా కళ్ళల్లో గుచ్చుకున్నట్టయింది.

మేరీ ఆనందంతో గెంతులేస్తోంది. మాటిమాటికి 'ఈ ఉదయం ఎంత బాగుందో' అంటోంది. కాసేపటికి నాకూ కొంచెం బాగున్నట్టు అనిపించింది. అయితే బాగా ఆకలిగా ఉంది. నేను ఈ మాట మేరీతో అన్నా ఆమె దానిని అంతగా పట్టించుకోలేదు. మేరీ భుజానికి ఉన్న బ్యాగ్‌లో స్నానంచేసేటపుడు వేసుకునే డ్రెస్, టవల్ ఉన్నాయి. అంతలో రేమాండ్ తన గది తలుపులు వేస్తున్న శబ్దం వినిపించింది. అతను నీలిరంగు ట్రౌజర్లు, దాని మీదకి చేతుల్లేని తెల్లషర్టు వేసుకున్నాడు. తలపై గడ్డితో చేసిన టోపీ ఉంది. తన ముంజేతులపై దట్టంగా వెంట్రుకలు ఉన్నప్పటికీ అడుగున ఉన్న చర్మం బాగా తెల్లగా ఉన్నట్టు నేను గమనించాను. రేమాండ్ గడ్డి టోపీ చూసి మేరీ నవ్వడం మొదలు పెట్టింది. అతని డ్రెస్ ఎందుకో నాకు అంతగా నచ్చలేదు. రేమాండ్ చాలా ఉత్సాహంగా ఉన్నాడు. ఈలవేసుకుంటూ మెట్లు దిగి వచ్చి "హలో ఓల్డ్‌బాయ్" 'హలోమేడమ్' అంటూ మమ్మల్ని పలకరించాడు.

అంతకు ముందు రోజు సాయంత్రం నేనూ రేమాండ్ పోలీస్ స్టేషన్‌కి వెళ్ళాం. ఆ యువతి రేమాండ్‌ను మోసం చేసిందని నేను సాక్ష్యం చెప్పాను. దానితో వాళ్ళు రేమాండ్‌ను ఒకసారి హెచ్చరించి వదిలేసారు. నేను చెప్పిన విషయం సరైనదా కాదా అని కూడా నన్నడగలేదు.

వీధిలో కాసేపు మాట్లాడుకున్న తర్వాత బస్‌కోసం వెళ్ళాలని మేం నిర్ణయించు కున్నాం. బీచ్ అక్కడికి నడిచి వెళ్ళేంత దూరంలో ఉన్నా అక్కడికి ఎంత త్వరగా వెళితే అంత మంచిది అనే ఉద్దేశంతో అలా నిర్ణయించుకున్నాం. బస్‌స్టాప్‌కు వెళ్ళబోతుండగా రేమాండ్ నాషర్టు పట్టుకుని ఆపి వీధి ఎదురుగుండా చూడమన్నాడు. పొగాకు వ్యాపారస్థుడి దుకాణపు కిటికీని ఆనుకుని కొందరు అరబ్బులు నిలబడి ఉండడం కనిపించింది. వాళ్ళు మా వైపు మౌనంగా చూస్తున్నారు. ఏదో నల్లరాళ్ళనో, చెట్లనో చూసినట్టు మౌనంగా చూస్తున్నారు. ఎడమ నుంచి రెండో అరబ్బు – అంతకు ముందు తను చెప్పిన వ్యక్తి అని రేమాండ్ నా చెవిలో గుసగుసలాడాడు. అతను ఎందుకో ఆందోళన చెందుతున్నట్టు కనిపించాడు. అయితే అదంతా గడిచిపోయిన చరిత్ర అని అతనన్నాడు. రేమాండ్ చేసిన వ్యాఖ్యల్ని మొదట అంతగా పట్టించుకోని మేరీ 'ఏమిటి అతనంటున్నాడు' అని ప్రశ్నించింది. ఆ ఎదురుగా ఉన్న అరబ్బులకీ, రేమాండ్‌కీ చిన్న తగాదా అయిందని నేను మేరీకి వివరించాను. మేరీ అక్కడి నుంచి వెంటనే వెళ్ళిపోదామని తొందర పెట్టింది. రేమాండ్ నవ్వి భుజాలెగురవేశాడు. మేరీ అంటున్న మాట సరైనదేనని అతడన్నాడు. ఇంకా ఇక్కడే ఉండడంలో అర్థంలేదని అతడన్నాడు. బస్టాప్ చేరుకోకముందే అతను కొంచెం తల తిప్పి చూసి అరబ్బులు మనవెంట రావడం లేదని చెప్పాడు. నేను కూడా వెనక్కు తిరిగి చూశాను. వాళ్ళు అంతకు ముందు ఎక్కడున్నారో అక్కడే నిలబడి మా

వైపు అలాగే గుచ్చి గుచ్చి చూస్తున్నారు. మేం బస్సెక్కిన తరువాత రేమాండ్ కొంచెం తేరుకున్నాడు. మేరీతో సరదాగా కబుర్లు చెబుతూ ఆమెను నవ్వించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆమె అతన్ని ఆకర్షించిందని నాకు అనిపించింది. అయితే మేరీ అతన్ని అంతగా పట్టించుకోవడం లేదు. ఆమె మధ్యమధ్యలో నావంక చూస్తూ చిరునవ్వు విసురుతోంది.

మేం అల్జీర్స్ బైటే బస్సు దిగిపోయాం. బస్‌స్టాప్ నుంచీ బీచ్ ఎంతో దూరం లేదు. కొంచెం ఎత్తుగా ఉన్న దిబ్బలాంటిదాన్ని దాటి నాలుగు అడుగులు వేయగానే ఎదురుగా సముద్రం కనిపించింది. ఇక్కడి నేలంతా పసుపురంగులో ఉన్న గులక రాళ్ళు, అడవిలిల్లీ లాంటి పువ్వులతో నిండి ఉంది. నీలపు ఆకాశం కింద తెల్లటి ఎండలో ఆ లిల్లీలు మరింత తెల్లగా అనిపిస్తున్నాయి. మేరీ తన బ్యాగుతో పూలను కొడుతూ రేకులను చెల్లా చెదురు చేస్తూ ఆనందిస్తోంది. తరువాత మేం అటూ ఇటూ ఉన్న చిన్న ఇళ్ళ వరుస మధ్యలోనుంచి నడిచాం. ఇళ్ళకు చెక్కతో చేసిన బాల్కనీలు ఉన్నాయి. ఇళ్ళ వరుసకు దాదాపు చివర్లోకి వచ్చేటప్పటికి సముద్రం పూర్తిగా కనిపించసాగింది. అద్దంలా తళతళ మెరుస్తూ ఉంది. నిశ్చలంగా ఉన్నగాలిలో నుంచి మోటారు ఇంజన్ శబ్దం లీలగా వినిపిస్తోంది. దూరంగా ఒక చేపలు పట్టే పడవ కనిపించింది. అద్దంలా మెరుస్తున్న అలల్ని నెమ్మదిగా చీలుస్తూ పడవపోతోంది. మేరీ కొన్ని గులకరాళ్ళు ఏరింది. సముద్రంలోకి వెళ్ళే దారిలో దిగుతుండగానే ఇసుకలో అప్పటికే కొంతమంది స్నానం చేసి సేద తీరుతూ కనిపించారు.

రేమాండ్ స్నేహితుడికి బీచ్ ఒడ్డున చిన్న చెక్క బంగ్లా ఉంది. కొండ అంచున అది ఆనుకుని ఉంది. బంగ్లా ముందున్న చెక్కమెట్లను సముద్రపు నీరు దాదాపు తడుపుతున్నట్టు ఉంది. రేమాండ్ మమ్మల్ని తన స్నేహితుడైన మేసన్‌కు పరిచయం చేశాడు. ఆయన ఎత్తుగా, విశాలమైన భుజాలతో బలిష్టంగా ఉన్నాడు. ఆయన భార్య కొంచెం లావుగా నవ్వు మొహంతో ఉంది. కొంచెం పారిస్ యాసతో మాట్లాడుతోంది.

మేసన్ మాతో ఇది మీ స్వంత ఇల్లే అనుకోండి. మొహమాట పడవద్దు అన్నాడు. తాను పొద్దున్నే చేపలు పట్టడానికి వెళ్ళి వచ్చానని, మధ్యాహ్న భోజనంలోకి చేపల వేపుడు కూర ఉంటుందని చెప్పాడు. అంత చక్కటి బంగ్లాను స్వంతం చేసుకున్నందుకు నేను ఆయన్ని అభినందించాను. తన వారాంతపు సెలవులను, సెలవు దినాలను ఇక్కడే గడుపుతానని ఆయన సమాధానమిచ్చాడు. "భార్యతో సహా అనేది వేరే చెప్పక్కరలేదు అనుకుంటా" అని కలిపాడు. నేను ఆమె వంక చూశాను. ఆమె, మేరీ బాగా కలిసిపోయారు. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు. బహుశా మొదటి సారిగా మేరీని వివాహం చేసుకుంటే ఎలా ఉంటుంది అనే ఆలోచన నా మదిలో

మెదిలింది.

మేసన్ కాసేపు సముద్రంలో ఈదులాడుదామని అన్నాడు. అయితే ఆయన భార్య, రేమాండ్ అందుకు అంత ఉత్సాహం చూపించలేదు. దానితో మేసన్, మేరీ, నేనూ మేం ముగ్గురమే బీచ్ దగ్గరికి వెళ్ళాం. మేరీ వెంటనే నీళ్ళలోకి దూకింది. నేనూ, మేసన్ ఒడ్డునే కాసేపు ఉండిపోయాం. ఆయనకు మాటకూ మాటకూ మధ్య 'ఇంకా ఏంటంటే' అనే మాటను ఎక్కువగా అనే అలవాటుంది. ఒకోసారి సంబంధం లేకుండా కూడా ఆ పదాన్ని అంటుంటాడు. మేరీ గురించి చెబుతూ ఆయన "ఆమె చాలా అందంగా ఉంది. ఇంకా ఏంటంటే ఆకర్షవంతంగా కూడా ఉంది" అన్నాడు.

అయితే త్వరలోనే నాకు మేసన్ మాటలపై శ్రద్ధ పోయింది. ఉదయపు ఎండ నాపరిస్థితిని కొంత మెరుగుపరిచింది. కాళ్ళ కింద ఎండ కొంచెం కొంచెంగా వేడెక్కుతోంది. సముద్రంలో ఈత కొట్టాలని అనిపిస్తున్నప్పటికీ ఒకటి రెండు నిముషాలు ఓపిక పట్టి చివరకు మేసన్‌ను మనం కూడా నీళ్ళలోకి దూకుదామని అడుగుతూనే నీళ్ళలోకి దూకేసాను. మేసన్ నిదానంగా నడుచుకుంటూ వచ్చి లోతు తక్కువగా ఉన్న దగ్గర చిన్నగా ఈదుతున్నాడు. అందుకని నేను ఆయనని దాటి ముందుకు పోయి మేరీని కలుసుకున్నాను. నీళ్ళు చల్లగా హాయిగా ఉన్నాయి. నాకు బాగా సేద తీరుతున్నట్టు అనిపించింది. మేరీ, నేనూ పక్క పక్కనే చాలా దూరం ఈదుకొంటూ పోయాం. మా ఇద్దరి కదలికలు ఒకేలా కలసిపోయి మనసుకి ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి. మేం ఇద్దరం కూడా ప్రతిక్షణాన్ని ఆస్వాదిస్తూ ఆనందంగా జలకాలాడాం.

మేం బైటకు వచ్చిన తరువాత ఒడ్డునే వెల్లకిలా పడుకున్నాం. నేను ఆకాశం వైపు చూశాను. నాపెదాలపైనా, బుగ్గలపైనా సూర్యుడు ఉప్పునీటితో చిత్రాన్ని గీస్తున్నట్టు నాకు అనిపించింది. మేసన్ కూడా ఒడ్డుకు ఈదుకుంటూ వచ్చి ఇసుకపై వెల్లికిలా పడుకున్నాడు. కొద్ది దూరం నుంచి చూస్తే అతను పెద్ద వేల్ చేపలా ఉన్నాడు. కాసేపాగిన తరువాత మేరీ ఇద్దరం ఒకరి వెనుక ఒకరం ఈదుదామని అంది. తను ముందు ఈదుతుండగా నేను కొంచెం వెనుక ఆమె నడుము చుట్టూ చేతులు వేసి ఈదడం మొదలుపెట్టాను. ఆమె చేతులతో నీటిని నెడుతూ నన్ను ముందుకు తీసుకువెళుతుంటే వెనుకనుంచీ నీటిని వెనక్కు నెడుతూ నేను సహాయం చేస్తున్నాను. కాసేపటికి అలల చప్పుడు నా చెవుల్లో గింగురు మంటున్నట్టు అనిపించి ఇక ఈత కొట్టడం ఆపేయాలి అనుకున్నాను. అందుకే మేరీని వదిలి పెట్టి వెనక్కు వచ్చి గట్టిగా గాలి పీల్చి వదలడం మొదలు పెట్టాను. ఒడ్డుకు చేరగానే నేను కూడా మేసన్ పక్కన బోర్లా పడుకుని మొహాన్ని ఇసుకపై ఆనించాను. ఇక్కడ చాలా బాగుందని నేను అనగా మేసన్ దానికి అంగీకరించాడు. అంతలో మేరీ కూడా వెనక్కు తిరిగి వచ్చింది. ఆమె రావడం చూసి నేను తలపైకెత్తాను.

ఆమె ఉప్పు నీటితో మెరుస్తున్నట్టుగా ఉంది. జుట్టు వెనక్కు మడిచిపెట్టుకుని ఉంది. వచ్చి నా పక్కన ఇసుకలో పడుకుంది. మా శరీరాల నుంచి వస్తున్న వెచ్చదనం, సూర్యుడి నుంచి వస్తున్న వెచ్చదనం కలగలపి నన్ను నిద్రలోకి జారుకునేలా చేశాయి.

కాసేపటికి మేరీ నన్ను తట్టి లేపి మేసన్ ఇంటికి వెళ్ళాడని మధ్యాహ్న భోజనానికి సమయం దగ్గర పడిందని చెప్పింది. ఆకలిగా ఉండడంతో నేను చటుక్కున లేచి కూర్చున్నాను. ఆ రోజు పొద్దుటి నుంచీ నేను తనను ఒక్కసారి కూడా ముద్దు పెట్టుకోలేదని మేరీ అంది. నేను కూడా చాలా సార్లు ఆ మాట అనుకున్నాను. తిరిగి నీళ్ళలోకి వెళదామని మేరీ అనడంతో ఇద్దరం తిరిగి సముద్రపు నీళ్ళలోకి పరిగెత్తి చిన్నచిన్న అలల మధ్య వెల్లికిల్లా పడుకున్నాం. కొద్ది సేపు ఈదిన తర్వాత మేరీ తన చేతులు నా చుట్టూ వేసి నన్ను హత్తుకుంది. ఆమె కాళ్ళు నా కాళ్ళను పెనవేసుకున్నాయి. ఒక్క నిముషం పాటు నాగుండె, శరీరం లయ తప్పాయి.

మేం వెనక్కు తిరిగి వచ్చేటప్పటికి మేసన్ తన బంగ్లా మెట్లమీద నిలబడి మమ్మల్ని రమ్మనమని కేకలు పెడుతున్నాడు. నాకు బాగా ఆకలిగా ఉందని అతనితో అన్నాను. ఆయన భార్య వైపు తిరిగి నేను అతనికి బాగా నచ్చానని చెప్పాడు. రొట్టె చాలా అద్భుతంగా ఉంది. చేప కూడా ఎక్కువ భాగాన్ని నేనే తిన్నాను. తర్వాత వేయించిన మాంసం ముక్కలు, చిప్స్ వచ్చాయి. తినేటపుడు మేం ఎవరం మాట్లాడలేదు. మేసన్ వైన్ బాగా ఎక్కువగా తాగాడు. నా గ్లాసు ఖాళీ అయినప్పుడల్లా వెంట వెంటనే నింపుతున్నాడు. కాఫీ వచ్చేసరికల్లా నాకు కొంచెం మగతగా అనిపించి సిగరెట్లు ఒక దాని తర్వాత ఒకటి వరుసగా కాల్చడం మొదలుపెట్టాను. మేసన్, నేను, రేమాండ్ కలసి ఆగస్టు నెలంతా బీచ్‌లోనే కలిసి ఉండాలని, దానికి అయే ఖర్చుల్ని అందరూ పంచుకోవాలనే విషయాన్ని చర్చించాం. ఉన్నట్టుండి మేరీ ఒక్కసారిగా అరిచింది. "ఇప్పుడు టైమెంతో తెలుసా. ఇంకా పదకొండున్నరే అయింది" అంటూ మేం అందరం దానికి ఆశ్చర్య పోయాం. మేం లంచ్ త్వరగా చేసినట్టని మేసన్ అన్నాడు. నిజానికి లంచ్ అనేది హృదయాలను కదిలించే విందు లాంటిదని అన్నాడు. అయితే దానిని అనుభూతి చెందిన వాళ్ళకే అది తెలుస్తుందని అన్నాడు.

దానితో మేరీ నవ్వడం మొదలుపెట్టింది. ఆమె ఎందుకు నవ్వుతోందో నాకు అర్థం కాలేదు. కొంచెం ఎక్కువగా తాగిందేమోనని నాకు అనిపించింది. బీచ్ ఒడ్డున కాసేపు నడవడం మీకు ఇష్టమేనా అని మేసన్ నన్ను అడిగాడు. "నా భార్య లంచ్ చేసిన తర్వాత ఒక కునుకు తీస్తుంది. అయితే నాకు అది అంతగా నచ్చదు. నాకు కాసేపు నడవడం ఇష్టం. ఆరోగ్యానికి నడక మంచిదని నా భార్యకి చెబుతుంటాను. అయితే ఆమె తన అభిప్రాయాన్ని మాత్రం మార్చుకోదు" అని అన్నాడు.

మేరీ ఇంట్లోనే ఉండి గిన్నెలను కడగడంలో సహాయం చేస్తానని అంది. మేసన్ భార్య నవ్వి అయితే మీ మగవాళ్ళకు ఇక్కడ పనేం లేదు బైటకు వెళ్ళమంది. దానితో మేం ముగ్గురం బైటకు నడిచాం.

సూర్యుడి కిరణాలు నిట్టనిలువుగా భూమిని తాకుతున్నాయి. సూర్యకిరణాలు నీళ్ళలో ప్రతిఫలించి కళ్ళకు మిరుమిట్లు గొలుపుతున్నాయి. బీచ్‌లో ఇప్పుడు దాదాపు ఎవరూ లేరు. బీచ్ ఒడ్డున ఉన్న బంగ్లాలనుంచి కత్తులు, ఫోర్కులు, పింగాణీ గిన్నెల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. ఒడ్డున ఉన్న బండరాళ్ళు కూడా వేడిని వెళ్ళకక్కుతున్నట్టు అనిపిస్తోంది.. ఊపిరి పీల్చడం కూడా కష్టంగా అనిపించింది.

మొదట రేమాండ్, మేసన్ నాకు తెలియని కొందరు వ్యక్తుల గురించి కాసేపు మాట్లాడుకున్నారు. వాళ్ళిద్దరి మధ్యా గత కొంత కాలంగా పరిచయం ఉందని ఇద్దరూ కొంతకాలం కలిసి ఉన్నారని వాళ్ళ మాటలను బట్టి నాకు అర్ధం అయింది. మేం నీటి అంచుల వరకూ వెళ్ళి ఒడ్డున నడుస్తూ మాట్లాడుకొంటున్నాం. ఉన్నట్టుండి ఒక పెద్ద అల వచ్చి కాన్వాస్‌బూట్లని తడిపిపోతోంది. నేను దాని గురించి ఆలోచించే స్థితిలో లేను. సూర్యుడి వేడి నాతలను మాడ్చేస్తోంది. నేను సగం నిద్రలో ఉన్నట్టు తూలుతూ నడుస్తున్నాను.

అప్పుడే రేమాండ్ మేసన్‌తో ఏదో అన్నాడు. అయితే అది నాకు సరిగా వినపడలేదు. అయితే నీలి రంగు అంగరఖాలు ధరించిన ఇద్దరు అరబ్బులు దూరంగా బీచ్ ఒడ్డున మా వైపు వస్తుండడం కనిపించింది. నేను రేమాండ్ వైపు చూశాను. అతను చూశానన్నట్టు తలూపి "అతనే" అని అన్నాడు. మేం తిన్నగా నడుస్తున్నాం. వాళ్ళు మమ్మల్ని ఇక్కడ ఎలా పట్టుకున్నారని మేసన్ ఆశ్చర్యం వ్యక్తం చేశాడు. మేం బస్సెక్కడం వాళ్ళు చూసి ఉంటారని తర్వాత మేరీ తెచ్చిన బ్యాగు చూసి ఇక్కడ ఉన్నామని గుర్తుపట్టి ఉంటారని నేను అనుకున్నాను. అయితే పైకి ఏమీ అనలేదు.

అరబ్బులు నిదానంగా నడుస్తున్నప్పటికీ వాళ్ళు మాకు దాదాపు దగ్గరగా వచ్చేశారు. మేం మా నడక వేగాన్ని మార్చలేదు. అప్పుడు రేమాండ్ మాట్లాడుతూ "ఒకవేళ గొడవ అయేటట్లయితే మేసన్ నువ్వు రెండో వ్యక్తి సంగతి చూడు. నేను నా వెంట పడుతున్న వాడి పని పడతాను. మెర్‌సాల్ట్ నువ్వు పక్కనే ఉండి సహాయం చేస్తూ మూడోవాడు ఎవడన్నా వస్తే వాడి సంగతి చూడు" అని గబగబా చెప్పాడు. నేను 'సరే' అన్నాను. మేసన్ తన చేతులు జేబులో పెట్టుకున్నాడు.

ఇసుక నిప్పులా మండుతోంది. అది ఎరుపు రంగులో మంటలా మెరుస్తోంది. మాకూ, అరబ్బులకీ మధ్య దూరం క్రమక్రమంగా తగ్గిపోతోంది. మేం కొద్ది అడుగుల దూరంలో ఉన్నామనగా అరబ్బులు ఆగిపోయారు. మేసన్, నేనూ నిదానంగా నడుస్తుండగా

రేమాండ్ తన వెంటపడుతున్న వ్యక్తి వద్దకు వెళ్ళాడు. అతను ఏమన్నదీ నాకు వినపడలేదు. అయితే ఆ వ్యక్తి తలను కొంచెం వంచి రేమాండ్ గుండెల మీద కొట్టబోతున్నట్టు కనిపించింది. రేమాండ్ మెరుపులా వెనుకడుగువేసి మేసన్‌ను సహాయంగా రమ్మని కేకలు పెట్టాడు. మేసన్ తనకు ఉద్దేశించిన వ్యక్తి దగ్గరకి వెళ్ళి బలంగా చాచిపెట్టి రెండు దెబ్బలు వేశాడు. ఆ వ్యక్తి నీళ్ళలో బొక్కబోర్లాపడి కాసేపు అలాగే ఉండి పోయాడు. అతని తల చుట్టూ బుడగలు వచ్చాయి. ఈలోగా రేమాండ్ రెండో వ్యక్తి మీద దాడి చేశాడు. అతని మొహం రక్త సిక్తంగా మారింది. రేమాండ్ నావంక తలతిప్పిచూస్తూ "జాగ్రత్తగా కాచుకో. నేను వీడిని ఇంకా పూర్తి చేయలేదు" అన్నాడు.

సరిగ్గా చూడు. అతని దగ్గర కత్తి ఉందని నేను కేకపెట్టాను. అయితే అప్పటికే ఆలస్యం అయింది. ఆవ్యక్తి రేమాండ్ చేతిపైనా, నోటిపైనా గాట్లు పెట్టాడు. మేసన్ ముందుకు దూకాడు. అయితే రెండో అరబ్బు నీళ్ళలోంచి లేచి కత్తిపట్టుకుని ఉన్న వ్యక్తికి రక్షణగా అతని వెనక్కు వచ్చి నిలబడ్డాడు. దానితో కదలడానికి మేం ధైర్యం చేయలేకపోయాం. వాళ్ళిద్దరూ మమ్మల్ని కత్తిచూపించి బెదిరిస్తూ కళ్ళను మా మీదనుండి మరల్చకుండానే వెనక్కు నిదానంగా అడుగులేయసాగారు. కొంచెం దూరం అలా వెళ్ళి ఇక ఫరవాలేదనిపించగానే ముందుకు దూకి పరిగెత్తనారంభించారు. మేం అట్లాగే సూర్యకిరణాల వేడిలో కాగుతూ నిలబడ్డాం. రేమాండ్ గాయాల నుంచి ఉబికి ఉబికి వస్తోంది రక్తం. అతను మోచేయి పైన చేతిని నొక్కిపెట్టి పట్టుకున్నాడు.

మేసన్ అక్కడికి ప్రతి ఆదివారం ఒక డాక్టరు వస్తుంటాడని గుర్తుచేశాడు. "సరే. అయితే అతని దగ్గరికి వెళ్దాం" అని రేమాండ్ అన్నాడు. అతని రెండో గాయం కారణంగా నోరంతా రక్తంతో నిండిపోతుండగా అతి కష్టమ్మీద మాట్లాడగలుగు తున్నాడు. మేం ఇద్దరం అతన్ని పట్టుకుని బంగ్లాకు తీసుకువచ్చాం. మేం అక్కడకు చేరుకోగానే గాయాలు అంత లోతుగా లేవని, తాను డాక్టరు దగ్గరికి నడిచి రాగలనని రేమాండ్ అన్నాడు. మేరీ భయంతో పాలిపోయినట్లు నిలబడింది. మేసన్ భార్య అయితే కన్నీరు పెట్టుకుంది. మేసన్ రేమాండ్ డాక్టరు వద్దకు వెళ్ళగా నేను ఇంట్లోనే ఉండి ఆడవాళ్ళకు విషయాన్ని వివరించాను. అయితే ఆ పనిని సరిగ్గా పూర్తి చేయలేక మధ్యలోనే ఆపేసి సముద్రాన్ని చూస్తూ సిగరెట్ తాగడం మొదలు పెట్టాను.

రేమాండ్, మేసన్ దాదాపు ఒకటిన్నర ప్రాంతాల్లో తిరిగి వచ్చారు. అతని చేతికి కట్టు కట్టి ఉంది. నోటికి ఒక వైపు మూలగా ప్లాస్టర్ వేసి ఉంది. అవి అంత ప్రమాదకరమైన దెబ్బలు కావని డాక్టర్ చెప్పాడట. అయితే రేమాండ్ నిరుత్సాహంగా ఉండిపోయాడు. అతన్ని నవ్వించడానికి మేసన్ రకరకాలుగా ప్రయత్నించినప్పటికీ కృతకృత్యుడు కాలేక పోయాడు.

బీచ్ ఒడ్డున కాసేపు అలా తిరిగి వస్తానని రేమాండ్ అన్నాడు. అతను ఏ ప్రాంతానికి వెళతాడని నేను అడిగినప్పుడు 'ఏదో అలా వెళ్ళి గాలి పీల్చుకుని వస్తాను' అని అతను గొణిగాడు. నేనూ, మేసన్ కూడా అతనితో పాటు వస్తామని చెప్పగా అతను ఇంతెత్తున ఎగిరి మీ పని మీరు చూసుకోండని అరిచాడు. అతను ఉన్న పరిస్థితిని చూసిన తర్వాత దానిని గురించి పట్టుబట్టడం మంచిది కాదని మేసన్ అన్నాడు. అయితే రేమాండ్ బైటకు వెళ్ళిన తర్వాత నేను అతన్ని అనుసరించాను.

బైట నిప్పుల కొలిమిలాగా ఉంది. ఇసుక మీద, సముద్రం మీద సూర్యుడు నిప్పుల వర్షం కురిపిస్తున్నాడు. మేం కాసేపు ఏమీ మాట్లాడకుండా నడిచాం. ఎక్కడికి వెళ్ళాలనే విషయం గురించి రేమాండ్ మనసులో కచ్చితంగా ఏదైనా ఆలోచన ఉండి ఉండొచ్చని నాకు అనిపించింది. అయితే అది తప్పు అయినా అయిండొచ్చనుకున్నాను.

బీచ్ చివర మేం ఒక చిన్న సముద్రపాయ దగ్గరకు వెళ్ళాం. ఒక పెద్ద రాయి అడ్డు ఉండడంతో ప్రవాహం అక్కడ రెండుగా చీలింది. అక్కడ మాకు ఆ ఇద్దరు అరబ్బులు తిరిగి కనిపించారు. నీలి రంగు అంగారఖాలతో ఇసుకలో పడుకుని ఉన్నారు. వాళ్ళని చూస్తే ఎలాంటి హాని కలిగించే వాళ్ళలాగా అనిపించలేదు. వాళ్ళ మొహాల్లో ఎక్కడా కోపం కానీ ద్వేషం కానీ కనిపించలేదు. మేం దగ్గరకు వెళుతున్నా కదిలే ప్రయత్నం కూడా చేయలేదు. రేమాండ్‌పై కత్తితో దాడిచేసిన వ్యక్తి ఏం మాట్లాడకుండా అతన్నే చూస్తున్నాడు. రెండో వ్యక్తి వెదురుతో చేసిన మురళిలాంటి పరికరాన్ని అదే పనిగా వాయిస్తూ కంటి చివరల నుంచి మమ్మల్ని గమనిస్తున్నాడు.

కాసేపు ఎవరూ కదల్లేదు. అలల చప్పుడు, మురళి నుంచి వస్తున్న శబ్దం తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడు రేమాండ్ రివాల్వర్ ఉంచుకునే జేబు మీద చేయివేశాడు. అయినప్పటికీ అరబ్బులు కదల్లేదు. ఆ ఇద్దరు వ్యక్తుల వంకా చూస్తూ రేమాండ్ నాతో "వీళ్ళలో ఒకడిని లేపేయనా"? అని అడిగాడు. నేను వేగంగా ఆలోచించాను. వద్దంటే అతడు రెచ్చిపోయి రివాల్వర్ ఉపయోగిస్తాడేమో అనిపించింది. అందుకే నాకు తోచిన మాట వెంటనే అనేశాను. "అతను ఇంకా నిన్నేమీ అనలేదు కదా. అలాంటప్పుడు అతన్ని కాల్చడం అనవసరం, తెలివి తక్కువ పని అనిపించుకుంటుంది" అని నేనన్నాను. తర్వాత కొద్ది సేపటి వరకూ ప్రవాహం చప్పుడు. మురళి చప్పుడు తప్ప ఇంకేం వినిపించలేదు.

"సరే అయితే. నువ్వు అలా అనే పక్షంలో నేను అతన్ని ఏదైనా అవమానకరంగా అంటాను. అతను తిరిగి సమాధానం చెబితే మాత్రం చూస్తూ ఊరుకోను" అని రేమాండ్ అన్నాడు.

"సరే. అతను కత్తి తీయకపోతే నీకు రివాల్వర్ ఉపయోగించే అవసరం ఉండదు

కదా" అని నేనన్నాను. రేమాండ్ అసహనంగా అటూ ఇటూ కదులుతున్నాడు. ఇద్దరు అరబ్బులు మా కదలికలన్నీ గమనిస్తున్నారు. "నువ్వు కుడి వైపు ఉన్న వ్యక్తి సంగతి చూసుకో. నీ రివాల్వరు నా కివ్వు. ఇంకో అతను ఎదురు తిరిగినా, కత్తి బయటకి తీసినా నేను అతన్ని కాలుస్తాను" అన్నాను. రేమాండ్ రివాల్వర్ నాకిస్తున్నప్పుడు సూర్యకాంతిలో అది తళతళ మెరిసింది. అయితే ఎవరూ కదల్లేదు. కొంచెం కదిలితే ఏదో అంతా ముగిసి పోతుందన్నట్టు ఎవరికి వాళ్ళం అలా కదలకుండా ఉండిపోయాం. ఈ చిన్న సముద్రం పాయ దగ్గర, సూర్య కాంతి, సముద్రం మధ్య ప్రపంచం అంతా స్థంభించి పోయినట్టు నిశ్చలంగా ఉంది. ప్రవాహం చప్పుడు, మురళి చప్పుడు తప్ప ఇంకేం లేదు. నా మనసులోకి అకస్మాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. కాల్పులు జరిపినా, జరపకపోయినా ఇంచు మించుగా పెద్ద తేడా ఉండక పోవచ్చని అనిపించింది.

అంతలో ఉన్నట్టుండి అరబ్బులు అదృశ్యం అయ్యారు. రాళ్ళ గుట్టను అడ్డం చేసుకుని బల్లుల్లాగా పాకుతూ కనపడకుండా జారిపోయారు. దానితో రేమాండ్, నేనూ వెనక్కి తిరిగి నడవడం మొదలుపెట్టాం. రేమాండ్ సంతోషంగా కనిపించాడు. తిరిగి వెళ్ళడానికి బస్సును పట్టు కోవడం గురించి మాట్లాడసాగాడు.

మేం బంగ్లాకు తిరిగి వచ్చిన తర్వాత రేమాండ్ చెక్కమెట్లు ఎక్కి సరాసరి పైకి వెళ్ళి పోయాడు. నేను కింద మెట్టు మీద ఆగిపోయాను. ఎండ నాతలను ఎంత మాడ్చి వేస్తోందంటే నేను మెట్లెక్కే ప్రయత్నం కూడా చేయలేక పోయాను. గజిబిజిగా ఉన్న బుర్రతో లోపలకు వెళ్ళి ఆడవాళ్ళతో మంచిగా మాట్లాడలేనేమో అనిపించింది. ఎండ మాత్రం దారుణంగా కళ్ళను చెదర గొట్టి గుడ్డివాళ్ళని చేసేలా ఉంది. నిప్పులు చెరిగే ఎండలో ఇక్కడ కూర్చున్నా బైటకు పోయినా ఒకటేననిపించింది. నేను వెనక్కు తిరిగి బీచ్ వైపుకు నడవడం మొదలు పెట్టాను. కళ్ళకు కనిపించినంత వరకు ఎరుపు రంగు మంట మండుతోంది. వేడివేడిగా పొగలు కక్కుతున్న ఇసుకను చిన్నచిన్న అలలు తాకుతున్నాయి. బీచ్ చివరకు నడుస్తున్నపుడు నాకు కాలి మడమలు నొప్పిగా అనిపించాయి. ఎండ దెబ్బకు వాపు వచ్చినట్టు అనిపించింది. ముందుకు నడవడానికి ఆ నెప్పి ఇబ్బంది పెడుతోంది. ప్రతి సారి నా నుదిటిని వేడి కిరణాలు మెరుపు దెబ్బల్లా తాకుతున్నాయి. ఆ బాధను తట్టుకోవడానికి నేను పళ్ళు గిట్టకరిచి మరీ నడుస్తున్నాను. చేతులు ముడిచి జేబులో పెట్టుకుని శరీరంలోని ప్రతి నరాన్ని ఎండ నుంచి దాచి పెట్టుకోడానికి ఎండ నుంచి తప్పించుకోడానికి ప్రయత్నం చేస్తున్నాను. బీచ్ చివర దూరంగా ఉన్న రాళ్ళ గుట్ట నా కళ్ళలో పడింది. కళ్ళు చెదరగొట్టే తెల్లటి ఎండలో అది సరిగా కనిపించక పోయినా అక్కడ కొంచెం చల్లగా ఉండవచ్చేమో అనిపించింది. నీరు ప్రవహిస్తున్న గలగల చప్పుడు మరోసారి వినాలనిపించింది. ఆ భయంకరమైన ఎండ

నుంచి, ఆడవాళ్ళ కన్నీటి నుంచి తప్పించుకోవడానికి, ఆ కష్టాన్నంతా మరిచి పోవడానికి ఆ రాళ్ళ గుట్టల చాటున, ఆ చల్లటి నిశ్శబ్దం చాటున దాక్కోవాలని అనిపించింది.

అయితే నేను దగ్గరకి వెళ్ళి చూసేటప్పటికి రేమాండ్ అరబ్బు అక్కడే ఉన్నాడు. ఈ సారి అతను ఒక్కడే ఉన్నాడు. తల కింద చేతులు పెట్టుకుని వెల్లకిలా పడుకున్నాడు. మొహం రాళ్ళగుట్టల నీడలో ఉన్నప్పటికీ మిగిలిన శరీరం అంతా ఎండలోనే ఉంది. అతని అంగరఖా వేడి పొగలు కక్కడం స్పష్టంగా కనిపిస్తోంది. నేను ఒకడుగు వెనక్కు వేశాను. నా దృష్టిలో ఆ సంఘటన అప్పుడే ముగిసి పోయింది. నేను ఇక్కడికి వచ్చేటప్పుడు కూడా దాని గురించి ఆలోచించలేదు.

నన్ను చూడగానే అరబ్బు కొంచెం లేచి కూర్చున్నాడు. అతని చేయి జేబులోకి వెళ్ళింది. దానితో నేను నా కోటు జేబులోంచి రేమాండ్ ఇచ్చిన రివాల్వర్ తీయవలసి వచ్చింది. దానితో అరబ్బు కొంచెం కలవర పడినట్టు కనిపించాడు. అయినప్పటికీ జేబులోంచి చేయి తీయలేదు. నేను అతనికి పదడుగుల దూరంలో ఉన్నాను. వేడి వల్ల బైర్లు కమ్మినట్టున్న ఆ మసకలో నుంచి అతను నల్లటి ముద్దలాగా అనిపిస్తున్నాడు. అప్పుడప్పుడు మాత్రమే అతని కళ్ళు మెరుస్తూ కనిపిస్తున్నాయి. అలల చప్పుడు మధ్యాహ్నం కన్నా ఇంకా తక్కువగా బద్ధకంగా ఉన్నట్టు ఉంది. అయితే ఎండ మాత్రం మారలేదు. అక్కడ ఉన్న ఇసుక మైదానాన్నంతటినీ ఎండ కార్చిచ్చులా భగభగ మండిస్తోంది. దాదాపు రెండు గంటల పాటు సూర్యుడు ఏ మాత్రం మార్పులేకుండా అలాగే ఉన్నాడు. సముద్రాన్ని కరుగుతున్న ఉక్కు ప్రవాహంలాగా మారుస్తున్నాడు. దూరంగా ఒక స్టీమర్ వెళుతూ కనిపించింది. అరబ్బుని ఒక కంట గమనిస్తూ కంటి చివరల నుంచి అతని కదలికలు కనిపెడుతున్నాను.

నేను అక్కడి నుంచి వెనుతిరిగి నడుచుకుంటూ వచ్చెయ్యాలని, ఇంక అతని గురించి ఏ మాత్రం ఆలోచించకూడదని నాకు అనిపిస్తోంది. అయితే ఎండలో నిప్పులు కక్కుతున్నట్టున్న బీచ్ నన్ను వత్తిడికి గురి చేస్తోంది. నేను ప్రవాహం దగ్గరకి కొన్ని అడుగులు ముందుకు వేశాను. అరబ్బు అక్కడినుంచీ కదల్లేదు. మా ఇద్దరి మధ్యా ఇంకా కొంచెం దూరం ఉంది. అతని మొహం నీడలో ఉండడంవల్ల కాబోలు అతను నన్నుచూసి నవ్వుతున్నట్టు అనిపించింది.

నేను కాసేపు వేచి చూశాను. ఎండ నా చెంపలను కాల్చి వేస్తోంది. కనుబొమల మీద నుంచీ చెమట చుక్కలుగా కారుతోంది. అమ్మ అంత్యక్రియల రోజున కూడా ఎండ అచ్చంగా ఇలాగే ఉంది. ఆ రోజు కూడా ఇలాగే తల నాదుగా అనిపించింది. చర్మాన్ని చీల్చుకుని నరాలు బయటకు వచ్చేస్తాయా అన్నంత ఇదిగా నుదురు వేడెక్కి కాలిపోతోంది. ఇక నేను ఎక్కువ సమయం తట్టుకోలేక పోయాను. ఇంకొక అడుగు

ముందుకు వేశాను. అది మూర్ఖపు పని అని నాకు తెలుసు. ఒక అడుగు ముందుకు వేసినంత మాత్రాన నేను ఎండ నుంచీ తప్పించుకోగలిగింది కూడా ఏమీ లేదు. అయినప్పటికీ నేను ఒక అడుగు ఒకే ఒక అడుగు ముందుకు వేశాను. అప్పుడు అరబ్ కత్తి తీసి నాకేసి చూపిస్తూ నిలబడ్డాడు.

ఎండ ఆ కత్తి మీద పడి పరావర్తనం చెంది ఒక వేడివాడి కిరణంగా మారి నానుదుటిని కత్తిలా చీల్చివేసినట్టు అనిపించింది. కనుబొమల చుట్టూ చేరుతున్న చెమట కనురెప్పల పైనుంచీ జారి కళ్ళపై మసక తెర కప్పినట్టు అయింది. ఆ ఉప్పదనపు నీటితో కళ్ళకు చీకటి కమ్మింది. సూర్యుడు నా తలను అగ్ని గుండంలా మండించడం, అరబ్బు కత్తి మీదపడుతున్న సూర్యకిరణాల తళతళలు తప్ప ఇంకేమీ తెలియడం లేదు. ఆ రెండింటి రూపు కళ్ళలో అలా నిశ్చలంగా నిలిచిపోయింది.

నా కళ్ళ ముందు అన్నీ గిరగిరా తిరగడం మొదలయింది. సముద్రం నుంచి ఒక్కసారిగా బలమైన గాలి వీచింది. ఆకాశం రెండుగా చీలిపోయి అందులోంచి నిప్పుల వర్షం కురుస్తోంది. నా శరీరంలోని ప్రతి నరం ఉక్కు స్ప్రింగులా మారిపోయింది. రివాల్వర్ మీద నా పట్టు బిగిసింది. ట్రిగ్గర్ నొక్కాను. కీచుమనే శబ్దంతో అలా అదంతా మొదలైంది. నేను నా చెమటనూ, వెలుతురు కప్పిన మసక పొరనూ తుడుచుకున్నాను. ఆ రోజులోని మిగిలిన భాగాన్ని నేను చెడగొట్టాననేది నాకు తెలుస్తోంది. అంతవరకూ ఆనందంగా గడిపిన సముద్రపు తీరంలోని ఆ నిశ్శబ్ద సౌందర్యాన్ని నేను భగ్నం చేశాను. కదలకుండా పడి ఉన్న ఆ దేహంలోకి మరో నాలుగు బులెట్లను పంపించాను. అవి శరీరంలోపలకి వెళ్ళి కనిపించకుండా పోయాయి. అలా వరుసబెట్టి నేను కాల్చిన కాల్పులు నా తలరాతని మార్చివేసి దానిని తిరిగి మార్చలేనంతగా నా జీవితాన్ని నానుంచి లాక్కుపోయాయి.

# రెండవ భాగం

నేను అరెస్టు కాగానే అనేక సార్లు నన్ను ప్రశ్నించడం జరిగింది. అయితే అవన్నీ నామమాత్రపు విచారణలు నేను ఎవరు, ఏంటి, ఏంచేస్తున్నాను వగైరాలతో ముగిసిపోయేవి. వీటిల్లో మొదటిది పోలీస్ స్టేషన్లో జరిగింది. ఈ కేసులో అక్కడ ఎవరికీ అంత ఆసక్తి ఉన్నట్టు కనిపించలేదు. అయితే ఒక వారం తర్వాత నన్ను మేజిస్ట్రేట్ ముందు హాజరు పరిచినప్పుడు మాత్రం ఆయన నన్ను వింతైన కుతూహలంతో గమనిస్తున్నట్టు అర్థం చేసుకున్నాను. మిగిలిన వాళ్ళలాగే ఆయన కూడా నా పేరు, అడ్రెస్, ఉద్యోగం, నేను పుట్టిన తేదీ, పుట్టిన ఊరు వగైరాలతో మొదలుపెట్టాడు. తర్వాత ఆయన నా తరపున వాదించడానికి న్యాయవాది ఎవరైనా ఉన్నారా అని అడిగాడు. నేను లేదని జవాబిచ్చాను. నేను ఆ విషయం గురించి ఇంత వరకు ఆలోచించ లేదు. అలా న్యాయవాదిని పెట్టుకోవడం అవసరమంటారా అని ఆయననే అడిగాను.

"అలా ఎందుకు అడుగుతున్నావు"? అని ఆయన అడిగాడు.

నా కేసు చాలా తేలికైనదని భావిస్తున్నానని నేను సమాధానమిచ్చాను. ఆయన నవ్వాడు.

"నీకు అలా కనిపిస్తే కనిపించవచ్చు. అయితే మనం చట్టానికి బద్ధులమై ఉండాలి. నువ్వు కనుక న్యాయవాదిని పెట్టుకోకపోతే న్యాయస్థానమే నీ కోసం ఒక న్యాయవాదిని ఏర్పాటు చేస్తుంది" అని ఆయన చెప్పాడు. ఇది నిజంగా అద్భుతమైన ఏర్పాటని నాకు అనిపించింది. అయితే అలాగే చేయమని చెప్పాను. ఆయన సరేనన్నట్టు తల ఊపాడు. నిబంధన అనేది కచ్చితంగా ఉండాలని అన్నాడు.

మొదట నేను ఆయనను అంత గట్టిగా పట్టించుకోలేదు. ఆయన నన్ను విచారణ చేస్తున్న గది మామూలుగా ఇళ్ళల్లో ఉండే గదిగా ఉంది. కిటికీలకు కర్టెన్లు వేలాడుతున్నాయి. బల్ల మీద ఒకే ఒక లైటు ఉంది. దాని వెలుతురు నేను కూర్చున్న కుర్చీపైనే పడుతోంది. ఆయన మొహం నీడలో ఉంది.

నేను ఇలాంటి దృశ్యాల వర్ణనలు కొన్ని పుస్తకాల్లో చదివి ఉన్నాను. మొదట ఇదంతా ఒక ఆట లాగా అనిపించింది. మా సంభాషణ ముగిసిన తరువాత ఆయన వంక పరిశీలనగా చూశాను. చక్కటి ముఖకవళికలు. పొడగరి. లోతైన నీలి కళ్ళు. పెద్దమీసం. తెల్లటి నెరిసిన జుట్టు – వీటన్నింటితో ఆయన మంచి తెలివైన వ్యక్తిలా అనిపించాడు. ఆయనలో నాకు నచ్చనిది ఒకటే ఉంది. ఆయన నోరు అప్పుడప్పుడు వికారంగా వంకర పోతోంది. అయితే అది ఒక రకమైన నరాలకు సంబంధించిన వ్యాధి లక్షణంలా అనిపించింది. వెళ్ళబోయేటప్పుడు ఆయనతో కరచాలనం కోసం చేయి చాస్తూ "ఇంక

సెలవు" అన్నాను. సరిగ్గా అదే సమయంలో నేను ఒక మనిషిని చంపిన నేరస్థుడిననే విషయం గుర్తొచ్చింది.

మరునాడు జైల్లో నేనున్న గదిలోకి ఒక న్యాయవాది వచ్చాడు. పొట్టిగా లావుగా నల్లటి జుట్టుతో ఉన్న యువకుడు అతను. బాగా వేడిగా ఉన్నప్పటికీ నేను షర్టు వేసుకునే ఉన్నాను. ఆయన ముదురురంగు సూట్, లేచి నిలబడినట్టున్న కాలర్‌తో నలుపు తెలుపు గళ్ళు ఉన్న టై వేసుకుని ఆడంబరంగా ఉన్నాడు. తన చేతిలోని బ్రీఫ్‌కేసును నా మంచం మీద పెట్టి ఆయన తనను తాను పరిచయం చేసుకున్నాడు. ఆయన నా కేసు తాలూకూ రికార్డునంతటినీ శ్రద్ధగా పరిశీలించినట్టు చెప్పాడు. కేసును జాగ్రత్తగా నడపాలని తాను అనుకుంటున్నట్టు ఆయన చెప్పాడు. నేను తన సలహా కనుక పాటించినట్టయితే కేసులోంచి బయట పడడానికి అవకాశం ఉందని అన్నాడు. నేను అతనికి కృతజ్ఞతలు తెలియజేసాను.

"మంచిది. ఇప్పుడు ఈ సంగతి కొంచెం చూద్దాం" అని అన్నాడు. మంచంపై కూర్చుంటూ వాళ్ళు నా వ్యక్తిగత జీవితానికి సంబంధించిన వివరాలు సేకరిస్తున్నారని చెప్పాడు. మా అమ్మ వృద్ధాశ్రమంలో ఇటీవల మరణించినట్టు వాళ్ళు తెలుసుకున్నారని చెప్పాడు. మారెంగోలో జరిపిన దర్యాప్తులో నేను మా అమ్మ అంత్యక్రియలలో 'అంత పట్టనట్టు' ఉదాశీనంగా ఉన్నట్టు తేలిందని పోలీసులు చెప్పారట. "నువ్వు తప్పక అర్థం చేసుకోవాలి. అలాంటి విషయం గురించి నిన్ను అడగటం నిజానికి నాకు ఇష్టం లేదు. అయితే దానికి చాలా ప్రాధాన్యం ఉంది. ఆ ఉదాశీన ధోరణి అనేమాటకు సంబంధించి నేను సరైన వివరణ ఇవ్వాల్సి ఉంటుంది. లేని పక్షంలో నిన్ను కాపాడ్డానికి నేను ఏమీ చేయలేక పోవచ్చు. ఆ విషయంలో నువ్వే, ఒక్క నువ్వే నాకు సరిగ్గా సహాయం చేయగలవు" అని అన్నాడు.

ఆ విషాద సమయంలో నేను విచారంగా ఉన్నానా లేదా అని ఆయన నన్నడిగాడు. ఆ ప్రశ్నే అసలు అసందర్భంగా ఉన్నట్టు నాకు అనిపించింది. అలాంటి ప్రశ్నను ఎవరినన్నా అడగాల్సి వస్తే వ్యక్తిగతంగా నేనైతే చాలా ఇబ్బంది పడతాను.

ఇటీవలి కాలంలో నేను నా అనుభూతులను గురించి రాసుకునే అలవాటు మానుకున్నానని అందుకే ఏం సమాధానం చెప్పాలో తెలియడం లేదని అన్నాను. నాకు మా అమ్మ అంటే నిజానికి చాలా ఇష్టం. ఆ మాట చెప్పొచ్చు. అయితే అలా చెప్పడానికి నిజంగా అర్థంలేదు. అందుకే కొద్దిసేపు ఆలోచించి "సాధారణంగా ప్రజలంతా ఏదో ఒక సమయంలో తమకు ఇష్టమైనవారు చనిపోవాలని కోరుకోకుండా ఉండరు" అని నేనన్నాను.

ఈ మాటలకు న్యాయవాది బాగా ఖంగుతిన్నట్టు ఉన్నాడు. అందుకే మధ్యలోనే నన్ను అడ్డుకున్నాడు.

'విచారణ సమయంలో కానీ, మేజిస్ట్రేట్ ముందు కానీ ఇలాంటి మాటలు మాట్లాడనని మీరు ముందుగా నాకు వాగ్దానం చెయ్యాలి" అని ఆయన అన్నాడు.

ఆయన తృప్తికోసం నేను వాగ్దానం చేశాను. అయితే నా శారీరక పరిస్థితి తరచుగా నా మానసిక పరిస్థితిని ప్రభావితం చేస్తుంటుందని నేను చెప్పాను. ఉదాహరణకి అమ్మ అంత్యక్రియలకు హాజరైన రోజున నేను అలసిపోయి ఉన్నాననీ సగం స్పృహలేని స్థితిలో ఉన్నాననీ అందుకే ఆ రోజు ఏం జరిగిందీ నాకు స్పష్టంగా గుర్తులేదని చెప్పాను.

అయితే నేను ఆయనకు ఒక హామీ మాత్రం ఇవ్వగలనని చెప్పాను. అసలు అమ్మ చనిపోనట్టే నేను అనుకుంటున్నానని చెప్పాను. అయితే న్యాయవాది దానికి అంత సంతోషించినట్టు కనపడలేదు. "అది సరిపోదు" అని ఆయన పుల్ల విరిచినట్టు సమాధానం చెప్పాడు. కాసేపు ఆలోచించిన తర్వాత ఆయన నన్నడిగాడు "పోనీ ఆ రోజున నువ్వు నీ బాధనీ మానసికస్థితినీ అదుపులో ఉంచుకుని ప్రవర్తించావు" అని నేను చెప్పొచ్చా అన్నాడు.

"ఊహూ! వద్దు అది నిజం కాదు" అని నేనన్నాను.

ఆయన నావంక వింతగా చూశాడు. నేను తన మీద తిరుగుబాటు చేస్తున్నట్టు అనుకున్నాడు. వృద్ధాశ్రమం మేనేజర్ని, కొంతమంది సిబ్బందిని కూడా సాక్షుల కింద విచారణ జరపవచ్చని ఆయన చెప్పాడు. అయితే ఈసారి ఆయన గొంతులో ఎలాంటి మైత్రీభావం కనిపించలేదు.

"అలా జరిగిన పక్షంలో అది నీకు ఏమాత్రం మంచి చేయకపోవచ్చు" అని ముగించాడు.

నా మీద మోపబడిన నేరానికి, అమ్మ చనిపోవడానికి ఎలాంటి సంబంధం లేదు కదా అని నేను ప్రశ్నించగా దీనిని బట్టి నాకు న్యాయశాస్త్రం గురించి ఏమాత్రం పరిజ్ఞానం లేదన్నట్టు తెలుస్తోందని అన్నాడు. తర్వాత వెళ్ళిపోయాడు. ఆయన చాలా విసిగి పోయినట్టు కనిపించాడు. ఆయన కనుక ఎక్కువసేపు ఉన్నట్లయితే నేను ఆయన సానుభూతిని కోరుకుంటున్నట్టు ఆయనకు వివరించి ఉండేవాడిని. నాకు సహాయ పడడానికి ఆయనకు ఉపయోగ పడేటందుకే కాకుండా నాఅంతట నేనే అంతా ఆయనకు వివరిద్దామని అనుకున్నాను. అయితే నేను ఆయనను ఇబ్బంది పెట్టాను. ఆయనకు నేను అర్థం కాలేదు. సహజంగానే అది ఆయనకు కోపం తెప్పించింది. ఒకటి రెండు సార్లు నేను కూడా అందరిలాంటి వాడినేనని, ఒక సాధారణ వ్యక్తినేనని చెబుదామని నోటివరకూ వచ్చింది. అయితే దానివల్ల అంత ఉపయోగం ఏమీ ఉండదు. అందువల్ల నేను ఉదాశీనంగా కొంత, బద్ధకంతో కొంత ఏమీ అనకుండా ఊరుకుండి పోయాను.

తర్వాత నన్ను మళ్ళీ విచారణ కోసం మేజిస్ట్రేటు ఆఫీసుకు తీసుకువెళ్ళారు. అప్పుడు మధ్యాన్నం రెండు గంటలవుతోంది. ఈ సారి గదంతా పూర్తి ప్రకాశవంతంగా ఉంది.

కిటికీలకు పలుచని తెరలు మాత్రమే ఉన్నాయి. గది చాలా వేడిగా ఉంది. ఆయన నన్ను ఆహ్వానించి కూర్చోమని అన్నాడు. కొన్ని అనివార్య కారణాలవల్ల నా తరుపు న్యాయవాది ఆ రోజు రాలేకపోయాడని మర్యాదపూర్వకమైన స్వరంతో చెప్పాడు. న్యాయవాది వచ్చిన తర్వాత ఆయన ప్రశ్నలకు నేను సమాధానాలు ఇస్తానని చెప్పే అవకాశం కూడా నాకు ఉందని ఆయన తెలియజేసాడు. నేను స్వయంగా సమాధానాలు చెప్పగలనని నేను అన్నాను. అప్పుడు ఆయన గంట కొట్టగానే ఒక గుమస్తా వచ్చి ఆయన పక్కనే కూర్చున్నాడు. నేనూ, మెజిస్ట్రేటు మా కుర్చీల్లో కూర్చోగానే విచారణ ప్రారంభమయింది. స్వార్థపరుడు అనే దాని కన్నా నేను మితభాషినని బైట నాకు పేరుందని దానికి నేను ఏం సమాధానం చెబుతానని ఆయన నన్ను అడిగాడు.

సాధారణంగా నాకు చెప్పడానికి ఏమీ ఉండదు. అందుకే ఎక్కువ మాట్లాడకుండా మౌనంగా ఉండిపోతాను" అని నేను సమాధానం ఇచ్చాను. ఆయన అంతకు ముందు లానే నవ్వాడు. అది నిజంగా ఉత్తమమైన కారణమని అంగీకరించాడు. అంతేకాకుండా ఆ విషయానికి అంత ప్రాధాన్యం కూడా లేదని అన్నాడు. కొద్దిపాటి నిశ్శబ్దం తర్వాత అకస్మాత్తుగా ముందుకు వంగి నా కళ్ళలోకి చూస్తూ గొంతు కొంచెం పెంచి "నాకు నిజంగా ఆసక్తి కలిగిస్తున్నది ఏంటో తెలుసా. నువ్వు" అని అన్నాడు. ఆయన ఏమంటున్నాడో నాకు స్పష్టంగా అర్థం కాలేదు. అందుకే మాట్లాడకుండా ఊరుకున్నాను.

"నువ్వు చేసిన నేరంలో అనేక అంశాలు నాకు అర్థం కాకుండా అయోమయంగా అనిపిస్తున్నాయి. వాటిని అర్థం చేసుకోవడానికి నువ్వు నాకు సహాయం చేయగలవని నేను అనుకుంటున్నాను" అని అన్నాడు.

నిజానికి అది చాలా తేలికైన విషయమని నేను అనగానే ఆ రోజు నేను చేసిన పనులన్నీ వివరంగా చెప్పమని నన్ను అడిగాడు. ఆయనను నేను మొదటిసారి కలిసినప్పుడే ఆ రోజు జరిగినదంతా క్లుప్తంగా వివరించాను. రేమాండ్, బీచ్, మేం ఈత కొట్టడం, గొడవ పడడం, తిరిగి బీచ్‌కు వెళ్ళడం, ఐదుసార్లు కాల్పులు జరపడం – నేను మళ్ళీ మొత్తం మొదటి నుంచీ చెప్పుకొచ్చాను. నేను చెప్పిన ప్రతి దానికీ ఆయన తల ఊపుతూనే ఉన్నాడు. చివరగా అతని శరీరం ఇసుక పైన పడి ఉందని నేను చెప్పగానే ఆయన తల ఊపుతూ 'మంచిది' అని ఊరుకున్నాడు. అదే కథ మళ్ళీ మళ్ళీ చెప్పడానికి నాకు బాగా విసుగనిపించింది. నా జీవితం అంతటికీ కలిపి కూడా నేను అంత ఎక్కువగా మాట్లాడి ఉండనని అనుకున్నాను. మరికొంత నిశ్శబ్దం తరువాత ఆయన లేచి నిలబడ్డాడు. ఆయన నాకు సహాయం చేయాలని అనుకుంటున్నట్టు చెప్పాడు. నేను ఆయనకు ఆసక్తి కలిగించానని అందుకే దేవుడి సహాయంతో ఆయన ఈ ఆపద నుంచి నన్ను గట్టెక్కించడానికి ఏమైనా చేయాలని అనుకుంటున్నట్టు చెప్పాడు. అయితే దానికి నన్ను

ఇంకా కొన్ని ప్రశ్నలు అడగాల్సి ఉందని అన్నాడు.

నేను మా అమ్మను ప్రేమిస్తున్నానా అని ఆయన నిర్మోహమాటంగా అడిగాడు.

"అవును. అందరి లాగానే" అని నేను సమాధానమిచ్చాను. నేను చెబుతున్నదంతా వేగంగా టైప్ చేస్తున్న గుమస్తా అప్పుడు ఏదో తప్పు అక్షరాలు టైప్‌చేసినట్టున్నాడు. వాటిని కొట్టి వేయడానికి అతను హెడ్‌ను వెనక్కు లాగాడు.

"నువ్వు వరుసగా ఐదు సార్లు ఎందుకు కాల్పులు జరిపావు" అని మేజిస్ట్రేటు నన్ను తార్కికంగా అంత సంబంధం ఉందన్నట్టు కనిపించని మరో ప్రశ్న అడిగాడు.

నేను కాసేపు ఆలోచించాను. అది వరుసగా కాల్చిన కాల్పులు కాదని తర్వాత ఆయనకు వివరించాను. మొదట ఒకసారి కాల్చానని కొద్దిసేపు విరామం తర్వాత మళ్ళీ నాలుగు సార్లు కాల్చానని ఆయనకు చెప్పాను.

"మొదటి దానికి రెండవ దానికి మధ్య విరామం ఎందుకు తీసుకున్నావు"?

ఆ రోజు కాల్పులు జరిపిన దృశ్యమంతా నాకళ్ళ ముందు తిరిగింది. బీచ్ ఎర్రగా దీప శిఖలా మంటలు మండినట్టు ఉండడం, ఆ వేడి సెగకు ఊపిరాడక నేను ఉక్కిరి బిక్కిరి అవడం, చెంపలు కాలిపోయినట్లు అవడం అన్నీ గుర్తు వచ్చాయి. అయితే నేను పైకి ఏమీ సమాధానం చెప్పలేదు.

తర్వాత ఏర్పడిన నిశ్శబ్ద సమయంలో మెజిస్ట్రేటు అసహనంగా జుట్టులోకి వేళ్ళు పోనిచ్చి పైకీ కిందకీ జుట్టుని కదుపుతూ ఉండిపోయాడు. చివరికి ముంజేతులు బల్ల మీద ఆనించి ముందుకు వంగి నా వంక కౌతుక భావంతో చూస్తూ "పడిపోయిన వ్యక్తిపై నువ్వు వరుసగా ఎందుకు కాల్పులు జరిపావు" అని మళ్ళీ అడిగాడు. నాకు సమాధానం చెప్పడానికి మళ్ళీ ఏం తోచలేదు. మేజిస్ట్రేట్ నుదిటిపై చేతితో రుద్దు కుంటూ భావరహితంగా ఉన్న గొంతుతో మళ్ళీ "ఎందుకు? ఎందుకు ఆ పని చేశావో చెప్పు" అని రెట్టించాడు.

నేను మౌనంగా ఉండిపోయాను. ఆయన అకస్మాత్తుగా లేచి ఎదురు గోడవద్ద ఉన్న అలమరా వద్దకు వెళ్ళి సొరుగు లాగాడు. అందులోంచి ఒక వెండి శిలువను తీసి దానిని ఊపుతూ బల్లవద్దకు తిరిగి వచ్చాడు.

"ఇది ఎవరో నీకు తెలుసా" ఆయన గొంతు పూర్తిగా మారిపోయింది. ఆయన గొంతు ఉద్వేగంతో వణుకుతోంది.

"నాకు తెలుసు" అని సమాధానమిచ్చాను.

ఇక దానితో ఆయన గబగబా మాట్లాడటం మొదలుపెట్టాడు. తను దేవుడిని నమ్ముతానని ఆయన చెప్పాడు. ఎలాంటి పాపాత్ములైనా దేవుడి నుంచి క్షమను పొందగలరని ఆయన చెప్పాడు. అయితే ముందు వాళ్ళు చేసిన పనికి పశ్చాత్తాప

పడాలని, చిన్న పిల్లలలా స్వచ్ఛమైన హృదయంతో తప్పును అంగీకరించాలని శిలువను నా కళ్ళ ముందు ఆడిస్తూ ఆయన అన్నాడు.

నిజానికి ఆయన చెబుతున్నదంతా అర్థం చేసుకోవడానికి నాకు చాలా కష్టం అనిపించింది. దానికి తోడు ఆఫీసు చాలా వేడిగా ఉంది. ఈగలు జుమ్మని శబ్దం చేస్తూ తిరుగుతూ నా చెంపలపై వాలుతున్నాయి. ఆయన చెబుతున్న దాని కన్నా ఈ వాతావరణమే నన్ను ఎక్కువ భయపెట్టింది. అయితే ఇట్లా ఆలోచించడం సరికాదని నేను గ్రహించాను. నేను ఒక నేరస్థుడిననే విషయం మర్చిపోకూడదని అనుకున్నాను. ఆయన మాట్లాడుతున్నదంతా అర్థం చేసుకోవడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను. రెండో సారి కాల్చడానికి నేను కొద్దిగా విరామం తీసుకున్నది ఒక్కటే కొంచెం తేలాల్సిన విషయమని, అది తప్ప మిగిలినదంతా సరిగా స్పష్టంగానే ఉందని నేను మధ్యలో జోక్యం చేసుకుని ఆయనతో అన్నాను. ఆది ఆయనను మరింత అసహనానికి గురిచేసింది.

కాల్పులు గురించి పట్టుబట్టి పదేపదే ప్రశ్నించడం ఆయనకు సరికాదని నేను అన్నాను. ఆ విషయానికి అంత ప్రాధాన్యం లేదని నేనన్నాను. ఇంక నేను మాట కూడా పూర్తి చేయకముందే ఆయన ఒక్కసారి గట్టిగా గొంతెత్తి దేవుడిపై నీకు నమ్మకం ఉందా లేదా అని సీరియస్‌గా అడిగాడు.

'లేదు' అని నేను సమాధానమిచ్చాను.

ఆయన కోపంగా తన కుర్చీలో కూలబడ్డాడు. దాన్ని తాను నమ్మలేక పోతున్నానని అది తన ఆలోచనకు కూడా అందటం లేదని ఆయన అన్నాడు. దేవుడిని తిరస్కరించే వాళ్ళతో సహా అందరూ దేవుడిని నమ్ముతారని ఆయన అన్నాడు. ఈ విషయంలో తనకు ఎలాంటి అనుమానం లేదని దానిలో కనుక తనకు అపనమ్మకం ఉంటే తన జీవితమే అర్థం కోల్పోతుందని ఆయన అన్నాడు.

"నా జీవితానికి అర్థం లేకుండా పోవాలని నువ్వు కోరుకుంటున్నావా" అని ఆయన నన్ను కోపంగా అడిగాడు.

ఆయన జీవితానికి అర్థం లేకుండా పోవాలని నేను కోరుకోవడమేమిటో నాకు అర్థం కాలేదు. ఆయనతో ఆమాటే అన్నాను. నేను ఆయనతో మాట్లాడుతుండగానే ఆయన తిరిగి శిలువను నా ముక్కుకింద ఆనించి గట్టిగా నొక్కి "ఏది ఏమైనప్పటికీ నేను నిజమైన క్రిష్టియన్‌ని నువ్వు చేసిన పాపాలకు నిన్ను క్షమించమని నేను ఆయనను వేడుకుంటాను. ప్రియమైన అబ్బాయీ! ఆయన నీకోసం బాధలు పడ్డాడనే దాన్ని నువ్వు ఎందుకు నమ్మవు" అని ఆయన గట్టిగా అరిచాడు.

నన్ను 'ప్రియమైన అబ్బాయీ' అని సంబోధించడంలో నా మీద ఆయనకున్న అభిమానం నాకు అర్థమయింది. ఇదంతా చాలు అని నాకు అప్పటికే అనిపించడం

మొదలుపెట్టింది. గది ఉన్నకొద్దీ వేడెక్కి పోతోంది. ఎవరి సంభాషణ అన్నా నాకు విసుగనిపిస్తే వాళ్ళ నుంచి తప్పించుకోవడానికి నేను సాధారణంగా చేసే పని ఒకటుంది. వాళ్ళు చెబుతున్న దానికి ఒప్పుకున్నట్టు నటించడం. నేను ఆ పని చేయగానే ఆశ్చర్యకరంగా ఆయన మొహం వెలిగిపోయింది.

"అదిగో చూశావా! నువ్వు దేవుడిని నమ్ముతున్నావు. ఆయనపై విశ్వాసం ఉందని ఇప్పటికైనా ఒప్పుకుంటావా" అని అడిగాడు. ఒప్పుకోనని నేను మళ్ళీ తల తిప్పాల్సి వచ్చింది. దానితో ఆయన నిరుత్సాహంగా ఓడిపోయినట్టు చూస్తూ తిరిగి కుర్చీలో కూలబడ్డాడు. తిరిగి అక్కడ కొన్ని నిముషాల పాటు నిశ్శబ్దం ఏర్పడింది. అంత వరకూ టకటకా చప్పుడు చేస్తున్న టైపు మిషన్ శబ్దం కూడా నా చివరి వ్యాఖ్యతో కాసేపు ఆగింది. ఆయన నా వంక విచారంగా, ఆదరపూర్వకంగా చూశాడు.

"నా జీవితంలో ఇంతవరకూ నేను ఇలాంటి మొండి మనిషిని ఎక్కడా చూడలేదు. ఇంతవరకూ నా దగ్గరకు వచ్చిన నేరస్థులందరూ దేవుడి బాధలకు చిహ్నమైన ఈ శిలువను చూడగానే ఏడ్చేవాళ్ళు". అని చిన్న గొంతుతో అన్నాడు.

దానికి కారణం వాళ్ళు నేరస్థులు కావడమే అని నేను సమాధానం చెబుదామని అనుకున్నాను. అయితే నేను కూడా ఇప్పుడు అదే కోవలోకి వస్తానని నేను గ్రహించాను. కానీ నేను నేరస్థుడిననే విషయంపై నేను ఎప్పటికీ సమాధాన పడలేకపోయాను.

ఇంటర్వ్యూ ముగిసినట్టు చెప్పడానికి మేజిస్ట్రేటు లేచి నిలబడ్డాడు. అలసి పోయినట్టున్న గొంతుతో నన్ను చివరి ప్రశ్న అడిగాడు నేను చేసిన పనికి పశ్చాత్తాప పడుతున్నానా అని.

కొంచెం సేపు ఆలోచించి పశ్చాత్తాప పడుతున్న దానికన్నా ఒకరకంగా ఇదంతా విసుగుపుట్టిస్తోందని నేనన్నాను. అంత కన్నా సరైన పదం నాకు తట్టలేదు. అయితే అది ఆయనకు అర్ధమైనట్టు అనిపించలేదు. ఆ రోజు విచారణ ఆ రకంగా ముగిసింది.

తర్వాత అనేక సార్లు నన్ను మేజిస్ట్రేటు ముందుకు తీసుకువచ్చారు. అన్నిసార్లు నా వెంట మా న్యాయవాది కూడా ఉండేవాడు. అయితే అంతకు ముందు నేను ఇచ్చిన స్టేట్‌మెంట్లను వివరించి చెప్పడానికే ఈ విచారణలు పరిమితమై ఉండేవి. నా కేసులో ఉన్న సాంకేతిక అంశాలపై మేజిస్ట్రేటు న్యాయవాది ఒక్కోసారి చర్చించుకునే వారు. అలాంటి సందర్భాల్లో వాళ్ళు నా ఉనికిని కూడా పట్టించుకునేవారు కాదు. అయితే విచారణ కొనసాగుతున్న ధోరణి క్రమక్రమంగా మారిపోతూ వచ్చింది. మెజిస్ట్రేటుకు నాపై ఆసక్తి తగ్గిపోయినట్టు కనిపించింది. నా కేసు విషయంలో ఆయన ఒక నిర్ణయానికి వచ్చినట్టు కూడా అనిపించసాగింది. ఆయన తిరిగి నా దగ్గర ఎప్పుడూ దేవుడి పేరు ఎత్తలేదు. దేవుడికి సంబంధించిన వాటిని వేటినీ ప్రదర్శించడానికి ప్రయత్నం

చేయలేదు. మేం మొట్టమొదట కలిసినప్పుడు ఆ ప్రదర్శన నన్ను ఎంత ఇబ్బంది పెట్టిందీ నేనింకా మర్చిపోలేదు. మెజిస్ట్రేటుకు నాకూ మధ్య ప్రస్తుతం స్నేహపూర్వక సంబంధం నెలకొంది. నన్ను కొన్ని ప్రశ్నలు అడిగిన తర్వాత కాసేపు మా న్యాయవాదితో మాట్లాడి మెజిస్ట్రేటు సమావేశాన్ని ముగించాడు. నాకేసు యధావిధిగా కొనసాగి పోతుందని ఆయన అన్నాడు.

ఒకోసారి మేజిస్ట్రేటు, న్యాయవాది మధ్య జరిగే సంభాషణ ఎంత మామూలుగా ఉండేదంటే వాళ్ళు నన్ను కూడా తమతో కలవమని చెప్పేవారు. నేను వాళ్ళతో మరింత స్నేహంగా ఉండేవాడిని. ఇద్దరిలో ఎవ్వరూ కూడా నా పై ఎలాంటి శత్రుభావం చూపించే వాళ్ళు కాదు. ప్రతీదీ సాఫీగా, స్నేహ పూర్వకంగా సాగి పోతున్నట్టు నాకు అనిపించింది.. "ఆ కుటుంబంలో నేను కూడా ఒకడిని" అనేలాంటి విపరీత భావనలు కూడా ఒకో సారి కలిగేవి. పదకొండు నెలల పాటు జరిగిన ఆ విచారణలకు నేను ఒక రకంగా బాగా అలవాటు పడిపోయాను. అయితే మేజిస్ట్రేటు చివరి రోజు నాతో పాటు గుమ్మం వరకూ వచ్చి నా భుజంపై తడుతూ స్నేహపూర్వకమైన గొంతుతో "ప్రస్తుతానికి ఇంతే మిస్టర్ క్రీస్తు విరోధి" అనడం మాత్రం నన్ను ఆశ్చర్యానికి గురిచేసింది. తర్వాత నన్ను జైలు వార్డర్లకు అప్పగించారు.

# 2

నేను చెప్పడానికి ఇష్టపడని సంగతులు కొన్ని ఉన్నాయి. కొద్ది రోజుల తర్వాత నన్ను జైలుకు పంపారు. నా జీవితంలోని ఈ దశ కూడా వాటిల్లో ఒకటని నేను నిర్ణయించుకున్నాను. అయితే రోజులు గడిచే కొద్దీ ఈ వైముఖ్యానికి నిజంగా అర్థం లేదనిపించింది. నిజానికి మొదట్లో కొద్దిరోజుల వరకూ నేను జైలులో ఉన్నాననే విషయాన్ని నేను అంతగా పట్టించుకోలేదు. అకస్మాత్తుగా ఏదో అద్భుతం జరిగి ఈ మొత్తం పరిస్థితి అంతా మారిపోతుందనే అస్పష్టమైన ఆశ నన్ను వెంటాడుతూ ఉండేది.

మేరీ వచ్చి వెళ్ళిన తరువాత ఆ మార్పు స్పష్టంగా కనిపించసాగింది. మేరీ రాక అదే మొదటిది చివరిది అయింది. వచ్చి వెళ్ళిన తర్వాత మేరీ ఉత్తరం రాసింది. తను నా భార్య కాదనే కారణం వల్ల వాళ్ళు తనను ఇక చూడడానికి జైలుకు రావద్దన్నారని, అందువల్ల ఇకపై రాలేనని రాసింది. ఆ రోజునే నాకు ఈ జైలు గదే ఇక నా చివరి విడిది అనేది స్పష్టమైపోయింది.

నన్ను నిర్బంధంలోకి తీసుకున్న రోజున వాళ్ళు నన్ను మిగిలిన ఖైదీలందరితో కలిసి ఒక పెద్ద గదిలో ఉంచారు. వాళ్ళలో ఎక్కువ మంది అరబ్బులే. నేను గదిలో అడుగు పెడుతుండగా వాళ్ళు చూసి నవ్వి నేను ఏం చేశానని అడిగారు. నేను ఒక

అరబ్బుని చంపానని వాళ్ళకి చెప్పాను. వాళ్ళు కొద్ది సేపు మౌనంగా ఉండిపోయారు. తర్వాత కాసేపటికి చీకటి పడడం ప్రారంభించింది. వాళ్ళలో ఒకాయన నేను నా చాప ఎలా పరుచుకోవాలో వివరించాడు. చాపను ఒక వైపు చుట్టలా ఉంచి దాన్ని తలగడగా ఉపయోగించుకోమని చెప్పాడు. రాత్రంతా నల్లులు నా మొహం పై పారాడడం నాకు తెలుస్తూనే ఉంది.

కొన్ని రోజుల తర్వాత నన్ను విడిగా ఒక గదిలో ఉంచారు. అందులో పడుకోవడానికి ఒక చెక్కబల్ల గోడకు బిగించి ఉంది. ఇంక గదిలో ఉన్నదల్లా ఒక లెట్రిన్ బక్కెట్టు, తగరపు కళాయి వేసిన ఒక పళ్ళెం. జైలు ఎత్తుగా ఉన్న ప్రదేశంపై ఉండడంతో నాగది లోని చిన్న కిటికీ నుంచి సముద్రాన్ని చూస్తుండేవాడిని. కిటికీ ఇనుప చువ్వలకు తలానించి సముద్రపు అలలతో సూర్యకిరణాలు దోబూచులాడడాన్ని ఓ రోజు కళ్ళు నెప్పెట్టేంత వరకూ అదే పనిగా చూస్తుండిపోయాను. అప్పుడు ఒక వార్డర్ వచ్చి నా కోసం ఎవరో వచ్చారని చెప్పాడు. మేరీనే అయి ఉంటుందని నేను అనుకున్నాను. అదే అయింది.

సందర్శకుల గదిలోకి వెళ్ళాలంటే ఒక పొడవైన వరండా దాటి కొన్ని మెట్లు ఎక్కి మళ్ళీ మరో పొడవైన వరండా దాటాలి. అది చాలా పెద్ద గది. గదిలో ఒకే ఒక పెద్ద కిటికీ ఉంది. అది మూడు భాగాలుగా విడగొట్టబడి బలమైన ఇనుప చువ్వలతో ఉంది. రెండు ఇనుప చువ్వల వరుసల మధ్య ముప్ఫయి అడుగుల దూరం ఉంది. ఖైదీలకూ, సందర్శకులకూ మధ్య ఈ ముప్ఫయి అడుగుల దూరం ఉంటుంది. మేరీ ఉన్న చోటుకు సరిగ్గా ఎదురుగా నేను నిలబడ్డాను. మేరీ ఆ రోజు చారల దుస్తుల్లో ఉంది. నేనున్న వైపున దాదాపు డజను మంది ఖైదీలు ఇనుప కటకటాలకు ఆనుకుని ఉన్నారు. అందులో ఎక్కువ మంది అరబ్బులే. మేరీ ఉన్న వైపు ఎక్కువగా మూర్ జాతి స్త్రీలున్నారు. పెదాలు బిగించి ఉన్న ఒక వృద్ధ మహిళ, లావుగా ఉన్న ఒక గృహిణి మధ్య మేరీ ఇరుక్కు పోయి ఉంది. ఆ గృహిణి కీచు గొంతుతో ఏదో మాట్లాడుతూనే ఉంది.

ఖైదీలకు, సందర్శకులకు మధ్య దూరం ఎక్కువగా ఉండడంతో నేను కూడా కొంచెం గొంతు పెంచవలసి వచ్చింది. నేను గదిలోకి వచ్చేసరికల్లా అన్ని గొంతులు గది గోడల్ని తాకి ప్రతిధ్వనిస్తున్నట్టు అనిపించింది. కళ్లు మిరుమిట్లుకొలుపుతున్న వెలుగు నాకు ఇబ్బందిగా అనిపించింది. జైలు గదిలోపలి చీకటికి, నిశ్శబ్దానికి అలవాటు పడిన నేను ఈ వాతావరణానికి అలవాటు పడడానికి కొద్ది సమయం పట్టింది. తర్వాత కాసేపటికి అక్కడున్న వాళ్ళందరి మొహాలు స్పష్టంగా చూడగలిగాను. జైలు అధికారులు కూడా ఆ కటకటాల పక్కనే కూర్చుని కనిపించారు. ఖైదీలు వాళ్ళ తాలూకూ బంధువులు ఎదురెదురుగా నిలబడ్డారు. ఆ రణగొణ ధ్వనిలో కూడా వాళ్ళు గట్టిగా కాకుండా గుసగుసగా మాట్లాడుకుంటున్నారు. ఈ గుసగుసల ధ్వని కూడా ప్రతిధ్వనిస్తోంది. నేను

దీన్నంతా ఒక్క చూపులోనే గమనించి మేరీ వైపు ఒక అడుగు వేశాను. ఎండకి కమిలినట్టున్న తన మొహాన్ని కటకటాలకు ఆనించి ఆమె నవ్వలేక నవ్వింది. ఆమె చాలా అందంగా కనిపించింది. అయితే ఎందుకో ఆ మాట ఆమెకు చెప్పలేకపోయాను.

"ఇక్కడ ఎలా ఉంది? ఎలా ఉన్నావు? కావలసినవన్నీ ఇక్కడ దొరుకుతున్నాయా" అని మేరీ గొంతు పెంచి అడిగింది.

"దొరుకుతున్నాయి" అని నేనన్నాను.

కొన్ని నిముషాలు మేం నిశ్శబ్దంగా ఉండిపోయాం. మేరీ నవ్వుతూ ఉండిపోయింది. ఆ లావుపాటి స్త్రీ నా పక్క ఖైదీపై అరుస్తోంది. పొడవుగా తెల్లగా ఆహ్లాదకరంగా ఉన్న ఆ ఖైదీ ఆమె భర్త అయియుండొచ్చనుకున్నాను.

"జెన్నీ అతనితో కలిసి ఉండడానికి నిరాకరిస్తోంది" అంటూ ఆమె గట్టిగా అరిచి చెప్పింది.

"అదేం బాగాలేదు" అని అతను సమాధానమిచ్చాడు.

"అవును నువ్వు జైలు నుంచి బైటకు వచ్చిన తర్వాత వెంటనే అతన్ని నువ్వు వెనక్కు తీసుకువస్తావని నేను చెప్పి చూశాను. కానీ ఆమె వినడం లేదు" ఆమె మళ్ళీ చెప్పింది.

రేమాండ్ తన అభినందనలు తెలపమన్నాడని మేరీ గట్టిగా అరిచి చెప్పింది. నేను కృతజ్ఞతలు తెలిపాను. అయితే నా పక్కన నిలబడిన వ్యక్తి "అతను ఆరోగ్యంగా ఉంటే" అంటూ గట్టిగా అనడంతో నా గొంతు అందులో మునిగిపోయింది. ఆ లావుపాటి స్త్రీ పెద్దగా నవ్వింది. "ఆరోగ్యమా? ఆరోగ్యం అంటే ఆరోగ్యంగా ఉన్నట్టే" అంటూ.

నాకు ఇటు వైపున్న ఖైదీ ఒక యువకుడు. అతని చేతులు ఆడపిల్ల చేతుల్లా మృదువుగా ఉన్నాయి. అతను ఒక్కమాట కూడా మాట్లాడకుండా తన ఎదురుగా ఉన్న వృద్ధ మహిళ వైపు తదేకంగా చూస్తున్నాడు. ఆమె కూడా అతని వంక అంతే ఆర్తిగా చూస్తోంది.

'మనం ఏమాత్రం ఆశను వీడొద్దు' అంటూ మేరీ గట్టిగా అనడంతో నేను వాళ్ళ వైపు నుంచి చూపు తిప్పాను.

"అవును" అని నేను సమాధానమిచ్చాను. నేను ఆమె భుజాలను తదేకంగా చూస్తుండిపోయాను. ఆమె భుజాలను గట్టిగా పట్టుకుని నలిపి వేయాలని అకస్మాత్తుగా కోరిక కలిగింది. ఆమె వేసుకున్న పలుచని డ్రెస్ కూడా నన్ను రెచ్చగొట్టింది. నా మనసులోని భావం మేరీకి కొంచెం అర్థమైనట్టు కనిపించింది. మేరీ మనసులో కూడా అదేలాంటి భావం కలిగినట్టు నాకు అనిపించింది. ఆమె నా వంక తదేకంగా చూస్తూ నవ్వుతూనే ఉంది.

"ఇదంతా త్వరలోనే ముగిసిపోతుంది. అప్పుడు మనం పెళ్ళి చేసుకుందాం" మేరీ అంది. ఆమె తెల్లని పళ్ళ వరుస మెరుస్తుండడం ఒక్కటే నాకు కనిపించింది. ఆమె కళ్ళ

చుట్టు చిన్న ముడతలు పడ్డాయి.

"నువ్వు నిజంగా అలా అనుకుంటున్నావా" అని నేను అడిగాను. ఏదైనా సమాధానం చెప్పాల్సిన బాధ్యత నిజానికి నాపై ఉంది.

"అవును. నిన్ను వదిలేస్తారు ఆదివారాలు మనం మళ్ళీ ఈత కొట్టొచ్చు" ఆమె అదే గొంతుతో గట్టిగా తరుముకొస్తున్నట్టు గబగబా అంది.

మేరీకి పక్కనున్న లావు పాటి స్త్రీ ఇంకా అరుస్తూనే ఉంది. జైలు ఆఫీసులో అతని కోసం ఒక బుట్టను ఇచ్చానని ఆమె భర్తకు చెప్పింది. తాను బుట్టలో ఏమేం పెట్టినది చెప్పి అవి అన్నీ ఉన్నాయో లేదో ఒక సారి సరిచూసుకొమ్మని అతనికి చెప్పింది. అందులో కొన్ని ఖరీదైనవని ఆమె అంది. నాకు ఇటువైపున్న ఖైదీ, అతని తల్లి ఇంకా ఒకరి నొకరు విషాదంగా చూసుకుంటూనే ఉన్నారు. అరబ్బుల గుసగుసల ధ్వని మమ్మల్ని చుట్టుముడుతున్నట్టుగా ఉంది. కిటికీలో నుంచి పడుతున్న సూర్యకాంతి ఒక్కసారిగా పెరిగినట్టు అనిపించింది. దానికి ఎదురుగా ఉన్న వాళ్ళ మొహాలు పసుపు రంగు అద్దినట్టు మెరుస్తున్నాయి.

నాకు ఇదంతా కొంచెం చిరాగ్గా అనిపించి అక్కడినుంచి వెళ్ళిపోవాలనుకున్నాను. నా పక్కనున్న అతని పెద్ద గొంతు తట్టుకోవడం చెవులకు కష్టంగా ఉంది. అయితే అదే సమయంలో మేరీతో ఇంకాస్త ఎక్కువ సమయం గడపాలని అనిపించింది. ఎంత సమయం గడిచిందీ నేను గమనించలేదు. మేరీ పెదాలపై ఎప్పుడూ ఉండే నవ్వుతోనే తన ఆఫీసు పని గురించి కాసేపు చెప్పింది. అక్కడ ఉన్న రణగొణ ధ్వని ఏ మాత్రం మారలేదు. అరుపులు, సంభాషణలు, గుసగుసలు అన్నీ అలాగే ఉన్నాయి. ఆ యువకుడు, అతని తల్లి మాత్రమే ఒకరి వైపు ఒకరు నిశ్శబ్దంగా చూసుకుంటూ ఉన్నారు.

ఒకరి తర్వాత ఒకరు అరబ్బులు వెళ్ళిపోయారు. ఒకరు వెళ్ళిపోగానే మిగిలిన వాళ్ళంతా ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఉండి పోతున్నారు. ఆ వృద్ధ మహిళ కటకటాలకు మొహాన్ని ఆనించింది. సరిగ్గా అప్పుడే వార్డరు ఆ యువకుడి భుజాలు తట్టాడు. అతను 'అమ్మా ఇంక శలవు' అన్నాడు. ఆమె కటకటాల్లోకి చేతిని దూర్చి అతని వైపు చూస్తూ చెయ్యూపింది. ఆమె వెళ్ళిపోగానే టోపీ పట్టుకున్న ఒక వ్యక్తి వచ్చి ఆమె స్థానాన్ని ఆక్రమించాడు. నా పక్కన ఏర్పడిన ఖాళీ స్థానంలోకి ఇంకో ఖైదీ వచ్చాడు. ఇద్దరూ కొంచెం సేపు గట్టిగా మాట్లాడుకున్నారు. వాళ్ళు అంత గట్టిగా మాట్లాడుకోకపోయినా అక్కడున్న నిశ్శబ్దంతో పోలిస్తే అది గట్టిగానే అనిపించింది. ఎవరో వచ్చి నా పక్కనున్న వ్యక్తిని పిలుచుకుని పోయారు. ఆ లావు పాటి స్త్రీ భర్తపై అరవడం మొదలెట్టింది. "జాగ్రత్తగా ఉండు దుందుడుకుగా ఏపనీ చెయ్యకు అని ఆమె అతనికి ఇంకా గట్టిగా చెబుతూనే ఉంది. తరువాత నా వంతు వచ్చింది. మేరీ నా వైపు ముద్దు విసిరింది.

నేను వెళ్ళిపోతూ వెనక్కి చూశాను మేరీ కదలకుండా అక్కడే ఉంది. ఆమె మొహం ఇంకా కటకటాలకు ఆనించే ఉంది. ఆమె పెదాలు కొద్దిగా విడివడుతూ నవ్వుతున్నాయి.

దీని తర్వాత ఆమె నుంచి నాకు ఉత్తరం వచ్చింది. ఆ తర్వాత నాకు చెప్పడానికి ఇష్టపడని సంగతులన్నీ మొదలయ్యాయి. అవి మరీ అంత భయంకరంగా అయితే లేవు. వాటిని ఎక్కువచేసి చెప్పాలని కూడా నాకు లేదు. నిజానికి మిగిలిన వారి కన్నా నేను తక్కువ బాధపడ్డాననే చెప్పాలి. జైల్లో ఉన్న తొలి రోజుల్లో నన్ను చికాకు పరిచింది నిజానికి ఒకటుంది. నేను స్వేచ్ఛా జీవినన్నట్లు ఆలోచించుకోవడం ఒకరకంగా ఇబ్బంది పెట్టింది. ఉదాహరణకి ఉన్నట్టుండి అకస్మాత్తుగా బీచ్‌కు వెళ్ళి ఈతకొట్టాలన్న కోరిక కలిగేది. నా పాదాల దగ్గర అలలు చేసే చిరు చప్పుడు వినాలనిపించేది. శరీరానికి మృదువుగా నీరు తాకినప్పుడు కలిగే అనుభూతి దాని మూలంగా కలిగే ఆహ్లాదం పదేపదే కావాలనిపించేది. జైలు గది లోపలి ఇరుకుదనం నేనున్న పరిస్థితిలోని విషాదాన్ని గుర్తు చేసేది.

అయితే ఆ దశ కొన్ని నెలలపాటే వుంది. ఆ తర్వాత నాకు ఖైదీలకు వచ్చే ఆలోచనలు రాసాగాయి. జైలు ఆవరణలో నడిచే నడక కోసమో, నా న్యాయవాది కోసమో ఎదురు చూసేవాడిని. మిగిలిన సమయాన్ని మొత్తానికి ఏదో విధంగా గడిపేసేవాడిని. ఏదన్నా ఎండిపోయిన చెట్టు తొర్రలో ఉండాల్సి వస్తే ఏం చేసి వుండేవాడిని అని ఎప్పుడూ ఆలోచించుకుంటూ ఉండేవాడిని. పైనున్న ఆకాశాన్ని చూడడం తప్ప ఇంకే పనిలేనప్పుడు ఏంచేసి ఉండేవాడిననే ఆలోచన వచ్చేది. నిదానంగా ఆ ఆలోచనకు అలవాటు పడ్డాను. పైనున్న పక్షులను చూడడమో, లేక మేఘాలను గమనించడమో నేర్చుకోవాల్సి వచ్చేది. మా న్యాయవాది ధరించే విచిత్రమైన టైలను చూడడం కోసమో, లేదా అంతకు ముందు మేరీతో ప్రేమగా గడపడానికి ఆదివారం ఎప్పుడొస్తుందా అని ఎదురుచూడడం లాగా వాటిని గమనించడం కూడా నేర్చుకోవాల్సి వచ్చేది. అయితే నేను ఇక్కడ చెట్టు తొర్రలో బంధించబడిలేను. ప్రపంచంలో నాకన్నా హీన స్థితిలో వున్నవాళ్ళు ఇంకా అనేకమంది వున్నారు. అమ్మ ఎప్పుడూ అంటూండే మాట ఆమెకు ఇష్టమైన మాట ఒకటి ఎప్పుడూ గుర్తు వస్తూ వుండేది. *"రోజులు గడిచేకొద్దీ ఎవరైనా దేనికైనా అలవాటు పడతారు".*

జైల్లో నన్ను ఇబ్బంది పెట్టిన విషయం ఇంకోటుంది. మొదటి కొద్ది నెలలు దానివల్ల ఇబ్బంది పడ్డాను. దాన్నుంచి బైటపడడానికి గట్టి ప్రయత్నమే చేశాను. ఉదాహరణకు ఎవరైనా స్త్రీ పొందు కావాలనే వాంఛ నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తుండేది. నా వయసు రీత్యా కూడా అది సహజమైన కోరికే. అయితే ఆ వాంఛ కేవలం మేరీకి ఒక్కదానికే సంబంధించింది కాదు. అంతకు ముందు నాకు పరిచయం ఉన్న, నాతో సంబంధం ఉన్న ప్రతి యువతి నా ఆలోచనల్లోకి వచ్చి నాకు పిచ్చెక్కిస్తుండేది. వాళ్ళకు సంబంధించిన

ఆలోచనలు, వాళ్ళను ప్రేమించడానికి దారి తీసిన పరిస్థితులు వీటన్నిటితో నా బుర్ర నిండిపోయి ఉండేది. జైలు గది అంతా వాళ్ళ మొహాలతో, నా పూర్వపు ప్రేమలు అనుభవాల ఆలోచనలతో కిక్కిరిసిపోయి ఉండేది. ఆ ఆలోచనలు నా ప్రశాంతతను భగ్నం చేసేవి. శారీరక వాంఛను మరింత పెంచేవి. అయితే సమయాన్ని గడపడానికి అవి బాగా ఉపయోగపడేవి. చీఫ్ జైలర్‌తో క్రమంగా నాకు మంచి పరిచయం ఏర్పడింది. భోజనాల సమయంలో వడ్డించేవాళ్ళను పర్యవేక్షించడానికి ఆయన వస్తుండేవాడు. ఆడవాళ్ళకు సంబంధించిన ప్రస్తావనను మొదట ఆయనే లేవనెత్తాడు. "ఇక్కడివాళ్ళు ఎక్కువగా అసంతృప్తి చెందేది ఆడవాళ్ళకు దూరంగా ఉండాల్సిన విషయంలోనే" అని ఆయన అన్నాడు.

నేను కూడా అలాగే అనుకుంటున్నానని ఆయనకు చెప్పాను. "ఇది అంత సరైన విషయం కాదు. ఇందులో కొంత అన్యాయం ఉంది. ఇది పడిపోయిన మనిషిని తిరిగి కొట్టటం లాంటిదే" అని నేనన్నాను.

"నిజానికి అసలు కిటుకంతా అందులోనే ఉంది. అందుకే మిమ్మల్ని జైలులో నిర్బంధంలో పెట్టేది" అని ఆయన అన్నాడు.

అది నాకు అంతగా అర్థం కాలేదు.

"స్వేచ్ఛ. స్వేచ్ఛ లేకపోవడం. మీ స్వేచ్ఛ మీకు లేకుండా చేయడం కోసం." అని ఆయన అన్నాడు.

అంతకు ముందు ఆ విషయం ఎప్పుడూ నాకు అంతగా తట్టలేదు. ఇప్పుడు నేను దానిని స్పష్టంగా చూడగలుగుతున్నాను.

"అవును. అది నిజం. స్వేచ్ఛ ఉన్న పక్షంలో అది శిక్ష ఎలా అవుతుంది?" అని నేనన్నాను. జైలర్ తలూపాడు.

"నువ్వు అందరిలో కొంచెం వేరుగా ఉన్నావు. నువ్వు నీ బుర్రను ఉపయోగిస్తున్నావు. మిగిలిన వాళ్ళు అలా కాదు. అయితే వాళ్ళు దానికి ఒక మార్గం కనుక్కున్నారు. వాళ్ళకి వాళ్ళే ఆ పని చేసుకుంటున్నారు" అని ఆయన అన్నాడు. తర్వాత ఆయన నా గది నుంచి వెళ్ళిపోయాడు. మరునాడు నేను కూడా అందరూ చేసిన పనే చేశాను.

సిగరెట్లు లేకపోవడం కూడా నాకు విషమ పరీక్షలాగా అనిపించేది. జైలుకు తీసుకురాగానే వాళ్ళు నా బెల్టును, బూట్ల లేసులను, సిగరెట్లతో సహా నా జేబులోని వస్తువులన్నిటినీ తీసేసుకున్నారు. నాకు విడిగా ఒక గదిని కేటాయించగానే నా సిగరెట్లు నాకు ఇచ్చి వేయవచ్చు కదా అని వాళ్ళనడిగాను. పొగతాగడాన్ని అక్కడ నిషేధించినట్లు వాళ్ళు చెప్పారు. అన్నిటికన్నా బహుశా అదే నన్ను ఎక్కువగా బాధపెట్టింది. నిజానికి మొదట్లో కొన్ని రోజులపాటు సిగరెట్లు తాగకపోవడంతో పిచ్చెక్కిపోతున్నట్లు ఉండేది.

చివరికి నేను నా పడకగా ఉన్న కొయ్య పలక నుంచి చెక్క ముక్కలను చీల్చి వాటిని సిగరెట్లుగా పీల్చేవాడిని. రోజంతా తల దిమ్మెక్కిపోతున్నట్టు, పైత్యం ప్రకోపించినట్టు ఉండేది. కనీసం పొగతాగడానికి కూడా వాళ్ళు నన్ను అనుమతించకపోవడం ఎందుకో నాకు అర్థమయ్యేది కాదు. అది ఎవరికీ ఎలాంటి హానీ చేయబోవటం లేదు కదా అనుకునేవాడిని. తర్వాత కానీ దాని వెనుక ఉన్న అంతరార్థం నాకు బోధపడలేదు. ఈ నిర్బంధం కూడా నాకు విధించిన శిక్షలో భాగమే. ఈ విషయం నాకు అర్థం కాగానే సిగరెట్లంటే నాకు ఉన్న వ్యామోహం చచ్చిపోయింది. ఇంక అది నాకు శిక్ష కాకుండా పోయింది.

ఈ ఒకటి రెండు నిర్బంధాలు, అసౌకర్యాలు మినహా నేను మరీ అంత అసంతోషంగా ఏమీ లేను. అయితే కాలాన్ని దొర్లించడం అనేది నాకు అన్నిటికన్నా ప్రధాన సమస్య అయిపోయింది. కొంతకాలం తర్వాత దానికి నేను ఒక వుపాయం కనుక్కొన్నాను. విషయాలను జ్ఞప్తికి తెచ్చుకోవడం. ఇలా విషయాలను జ్ఞప్తికి తెచ్చుకోవడం మొదలు పెట్టిన తర్వాత నేను ఎప్పుడూ విసుగు చెందలేదు. కొన్నిసార్లు నేను ఈ జ్ఞాపకం తెచ్చుకోవడం అనే ప్రక్రియకు నా పడకగదినే సాధనంగా ఎంచుకునేవాడిని. పడకగదిలో ఈ చివర నుంచీ ఆ చివర వరకూ ఉన్న ప్రతిదాన్నీ గుర్తించుకొని దానిని మననం చేసుకోవడం. మొదట్లో అది ఒకటి రెండు నిముషాల్లో పూర్తయేది. అయితే తర్వాత తర్వాత క్రమంగా సమయం పెరగసాగింది. గదిలోవున్న వస్తు సామగ్రి అంతా, సామగ్రిపైనా, లోపలావున్న వస్తువులు, వాటి తాలూకూ వివరాలు, వివరాతి వివరాలతో సహా ఏదీ నా దృష్టి నుంచి తప్పించుకోగలిగేది కాదు. సామగ్రికి పడిన చొట్టలు, పెచ్చులు వూడి పోవడం, అంచులు విరిగిపోవడం, కలపతో చేసిన వస్తు సామగ్రి రంగుతో మొదలుపెట్టి ఏదీ నా జ్ఞాపకాల నుండి తప్పించుకోలేకపోయేది. దానికి తోడు నేను గదిలోవున్న వస్తు సామగ్రినంతా క్రమ పద్ధతిలో వున్నది వున్నట్లుగా గుర్తుకు తెచ్చుకోవడానికి దృష్టిని కేంద్రీకరించేవాడిని. ఏ ఒక్క వస్తువునీ వదిలిపెట్టేవాడిని కాదు. దాని ఫలితంగా కొన్ని వారాల తర్వాత నేను నా పడకగదిలోని వస్తువుల జాబితాను తయారు చేయడానికే కొన్ని గంటలపాటు వెచ్చించేవాడిని. నేను ఆలోచించినకొద్దీ, దృష్టిని కేంద్రీకరించిన కొద్దీ అంతకు ముందు అంతగా పట్టించుకోని వస్తువులు, సగం సగం మర్చిపోయిన వివరాలు కూడా మరింత స్పష్టంగా గుర్తుకు రావడం మొదలయింది. వాటికి ఒక అంతు అంటూ లేకుండా పోయింది.

బైటి ప్రపంచంలో ఒక్కరోజు గడిపిన వ్యక్తి కూడా ఆ ఒక్కరోజు అనుభవంతో జైలులో కనీసం వందేళ్ళపాటు తేలికగా బతకగలడని నేను తెలుసుకోగలిగాను. అతని కుండే లెక్కలేనన్ని జ్ఞాపకాలు అతనికి విసుగు అనేది తెలీకుండా చేయగలవు. నిజానికి

ఒక రకంగా ఇది ఒక నష్టపరిహారం లాంటిది.

జ్ఞాపకాల తర్వాత నిద్ర వుండనేవుంది. మొదట్లో నాకు రాత్రి వేళల్లో అంతగా నిద్రపట్టేది కాదు. పగలు అసలు పడుకునే వాడిని కాదు. అయితే క్రమంగా నాకు రాత్రుళ్ళు బాగా నిద్రపట్టడమే కాదు పగలు కూడా చిన్న కునుకు తీయడం మొదలుపెట్టాను. చివరి చివరి నెలల్లో రోజుకున్న ఇరవై నాలుగ్గంటల్లో కనీసం పదహారు, పద్దెనిమిది గంటలు నిద్రపోయేవాడిని. ఇంక మిగిలింది ఆరు గంటలు. భోజనం, కాలకృత్యాలు తీర్చుకోవడం, నా జ్ఞాపకాలు,... చెక్ కథతో ఆ ఆరుగంటలు నింపేవాడిని.

ఒకరోజున నా గడ్డి పరుపును పరీక్షిస్తున్నప్పుడు దాని లోపల ఇరుక్కుపోయిన ఒక వార్తాపత్రిక ముక్క నాకు కనిపించింది. పాతదవడంతో కాగితం పసుపురంగుకి మారిపోయింది. అయితే అక్షరాలు మాత్రం ఇంకా స్పష్టంగానే కనిపిస్తున్నాయి. అది ఒక నేరానికి సంబంధించిన కథ. మొదటి భాగం చిరిగిపోయింది. అయితే మిగిలిన ముక్కను బట్టి అది చెకోస్లోవేకియాలోని ఒక గ్రామానికి సంబంధించిన కథ అని అర్థం చేసుకోవచ్చు. గ్రామస్థుల్లోని ఒకడు విదేశాల్లో తన అదృష్టాన్ని పరీక్షించుకోవడానికి వెళతాడు. ఇరవై అయిదేళ్ళ తర్వాత బాగా డబ్బు సంపాదించి అతను భార్యతోను, కొడుకుతోను కలిసి స్వంత ఊరికి తిరిగి వస్తాడు. అతని తల్లి, సోదరి కలసి అదే వూళ్ళో ఒక హెూటల్ నడుపుతుంటారు. అతను వాళ్ళని ఆశ్చర్యంలో ముంచెత్తాలనే కోరికతో భార్యను, కొడుకును అదే వూళ్ళోని ఇంకో హెూటల్‌లో వుంచి అతనొక్కడే వాళ్ళ అమ్మా వాళ్ళున్న హెూటల్‌లో గది అద్దెకు తీసుకుంటాడు. అది కూడా మారుపేరుతో. అతని తల్లి, సోదరి అతనిని ఏ మాత్రం గుర్తుపట్టలేకపోతారు. సాయంత్రం భోజనాల సమయంలో అతను తన వద్దనున్న ధనాన్నంతా వాళ్ళిద్దరికీ చూపిస్తాడు. వాళ్ళు అదే రాత్రి అతనిని సుత్తితో మోది చంపేస్తారు. డబ్బు తీసుకుని అతని మృతదేహాన్ని నదిలోకి విసరివేస్తారు. మర్నాడు ఉదయం అతని భార్య వచ్చి ఏ మాత్రం ఆలోచన లేకుండా అతను ఎవరో చెప్పి వేస్తుంది. దానితో అతని తల్లి వురేసుకుంటుంది. సోదరి బావిలో దూకుతుంది. నేను ఆ కథని కొన్ని వేలసార్లు చదివి వుంటాను. ఒకోసారి ఆ కథ మరీ అసందర్భంగా ఉన్నట్టు అనిపించేది. ఒకోసారి అలా జరగడం సాధ్యమా అనిపించేది. నా దృష్టిలో ఆ యువకుడు ఆపదను కొనితెచ్చుకున్నాడు. ఎవరూ కూడా అలాంటి అవివేకపు పనులు చేయకూడదు అనిపించేది.

గంటలకొద్దీ దీర్ఘ నిద్ర, జ్ఞాపకాలు, ఆ పాత వార్తా పత్రికను చదవడం, రాత్రీపగళ్ళ దోబూచులాటలో రోజులు అలా గడిచిపోతున్నాయి. జైలులో కాలం అంత త్వరగా గడవదు అని నేనెక్కడో చదివాను. అయితే నాకు సంబంధించి దీనికి అవకాశమే లేదు. కాలం గడవడం, గడవకపోవడం అనేది ఎలా వుంటాయో నాకు అర్థం కాలేదు. ఎక్కువ

కాలం గడిచినప్పుడు దానిని దీర్ఘకాలం అనవచ్చు.

అయితే కొంత కాలం గడిచేసరికి రోజులు ఒకదాని వెంట ఒకటి గడిచిపోయి వాటి అస్తిత్వం లేకుండానే మరుగున పడి కలిసిపోతాయి. నిజానికి రోజుల్ని నేను అలా ఎప్పుడూ భావించను. నా దృష్టిలో నిన్న, రేపు అనే పదాలకు మాత్రమే కొంచెం అర్థం వుంది.

ఒకరోజు వార్డెను వచ్చి నేను జైలుకి వచ్చి ఇప్పటికి ఆరు నెలలు అయిందని చెప్పాడు. అది నిజమని నేను నమ్మాను. అయితే ఆరు నెలలు అయిందనే మాట విన్నప్పుడు నాకు ఏమీ అనిపించలేదు. నేను నా జైలు గదిలో వున్నప్పటి నుంచీ అదంతా నేను ఒక రోజులాగానే పరిగణిస్తున్నాను. ఎందుకంటే నేను ప్రతిరోజూ అదే పని ఒకటే పని చేస్తున్నాను కాబట్టి. జైలరు వెళ్ళిపోయిన తర్వాత నేను నా తగరపు రేకు పళ్ళాన్ని బాగా మెరుగుపెట్టి అందులో నా మొహం చూసుకున్నాను. నా మొహం అందులో చాలా గంభీరంగా కనిపించింది. నేను నవ్వడానికి ప్రయత్నించినా కుదరలేదు. నేను రేకు పళ్ళాన్ని రకరకాల కోణాల్లో మార్చి చూశాను. అయితే నా మొహం మీద నుంచి ఆ విషాదకరమైన భావం పోలేదు.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఈ సమయాన్ని నేను 'పేరులేని గంట' అని వ్యవహరిస్తుంటాను. ఎందుకంటే ఆ సమయానికి జైల్లోని అన్ని అంతస్థులలోనూ శబ్దాలు మెల్లగా తగ్గుముఖం పడుతుంటాయి. నేను కిటికీ దగ్గరకి వెళ్ళి ఆ చివరి కిరణాలలో ఇంకోసారి మొహం చూసుకున్నాను. అది అంతకు ముందులానే గంభీరంగానే వుంది. అది నాకు ఆశ్చర్యం కలిగించలేదు. ఎందుకంటే ఆ సమయంలో నేను గంభీరంగానే వున్నాను. అయితే అదే సమయంలో నేను కొన్ని నెలలుగా వినని దాన్ని విన్నాను. అది ఒక గొంతుకు సంబంధించిన ధ్వని. అది నా గొంతే. అందులో ఏం సందేహం లేదు. ఈ మధ్యకాలంలో నా చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నది ఇదే గొంతని నేను గుర్తుపట్టాను. అంటే నాతో నేను మాట్లాడుకుంటున్నానని నాకు అర్థమైంది. నేను చెప్పింది తిరిగి నాకే వినిపిస్తోంది. దాన్ని తప్పించుకునే మార్గమే లేదు. జైలులో సాయంత్రాలు ఎలా వుంటాయనేది ఎవరూ ఊహించలేరు.

## 3

అయితే మొత్తం మీద ఆ రోజులు నిదానంగా గడిచినయ్యని నేను చెప్పలేను. మొదటి వేసవి గడిచిపోయిందని నేను గ్రహించే లోపలే రెండో వేసవి ప్రవేశించింది. వేడిగావుండే ఈ దినాల్లోనే నా కోసం ఏదో కొత్త సంగతి దాగుందని నాకు తెలుసు. నాకేసు న్యాయసభ ముందుకు రానుంది. జూన్ నెలలో సెషన్స్ ముగుస్తాయి.

నాకేసు న్యాయస్థానం ముందుకు వచ్చిన రోజున బాగా ఎండ కాస్తోంది. నా కేసు కేవలం రెండు మూడు రోజులు పట్టొచ్చని మా లాయరు చెప్పాడు.

"నేను విన్నదాని ప్రకారం న్యాయస్థానం నీ కేసుని సాధ్యమైనంత త్వరలో తేల్చివేస్తుంది. కేసుల జాబితాలో ఇది అంత ప్రధానమైన స్థానంలో లేదు. దీని తర్వాత తండ్రిని హత్య చేసిన కేసు వుంది. దానికి వాళ్ళు ఎక్కువ సమయం తీసుకుంటారు" అని లాయరు అన్నాడు.

వాళ్ళు నా కోసం ఉదయం ఏడున్నరకు వచ్చారు. జైలు వ్యానులో నన్ను న్యాయస్థానానికి తీసుకువెళ్ళారు. చీకటి వాసన వేస్తున్న ఒక చీకటి గదిలోకి ఇద్దరు పోలీసులు నన్ను నడిపించుకుంటూ తీసుకువెళ్ళారు. మేం తలుపు దగ్గరగా కూర్చున్నాం. ఆ పక్కన గదిలో నుంచి రకరకాల గొంతులు, అరుపులు, నేలమీద కుర్చీ జరిపిన చప్పుళ్ళూ వినిపిస్తున్నాయి. ఆ సందడి చూస్తోంటే నాకు టౌన్‌హాల్ గుర్తుకు వచ్చింది. కచేరీ ముగిశాక నృత్య ప్రదర్శనకు హాలును సిద్ధం చేసేటప్పుడు అలాగే ఉంటుంది.

జడ్జిలు ఇంకా రాలేదని ఆ ఇద్దరు పోలీసుల్లో ఒకడు నాతో అన్నాడు. నాకు ఒక సిగరెట్ ఇవ్వబోయాడు. నేను వద్దన్నాను. నేను గాబరా పడుతున్నానా అని అతను నన్ను అడిగాడు. నేను లేదన్నాను. విచారణ జరగడాన్ని ప్రత్యక్షంగా చూడగలగటం నాకు ఆసక్తి కలిగించింది. అంతకు ముందెప్పుడూ నేను ఏ విచారణను చూడలేదు.

"మొదట ఆసక్తి వుంటుంది. అయితే ఒక గంటా రెండు గంటలు గడిచిన తర్వాత ఇంక చాలనిపిస్తుంది." రెండో పోలీసు అన్నాడు.

కాసేపటికి గదిలోని ఎలక్ట్రిక్ గంట మోగింది. వాళ్ళు నా చేతి సంకెళ్ళు ఊడదీసి, తలుపు తెరిచి నన్ను ఖైదీలు వుండే చోటుకి తీసుకువెళ్ళారు.

న్యాయస్థానం కిక్కిరిసి ఉంది. 'కిటికీ అద్దాలు కిందకు దించి వున్నప్పటికీ అద్దాలకున్న బీటల్లో నుంచి కాంతి పడుతోంది. గాలి అప్పటికే బాగా వేడెక్కి వుంది. కిటికీలు మూసేసి ఉన్నాయి. నేను కూర్చున్నాను. నేను కూర్చున్న కుర్చీకి అటూ ఇటూ పోలీసులు నిలబడ్డారు. అప్పుడు నా ఎదురుగా ఒక వరుసలో కూర్చున్న కొన్ని ముఖాలు కనిపించాయి. వాళ్ళు నా వంక తీక్షణంగా చూస్తున్నారు. వాళ్ళు న్యాయమూర్తులు అయిండొచ్చనుకున్నాను. వాళ్ళను నేను వేరు వేరు వ్యక్తులుగా అనుకోలేకపోయాను. ఎవరైనా ట్రాములోకి ఎక్కినపుడు ఎదురుగా సీట్లో కూర్చున్న వాళ్ళందరూ అతని వేషభాషల్లో ఏదైనా వినోదం కలిగించే అంశముందా అని తేరిపార చూస్తున్నప్పుడు కలిగే అనుభూతి లాంటిది కలిగింది. అయితే ఇది వట్టి అసందర్భపు పోలికని నాకు తెలుసు. వీళ్ళు నా వంక నవ్వుకోడానికి ఏదైనా దొరుకుతుందా అని చూడడం లేదు. నేరం తాలూకూ ఛాయలు ఎక్కడన్నా కనిపిస్తున్నాయా అని వెదుకుతున్నారు. అయితే

రెండిటి మధ్యా చెప్పుకోదగినంత తేడా ఏమీ లేదని నాకు అనిపించింది.

అంతమంది జనం ఉండడం, గాలి బిగదీసినట్టు వుండటంతో నాకు కొంచెం సేపు తలతిరుగుతున్నట్టు అనిపించింది. కోర్టు గదిలోని అందరి వంకా తలతిప్పి చూశాను. అయితే ఎవరినీ గుర్తుపట్టలేకపోయాను. ఈ హాలులోని జనం అందరూ నా కోసమే వచ్చారన్నది నేను ఇంకా నమ్మలేకపోతున్నాను. అట్లా అందరి దృష్టినీ ఆకర్షించడం అనేది నా జీవితంలో కొత్త అనుభవం. మామూలుగా అయితే నన్ను అంతగా ఎవరూ పట్టించుకునేవారు కాదు.

"అబ్బ! ఏం జనం?" నా పక్కనున్న పోలీసుతో నేనన్నాను. దానికి వార్తా పత్రికలే కారణమని అతను చెప్పాడు. న్యాయమూర్తులు కూర్చున్న వేదిక కింద గుంపుగా వున్న వ్యక్తులవైపు చూపిస్తూ "అదిగో. అక్కడున్నారు" అని అతడు అన్నాడు. 'ఎవరు' అని నేనడగ్గా "పత్రికల వాళ్ళు" అని అతను సమాధానమిచ్చాడు. వాళ్ళలో ఒకడు తన పాత మిత్రుడని అతను చెప్పాడు.

కొన్ని నిముషాల తర్వాత పోలీసు తన మిత్రుడని చెప్పిన అతను మా వైపు చూసి మేం వున్న దగ్గరికి వచ్చి పోలీసుతో స్నేహపూర్వకంగా కరచాలనం చేశాడు. అతను వయస్సులో కొంచెం పెద్దవాడు. ఆయన ప్రవర్తన ఆహ్లాదకరంగా వుంది. కోర్టు గదిలో ఉన్న అందరూ ఒకరినొకరు పలకరించుకోవడం, అభివాదం తెలియజేసుకోవడం, చిన్న చిన్న గుంపులుగా ఏర్పడి మాట్లాడుకోవడం గమనించాను. ఏదో క్లబ్బుకి వచ్చి తమకు నచ్చిన అభిరుచి వున్న వాళ్ళతో విడివిడిగా మాట్లాడుకొంటున్నట్లు నాకు అనిపించింది. అక్కడి వాతావరణం చూసి నాకు విచిత్రమైన అనుభూతి కలిగింది. అయితే ఆ పత్రికా విలేఖరి నాతో స్నేహంగా మాట్లాడాడు. నాకు అంతా మంచి జరగవచ్చని తాను అనుకుంటున్నట్టు చెప్పాడు. నేను అతనికి కృతజ్ఞతలు తెలియజేశాను.

"మేం నీ గురించి కొన్ని వార్తలు రాశాం. వేసవిలో మాకు వార్తలు అంతగా వుండవు. నీ కేసు గురించి, నీ తర్వాత వచ్చే కేసు గురించి రాయడం కన్నా విలువైన వార్తలు ఏమీ లేవు. ఆ కేసు గురించి నువ్వు వినే వుంటావు. తండ్రిని హత్య చేసిన కేసు" అని అతడు అన్నాడు.

విలేఖరుల గుంపులో వున్న ఒక లావుపాటి పొట్టి మనిషిని అతను నాకు చూపించాడు. అతను కళ్ళకు నల్లటి అద్దాలు ధరించి చిన్నసైజు జంతువులా వున్నాడు.

"అతను పారిస్‌లోని ఒక దినపత్రికకు ప్రత్యేక వార్తా ప్రతినిధి. నిజానికి అతను నీ కోసం రాలేదు. నీ తర్వాత వచ్చే కేసు గురించి వచ్చాడు. అయితే వాళ్ళు నీ కేసు గురించి కూడా రాయమని చెప్పారు" అని అతడు అన్నాడు.

"వాళ్ళ దయకు పాత్రుడిని అయినందుకు సంతోషం" అని అందామని నోటి వరకు

వచ్చింది. అంతలోనే అది చాలా అసందర్భంగా ఉంటుందని నాకు తట్టింది. తర్వాత అతను మాకు స్నేహపూర్వకంగా చెయ్యూపి వెళ్ళిపోయాడు. తర్వాత కొద్ది నిముషాల పాటు ఏమీ జరగలేదు. తర్వాత కొంతమంది తోటి లాయర్లతో కలిసి మా లాయరు వచ్చాడు. అతను పత్రికల వారివద్దకు వెళ్ళి వాళ్ళతో కరచాలనం చేశాడు. వాళ్ళు కొంతసేపు నవ్వుకుంటూ మాట్లాడుకున్నారు. చూడడానికి అంతా స్నేహ పూర్వకమైన వాతావరణంలా కనిపించింది. గంట మోగగానే అందరూ ఎవరి స్థానాల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. మా న్యాయవాది నా దగ్గరకు వచ్చి కరచాలనం చేసి అన్ని ప్రశ్నలకు సాధ్యమైనంత క్లుప్తంగా సమాధానాలు చెప్పమని సలహా ఇచ్చాడు. నా అంతట నేనుగా ఎక్కువ సమాచారం ఇవ్వొద్దని, ఆయన చెప్పినట్టు నడుచుకోమని చెప్పాడు.

నా ఎడమచేతివైపు కుర్చీ లాగిన చప్పుడు వినిపించింది. పొడవుగా, సన్నగా ఎర్రటి కోటు ధరించిన ఒక వ్యక్తి కుర్చీలో కూర్చుంటూ కనిపించాడు. అతను పబ్లిక్ ప్రాసిక్యూటర్ అయుంటాడని ఊహించాను. న్యాయమూర్తులు వస్తున్నారని కోర్టు గుమస్తా ప్రకటించాడు. అదే సమయంలో పైనున్న రెండు ఎలక్ట్రిక్ ఫ్యానులు గిరగిరా తిరగడం ప్రారంభించాయి. ముగ్గురు న్యాయమూర్తులు, నల్లటి దుస్తుల్లో ఇద్దరు, ఎర్రటి దుస్తుల్లో ఒకతను చిన్న సూట్ కేసులను పట్టుకుని హాల్లోకి అడుగుపెట్టారు. కోర్టు గదికి కొన్ని అడుగుల ఎత్తులో వున్న వేదికపైకి సరాసరి వెళ్ళిపోయారు. ఎర్రటి దుస్తుల్లో వున్న ఆయన మధ్యలో ఎత్తుగా వున్న కుర్చీలో కూర్చుని విచారణ ప్రారంభించబోతున్నట్టు ప్రకటించాడు.

పత్రికా విలేకరులు తమ ఫౌంటెన్ పెన్నులు సిద్ధం చేసుకున్నారు. అందరి మొహాల్లో ఒక రకమైన ఉదాశీనత కనిపిస్తోంది. వాళ్ళందరిలో చిన్నవాడైన ఒక యువకుడు మాత్రం కొంచెం భిన్నంగా ఉన్నాడు. అతను కలాన్ని బల్లపైనే పెట్టి నా వంక చూస్తూ కూర్చున్నాడు. అతని మొహం సాధారణంగా వుంది. అన్నిటిలోకి అతని కళ్ళు నా దృష్టిని ఆకర్షించాయి. తెల్లటి స్వచ్ఛమైన కళ్ళు. ఒక ప్రత్యేకమైన భావం అనేది లేకుండా నా వంక అదే పనిగా చూస్తున్నాడు. కొంచెంసేపు నాకు బాగా ఇబ్బందిగా అనిపించింది. నన్ను నేను శల్య పరీక్ష చేసుకుంటున్నట్టు అనిపించింది. న్యాయస్థానంలోని పద్ధతులపై నాకు సరిగా అవగాహన లేకపోవడంతో నేను మొదటి దశలో ఏం జరుగుతుందో సరిగా అర్థం చేసుకోలేకపోయాను. జడ్జి ప్రాసిక్యూటర్‌ని, మా న్యాయవాదిని ఒకదాని వెనుక ఒకటిగా రకరకాల ప్రశ్నలు వేయడం, ఛార్జి షీటును హడావుడిగా చదవడం అంతా కొత్తగా అనిపించింది. ఛార్జిషీటులోని కొందరు వ్యక్తుల పేర్లు, కొన్ని ప్రాంతాల పేర్లు నాకు పరిచయం వున్నట్టుగా అనిపించాయి. తర్వాత మా న్యాయవాదిని కొన్ని అనుబంధ ప్రశ్నలు అడిగారు.

తర్వాత జడ్జి ప్రత్యక్షసాక్షుల జాబితాను తెలియజేయమని కోరాడు. అప్పుడు కోర్టు

గుమస్తా చదివిన కొన్ని పేర్లు నాకు ఆశ్చర్యం కలిగించాయి. అంతవరకూ కోర్టు హాల్లో వున్న ఆ జనంలో నాకు కనిపించని రేమాండ్, మేసన్, సాలమనో, వృద్ధాశ్రమంలోని వాచ్‌మన్, వృద్ధుడైన పెరజ్, మేరీ ఒకరి తర్వాత ఒకరు వచ్చి నిల్చున్నారు. మేరీ నావైపు కనిపించీ కనిపించనట్టుగా చెయ్యి ఊపింది. జాబితాలో చివరి పేరు సెలెస్టిది. అంతవరకూ హాల్లో వున్న వాళ్ళల్లో ఏ ఒక్కరినీ నేను గమనించకపోవడం నాకు ఆశ్చర్యం కలిగించింది. 'సెలెస్టి లేవగానే అతని పక్కన ఆ రోజు నేను రెస్టారెంట్‌లో చూసిన యువతి కనిపించింది. నా టేబిల్ దగ్గర కూర్చోవచ్చా అని నన్ను అడిగిన యువతి. ఆమె నా వైపు తదేకంగా చూడడం నేను గమనించాను. అయితే ఆమె గురించి ఆశ్చర్యపోయేందుకు నాకు సమయం లేదు. జడ్జి మాట్లాడడం మొదలుపెట్టాడు.

విచారణ మొదలవబోతోందని ప్రజలు ఎలాంటి ప్రదర్శనలకు దిగకుండా వుంటారని ఆశిస్తున్నానని ఆయన అన్నాడు. విచారణ జరిగే తీరును పర్యవేక్షించడానికే తాను అక్కడ వున్నానని అంటూ తాను ఒక రకంగా మధ్యవర్తి లాంటివాడినని కేసును నిష్పక్షపాతంగా పరిశీలించడమే తన లక్ష్యమని ఆయన అన్నాడు. జ్యూరీ సభ్యుల తీర్పును తాను న్యాయబద్ధమైన రీతిలో వ్యాఖ్యానించడానికి ప్రయత్నం చేస్తానని ఆయన చెప్పాడు. కోర్టుహాల్లో ఏ మాత్రం గందరగోళం మొదలవబోతోందని అనిపించినా హాల్లోని అందరినీ బైటకు పంపించి వేయాల్సి వుంటుందని ఆయన హెచ్చరించాడు.

ఆ రోజు వేడిగా వుడుకెత్తిపోతున్నట్టుగా వుంది. హాల్లోని వారిలో కొంతమంది వార్తా పత్రికలతో విసురు కోవడం ప్రారంభించారు. పత్రికల రెపరెపల శబ్దాలతో హాలు నిండిపోతోంది. ప్రిసైడింగ్ జడ్జి సూచనమేరకు కోర్టు గుమస్తా గడ్డితో చేసిన మూడు విసనకర్రలు పట్టుకొచ్చాడు. దానితో ముగ్గురు జడ్జీలు వాటితో విసురుకోవడం మొదలుపెట్టారు.

విచారణ ఒక్కసారిగా మొదలయింది. జడ్జి నన్ను నిదానంగా కొంచెం స్నేహ పూర్వకమైన గొంతుతో ప్రశ్నలడగడం మొదలుపెట్టాడు. నేను ఎవరు ఏంటి వగైరా ప్రశ్నల్ని (అప్పటికది ఎన్నోసారో!) అడగడం మొదలుపెట్టాడు. ఈ మొక్కుబడి ప్రశ్నలతో నేను విసిగిపోయి వున్నాను. అయితే అదంతా సాధారణంగా జరిగేదేనని నన్ను నేను సరిపెట్టుకున్నాను. ఒక అపసవ్యమైన వ్యక్తిని విచారించే దిగ్భ్రమలో న్యాయస్థానం వుంది మరి.

తర్వాత జడ్జి నేను చేసిన పనిని గురించి ప్రశ్నించడం, ప్రతి రెండు మూడు వాక్యాల తర్వాత 'అది నిజమేనా' అని అడగడం చేస్తున్నాడు. దానికి ప్రతిసారీ నేను 'అవును సార్' అని చెబుతున్నాను. అలా అనమని నా న్యాయవాది నాకు చెప్పాడు. అది అలా చాలాసేపు జరిగింది. జడ్జి ప్రతి చిన్న విషయానికి వివరణ అడుగుతూ పోతున్నాడు.

జర్నలిస్టులు కోర్టులో జరుగుతున్నదంతా హడావుడిగా రాసుకుంటున్నారు. వాళ్ళలోని ఆ యువకుడు స్థిరంగా నా వంకే చూస్తుండడం నేను మధ్య మధ్యలో గమనిస్తున్నాను. మర బొమ్మలాంటి ఆ పొట్టి యువతి కూడా నన్ను అలాగే చూస్తోంది. న్యాయవాదులంతా ఎరుపురంగు దుస్తులు ధరించిన ప్రధాన న్యాయమూర్తి వైపే చూస్తున్నారు. నాకు మళ్ళీ ట్రాములోని ఎదుటి వరుసలోని ప్రయాణీకులు గుర్తుకు వచ్చారు. ప్రధాన న్యాయమూర్తి చిన్నగా దగ్గి తన ఎదురుగా వున్న దస్త్రంలోని కొన్ని పేజీలు తిరగేసి విసనకర్రతో విసురుకుంటూ నా వంక గంభీరంగా చూస్తున్నాడు.

పైకి మామూలుగా కనిపించినా కొన్ని వింతైన ధోరణులు ఈ కేసులో వున్నాయని, నిజానికి వాటికీ ఈ కేసుకీ కూడా కొంత సంబంధం వుందని ఆ అంశాల్ని కూడా ఒకసారి పరిశీలించాల్సి వుంటుందని ప్రధాన న్యాయమూర్తి సూచించాడు. ఆయన అమ్మ గురించి ప్రస్తావించబోతున్నాడని నేను ఊహించాను. ఇది నాకు కొంత ఇబ్బంది కలిగించవచ్చని నేను అనుకున్నాను. మా అమ్మను నేను వృద్ధాశ్రమానికి ఎందుకు పంపించానని ఆయన ప్రశ్నించాడు.

కారణం చాలా చిన్నదని, వృద్ధాశ్రమంలో ఆమెను చూసుకునేంత బాగా చూసుకోవడానికి సరిపడిన డబ్బు నా దగ్గర లేదని నేను సమాధానమిచ్చాను. ఆమెను అలా పంపించడం నీకు బాధ కలిగించలేదా అని ఆయన అడిగాడు. అమ్మ కానీ, నేను కానీ ఒకరి నుంచి మరొకరం అంత ఎక్కువ ఏమీ ఆశించలేదని నేను చెప్పాను. ఆ విషయంలో మేం కూడా అందరిలాంటి వాళ్ళమేనని అన్నాను. అందుకే మేం ఇద్దరం కొత్త పరిస్థితులకు త్వరగా అలవాటుపడిపోయామని నేను చెప్పాను. ఈ విషయాన్ని ఇంతకన్నా ఎక్కువగా తాను అడగదలచుకోలేదని, అయితే ప్రాసిక్యూటర్ కావాలనుకుంటే ఈ విషయంలో నన్ను కొన్ని ప్రశ్నలు అడగవచ్చని ప్రధాన న్యాయమూర్తి అన్నాడు.

ప్రాసిక్యూటర్ నా వైపు పూర్తిగా తిరగకుండానే కొంచెం తలతిప్పి న్యాయమూర్తి అనుమతితో నన్ను ఒక ప్రశ్న అడగాలని అనుకుంటున్నానని చెప్పాడు. అరబ్బుని చంపే ఉద్దేశంతోనే నేను తిరిగి బీచ్‌కు వెళ్ళానా అనేది తెలుసుకోవాలనుకుంటున్నానని ఆయన అడిగాడు. నేను కాదన్నాను. అలాంటప్పుడు నేను నాతోపాటు రివాల్వర్ ఎందుకు తీసుకు వెళ్ళానని, తిరిగి అదే ప్రదేశానికి ఎందుకు వెళ్ళానని ఆయన ప్రశ్నించాడు. అదంతా యాదృచ్ఛికంగా జరిగిందని నేను చెప్పాను. ప్రాసిక్యూటర్ ఒకలాంటి రోత ధ్వనించే గొంతుతో "చాలా మంచిది. ప్రస్తుతానికి ఇంతే" అని అన్నాడు.

తర్వాత ఏం జరిగిందీ నేను సరిగా గమనించలేదు. అయితే న్యాయమూర్తులు, ప్రాసిక్యూటర్, న్యాయవాది మధ్య కాసేపు ఏదో వాగ్వివాదం నడిచింది. కోర్టు కాసేపు వాయిదా పడిందని, తిరిగి ప్రారంభమైన తర్వాత మధ్యాహ్నం సాక్షులను పరిశీలించడం

జరుగుతుందని ప్రిసైడింగ్ జడ్జి ప్రకటించాడు.

ఏం జరుగుతుందో నాకు అర్థమయేలోపలే నన్ను హడావుడిగా జైలువ్యానులోకి ఎక్కించి మధ్యాహ్న భోజనం కోసం జైలుకి తీసుకువచ్చారు. తర్వాత కొద్దిసేపటికి నేను బాగా అలసిపోయినట్టు అనిపించింది. తిరిగినన్ను న్యాయస్థానానికి తీసుకువచ్చారు. తిరిగి అదే హాలు, అవే మొహాలు, మళ్ళీ విచారణ మొదలయింది. ఈలోగా గదిలో వేడి ఇంకా బాగా పెరిగిపోయింది. ఏదో అద్భుతం జరిగినట్టుగా అందరికీ విసనకర్రలు సరఫరా చేశారు. న్యాయవాదులందరికీ, మా న్యాయవాదికీ, ప్రభుత్వ ప్రాసిక్యూటర్‌కీ కొంతమంది పత్రికా విలేకరులకు కూడా విసనకర్రలు ఇచ్చారు. ఆ జర్నలిస్టు యువకుడు, పొట్టి యువతి అదే స్థలాల్లో వున్నారు. అయితే వాళ్ళు ఇద్దరూ విసురుకోవడం లేదు సరికదా రెప్ప వాల్చకుండా నన్నే చూస్తున్నారు.

నేను నా మొహం నుంచీ కారుతున్న చెమటను తుడుచుకున్నాను. సాక్షుల బోనులోకి వృద్ధాశ్రమం వార్డెనును పిలిచే వరకు నేను ఎక్కడున్నాను ఏం చేస్తున్నాను. నేను ఎవరు అనేది కూడా నేను గమనించలేని స్థితిలో వున్నాను. నా ప్రవర్తన గురించి మా అమ్మ ఏమైనా ఫిర్యాదు చేస్తుండేదా అని ప్రశ్నించగా "అవును" అని ఆయన సమాధానం చెప్పాడు. అయితే దానిని అంతగా పట్టించుకోనక్కరలేదని, వృద్ధాశ్రమంలో వుండే ప్రతి ఒక్కరికీ తమ బంధువుల గురించి ఏదో ఒక బాధ వుంటుందని ఆయన చెప్పాడు. మరింత వివరంగా చెప్పమని జడ్జి ఆయనను కోరాడు. వృద్ధాశ్రమానికి పంపినందుకు ఆమె నన్ను నిందిస్తుండేదా అని ప్రశ్నించగా 'అవును' అని వార్డెన్ సమాధానం చెప్పాడు.

అయితే ఈసారి ఆయన సమాధానాన్ని విశదీకరించమని జడ్జి కోరలేదు. జడ్జి అడిగిన మరో ప్రశ్నకు సమాధానం చెబుతూ అంత్యక్రియలు జరిగిన రోజున నేను నిశ్శబ్దంగా వుండిపోవడం తనకు ఆశ్చర్యం కలిగించిందని వార్డెన్ తెలిపాడు. నిశ్శబ్దంగా ఉండడమంటే ఏమిటో చెప్పవలసిందిగా జడ్జి అడిగాడు. దానికి వార్డెన్ కళ్ళు దించుకుని ఒక్క నిముషం పాటు తన బూట్లవైపు చూసుకుంటూ ఉండిపోయాడు. నేను అమ్మ భౌతికకాయాన్ని చూడడానికి ఇష్టపడలేదని, ఒక కన్నీటి చుక్క అయినా కార్చలేదని, అంత్యక్రియలు ముగియగానే అమ్మ సమాధి దగ్గర కాసేపు అయినా వుండకుండా వెంటనే వెళ్ళిపోయానని వార్డెన్ చెప్పాడు. తనని మరో విషయం కూడా ఆశ్చర్యపరిచిందని ఆయన చెప్పాడు. మా అమ్మ వయసు ఎంతో నాకు తెలియదని నేను అన్నట్టు వృద్ధాశ్రమంలో ఒక వ్యక్తి తనకు చెప్పాడని ఆయన తెలియజేశాడు.

కోర్టులో కాసేపు నిశ్శబ్దం అలముకొంది. ఖైదీని బోనులోకి పిలిచి అడగవచ్చు అంటారా అని జడ్జి ప్రశ్నించగా వార్డెన్ కొంచెం తికమక పడినట్టు చూశాడు. అప్పుడు జడ్జి అందుకుని అది మామూలుగా అడిగే ప్రశ్న అని, దానిని తప్పక అడగవలసి

ఉంటుందని వార్డెన్‌కు వివరించాడు. తర్వాత ప్రభుత్వ ప్రాసిక్యూటర్ వైపు తిరిగి ఏవైనా ప్రశ్నలు అడగవచ్చని అన్నాడు. దానికి ప్రాసిక్యూటర్ పెద్ద గొంతుతో "అక్కరలేదు. నాకు కావలసింది నాకు దొరికింది" అంటూ సమాధానమిచ్చాడు. అతని గొంతు, అతని మొహంలో కనిపించిన విజయగర్వం, అతను నన్ను చూసిన తీరు నేను ఎప్పటికీ మర్చిపోలేను. నాకు ఒక్కసారి భోరున ఏడవాలని అనిపించింది. వీళ్ళందరూ నన్ను ఎంతగా అసహ్యించుకుంటున్నారో మొదటిసారిగా నాకు అర్థమయింది.

న్యాయమూర్తుల్నీ, న్యాయవాదినీ ఏమైనా ప్రశ్నలున్నాయా అని అడిగిన తర్వాత జడ్జి వృద్ధాశ్రమంలోని వాచ్‌మన్‌ను సాక్షుల బోనులోకి పిలిపించాడు. బోనులోకి అడుగు పెడుతూ అతను నావైపు ఒకసారి చూసింతర్వాత తల తిప్పుకున్నాడు. జడ్జి అడిగిన ప్రశ్నలకు సమాధానం చెబుతూ నేను అమ్మ భౌతిక కాయాన్ని చూడడానికి నిరాకరించానని, నేను సిగరెట్లు కాల్చానని, నిద్రపోయానని, కాఫీ తాగానని చెప్పాడు. అప్పుడు కోర్టు హాలులో ఒకలాంటి ఆగ్రహపూరితమైన వాతావరణం ఏర్పడినట్టు నాకు అనిపించింది. మొదటిసారిగా నేను తప్పుచేసినట్టు అర్థం చేసుకున్నాను. కాఫీ తాగడం గురించి, సిగరెట్టు తాగడం గురించి వాళ్లు వాచ్‌మన్‌ను మళ్ళీ అడిగి తెలుసుకున్నారు. ప్రభుత్వ ప్రాసిక్యూటర్ దుశ్చింతతో కూడిన సంతృప్తి నిండిన కళ్ళతో నా వంక తిరిగాడు.

న్యాయవాది వాచ్‌మన్‌ను "నువ్వు కూడా సిగరెట్లు తాగావా" అని ప్రశ్నించాడు. దానికి ప్రభుత్వ ప్రాసిక్యూటర్ తీవ్ర అభ్యంతరం తెలియజేశాడు. నాకు ఒకటి తెలియాల్సింది ఉంది. "ఈ కోర్టులో విచారణ చేస్తున్నది ఎవర్ని? సాక్ష్యాన్ని చెప్పడానికి వచ్చిన సాక్షిని గందరగోళ పరిచి ఆయన సాక్ష్యాన్ని తారుమారు చేయాలనుకుంటున్నాడా? ఆయన క్లయింట్‌కు వ్యతిరేకంగా వున్న బలమైన సాక్ష్యాలను తారుమారు చేయాలనుకుంటున్నాడా" అని కోపం నిండిన గొంతుతో అడిగాడు.

అయితే జడ్జి వాచ్‌మన్‌ను ఆ ప్రశ్నకు సమాధానం చెప్పమని అడిగాడు.

ఆ ముసలాయన దానికి ఒక క్షణం తటపటాయించాడు. తర్వాత 'అవును. ఆ పని చేయకూడదని నాకు తెలుసు. అయితే ఆ యువకుడు సిగరెట్ ఇవ్వజూపినపుడు కేవలం మర్యాద కోసమని నేను ఒక సిగరెట్ తీసుకున్నాను" అని గొణిగినట్లు చెప్పాడు.

నేను ఏమైనా చెప్పదలచుకున్నానా అని జడ్జి అడిగాడు.

"ఏమీ లేదు. ఆ సాక్షి చెప్పినది నిజమే. ఆయనకు నేనే సిగరెట్ ఇచ్చాననేది నిజం" అని నేను సమాధానమిచ్చాను.

వాచ్‌మన్ నా వైపు ఆశ్చర్యంగా, ఒకలాంటి కృతజ్ఞత నిండిన కళ్ళతో చూశాడు. తర్వాత కాసేపు తటపటాయించి నేను కొంచెం కాఫీ తాగితే బాగుంటుందని తనే సూచించినట్టు స్వచ్ఛందంగా ప్రకటన చేశాడు.

మా న్యాయవాది సంతోషంతో పొంగిపోయాడు. "ఈ ప్రకటనలో ఉన్న ప్రాధాన్యాన్ని న్యాయమూర్తులు గుర్తించాలి" అని ఆయన కోర్టువారికి విన్నవించుకున్నాడు. అయితే ప్రాసిక్యూటర్ తిరిగి లేచి నిలబడ్డాడు.

"అవును ప్రాధాన్యాన్ని గుర్తిస్తారు. అంతేకాదు. ఒకవేళ ఎవరైనా కాఫీ తాగుతారా అని అడిగినప్పుడు ఈ ప్రపంచంలోకి తనను తీసుకువచ్చిన మాతృమూర్తి మీద గౌరవంతో, ఆమె భౌతిక కాయం మీద గౌరవంతో అతను కాఫీ తిరస్కరించి ఉండొచ్చు. అనే విషయాన్ని కూడా న్యాయమూర్తులు ఇక్కడ గుర్తించి తీరాల్సి ఉంటుంది'' అని ప్రాసిక్యూటర్ అన్నాడు.

తర్వాత వాచ్‌మన్ తన సీట్లోకి వెళ్ళి కూర్చున్నాడు. థామస్ పెరజ్ పేరును పిలిచినప్పుడు కోర్టు ఉద్యోగి ఒకరు ఆయనను బోనులోకి తీసుకు వచ్చేందుకు సహాయం చేశాడు. తను మా అమ్మకు మంచి స్నేహితుడు అయినప్పటికీ అతను నన్ను ఒక్కసారి మాత్రమే చూశానని అది కూడా అంత్యక్రియల రోజునేనని పెరజ్ సమాధానం చెప్పాడు. ఆ రోజు నేను ఎలా ప్రవర్తించానని అడగ్గా "ఆ రోజు నేను బాగా దుఃఖంతో వున్నాను. పరిసరాలను గుర్తించలేనంత బాధలో వున్నాను. నా దుఃఖం నన్ను గుడ్డివాడిని చేసి వుంటుందని అనుకుంటున్నాను. నా ప్రియమైన స్నేహితురాలు చనిపోవడం నాకు దిగ్భ్రమ కలిగించింది. నిజానికి అంత్యక్రియలు జరుగుతున్నప్పుడు నేను స్పృహ కోల్పోయాను. అందుకే ఆ యువకుడిని నేను అంతగా గమనించలేదు" అని పెరజ్ తెలియజేశాడు.

నేను ఏడుస్తుండగా ఆయన చూశాడా అనే విషయాన్ని కోర్టువారికి తెలియజేయ వలసిందిగా ప్రాసిక్యూటర్ కోరినపుడు ఏడవలేదని పెరజ్ చెప్పాడు. కోర్టువారు ఈ సమాధానాన్ని పరిగణనలోకి తీసుకుంటారని తాను విశ్వసిస్తున్నట్టు ప్రాసిక్యూటర్ అన్నాడు.

మా న్యాయవాది ఒక్కసారిగా లేచి నుంచుని "ఇంకొక్కసారి బాగా ఆలోచించి చెప్పండి. అతను ఒక్క కన్నీటి చుక్క కూడా కార్చలేదని మీరు చూసినట్టు ప్రమాణం చేసి చెప్పగలరా" అని కోపం నిండిన గొంతుతో పెరజ్‌ను అడిగాడు.

"చెప్పలేను" అని పెరజ్ సమాధానమిచ్చాడు.

దీనికి కోర్టులోని వారిలో కొందరు ముసిముసిగా నవ్వారు.

మా న్యాయవాది తన నల్లగౌనును ఒక వైపు మడుచుకుంటూ కఠినమైన గొంతుతో "ఈ కేసును మొదటి నుంచీ ఈ విధంగానే విచారిస్తున్నారు. వాస్తవమైన విషయాలను బైటకు లాగేందుకు ప్రయత్నించడం లేదు" అని అన్నాడు.

ప్రాసిక్యూటర్ ఈ వ్యాఖ్యను పట్టించుకోనట్టు కూర్చున్నాడు. తనకేం పట్టనట్టు ఆయన పెన్సిల్‌తో బ్రీఫ్‌కేసు కవరు మీద గీతలు గీస్తూ వుండిపోయాడు.

అప్పుడు ఓ ఐదు నిముషాలపాటు విరామం వచ్చింది. అప్పుడు మా న్యాయవాది నా దగ్గరకు వచ్చి నా కేసు నిజంగా బాగా జరుగుతున్నట్టేనని అన్నాడు. తర్వాత సెలెస్టిని పిలిచారు. అతనిని డిఫెన్సు తరపున సాక్షిగా ప్రవేశపెట్టినట్టు చెప్పారు. డిఫెన్సు అంటే నా తరపున సాక్షి అని.

సెలెస్టి నా వైపు అప్పుడప్పుడూ చూస్తున్నాడు. సాక్ష్యం చెబుతున్నంత సేపూ అతను తన పనామా టోపీని రెండు చేతుల మధ్యా పట్టుకుని నలుపుతూనే వున్నాడు. అతను మంచి సూట్ వేసుకుని వున్నాడు. ఆదివారం నాతోపాటు ఎప్పుడన్నా గుర్రప్పందాలకు వచ్చినపుడు అతను ఆ సూట్ వేసుకుని వస్తుండేవాడు. నేను అతని కస్టమర్లలో ఒకడినా అని ప్రశ్నించగా అవునని అతను సమాధానమిచ్చాడు. నేను అతనికి మిత్రుడిని కూడా అని అతను చెప్పాడు. నా గురించి అతని అభిప్రాయం అడగారు. తనకు మంచి అభిప్రాయమే ఉందని అతను సమాధానమిచ్చాడు. అంటే ఏమిటని ప్రశ్నించగా అంటే ఏమిటో ప్రతి ఒక్కరికీ తెలుసు అని సమాధానమిచ్చాడు. నేను "నిగూఢంగా వుండే వ్యక్తినా" అని అడగ్గా కాదని అతను చెప్పాడు. "అతను నిగూఢంగా వుంటాడని చెప్పలేను. అయితే చాలా మందిలా అతను అనవసర విషయాల జోలికిపోడు'' అని సమాధానమిచ్చాడు. సెలెస్టి హొటల్ బిల్లులు ఇచ్చినపుడల్లా నేను వెంటనే కట్టేస్తుంటానా అని ప్రాసిక్యూటర్ ప్రశ్నించగా సెలెస్టి నవ్వి "ఓహ్! ఎప్పటివి అప్పుడు కట్టేస్తుంటాడు. ఆ బిల్లులు ఊరికే పేరుకు మా ఇద్దరికి సంబంధించినవి. అంతే" అని అతను చెప్పాడు. జరిగిన నేరం గురించి అతను ఏమనుకుంటున్నాడని అడగ్గా "నా వుద్దేశంలో అది కేవలం యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన. లేదంటే అది ఒక వెంటాడిన దురదృష్టం అని చెప్పవచ్చు. దాని నుంచి అతన్ని మీరే కాపాడాలి" అంటూ అతను ఇంకా ఏదో చెప్పబోతుండగా జడ్జి అతనిని మధ్యలోనే ఆపి "సరే. ఇక మీరు వెళ్ళొచ్చు" అన్నాడు.

దానికి సెలెస్టి ఒక నిముషం తబ్బిబ్బు అయినట్టు చూసి తాను చెప్పదలచు కున్నది ఇంకా పూర్తి కాలేదని చెప్పాడు. అలా అయిన పక్షంలో కొనసాగించమని అయితే క్లుప్తంగా చెప్పమని వాళ్ళు సెలెస్టికి సూచించారు.

అతను తిరిగి "అది ఒక అనుకోని సంఘటన. కాకతాళీయంగా జరిగింది" అన్నాడు.

''అయితే అయి వుండొచ్చు. అయితే అలాంటి యాదృచ్ఛిక సంఘటనలను చట్టపరంగా విచారించడానికే మేం ఇక్కడున్నాం. ఇంక మీరు వెళ్ళొచ్చు" అని జడ్జి అన్నాడు సెలెస్టి నావైపు తిరిగి చూశాడు. అతని కళ్ళు తడిగా వున్నాయి. పెదాలు వణుకుతున్నాయి.

"నీ కోసం నేను చెయ్యగలిగినదంతా చేశాను. అది నీకు అంత ఎక్కువగా సహాయం చేయలేకపోవచ్చని అనిపిస్తోంది. నన్ను క్షమించు" అని అతను అంటున్నట్టు అతని

కళ్ళు చెబుతున్నాయి.

నేను ఏమీ అనలేదు. కదలకుండా అలాగే వుండిపోయాను. అయితే నా జీవితంలో మొదటిసారిగా నేను ఓ వ్యక్తిని ముద్దాడాలని కోరుకున్నాను.

సెలెస్టిని బోను దిగాల్సిందని జడ్జి మళ్ళీ చెప్పడంతో సెలెస్టి బోను దిగి జనంలోకి వెళ్ళిపోయాడు. విచారణ జరుగుతున్నంత సేపూ అతను అక్కడే వున్నాడు. ముందుకు వంగి మోచేతులు మోకాళ్ళపై ఆనించి తన పనామా టోపీని చేతుల్తో పట్టుకుని విచారణ జరుగుతున్నంత సేపూ శ్రద్ధగా వింటూనే వున్నాడు.

తర్వాత మేరీ వంతు వచ్చింది. ఆమె తలపై టోపీ వుంది. అయినప్పటికీ చాలా అందంగా వుంది. సాధారణంగా ఆమె జుట్టు విరబోసుకుని వుండటమే నాకు నచ్చుతుంది. నేనున్న చోటు నుంచి ఆమె రొమ్ముల వంపులు లీలగా కనబడుతున్నాయి. కొంచెం ముందుకు పొడుచుకు వచ్చినట్లుండే ఆమె కింది పెదవి నన్ను ఎప్పుడూ ఆకర్షిస్తుండేది. మేరీ కొంచెం గాబరా పడుతున్నట్టు కనిపించింది.

మొదటి ప్రశ్నగా నేను ఆమెకు ఎప్పటినుంచీ తెలుసునని అడిగారు. మా ఆఫీసులో పనిచేసినప్పటి నుంచీ అని సమాధానమిచ్చింది. మా ఇద్దరి మధ్య ఎలాంటి సంబంధాలు ఉన్నాయని జడ్జి అడగ్గా తను నా గర్ల్‌ఫ్రెండ్ అని సమాధానం చెప్పింది. మరో ప్రశ్నకు సమాధానం చెబుతూ నన్ను వివాహం చేసుకుంటానని మాట ఇచ్చినట్టు కూడా అంగీకరించింది.

అంతవరకు తన ముందున్న దస్తావేజును చదువుతూ కూర్చున్న ప్రాసిక్యూటర్ అకస్మాత్తుగా మా 'సంబంధం' ఎప్పటి నుంచీ మొదలయిందని ప్రశ్నించాడు. ఆమె తారీకు చెప్పింది. అతను కాసేపు ఏదో ఆలోచించుకుని అంటే మా అమ్మ అంత్యక్రియలు జరిగిన మరునాడు అన్నమాట అని పైకి అన్నాడు. తర్వాత అతను కొంచెం వ్యంగ్యంగా ఇది కొంచెం 'సున్నితమైన విషయం' అని, తాను మేరీ మనోభావాలలో కూడా జోక్యం చేసుకోవాల్సి ఉంటుందని ఎందుకంటే - విద్యుక్త ధర్మంలో ఎలాంటి సున్నితమైన అంశాలకు కూడా తావు వుండదని అన్నాడు.

ఈ ప్రకటన చేసిన తర్వాత అతను మేరీని మా ఇద్దరి మధ్యా మొదటగా శారీరక సంబంధం ఏర్పడిన ఆ రోజున మొత్తం మేం చేసిన పనులన్నీ వరుసగా చెప్పమని అడిగాడు. మేరీ మొదట సమాధానం చెప్పలేదు. అయితే అతను రెట్టించిన తర్వాత మేం మొదట స్విమ్మింగ్ పూల్‌లో కలవడం, కలిసి సినిమాకు వెళ్ళడం, ఆ తర్వాత మా ఇంటికి రావడం అన్నీ చెప్పింది. మేజిస్ట్రేటు ముందు జరిగిన విచారణలో మేరీ ఇచ్చిన వాంగ్మూలం ప్రకారం ఆ రోజు వున్న సినిమా ప్రదర్శనలను తాను సేకరించానని చెబుతూ ప్రాసిక్యూటర్ మేరీ వైపు తిరిగి ఆ రోజు మేం వెళ్ళిన సినిమా పేరేమిటని

అడిగాడు. అది ఫెర్నాండెల్ నటించిన సినిమా అని మేరీ లోగొంతుకతో చెప్పింది. మేరీ చెప్పటం ముగిసేటప్పటికి కోర్టు హాల్లో సూది పడితే వినపడేంత నిశ్శబ్దం ఏర్పడింది.

ప్రాసిక్యూటర్ లేచి నిలబడి నావంక తలెత్తి చూపిస్తూ ఎంతో విషాదం నిండిన గొంతుతో "న్యాయమూర్తిగారూ. అతని తల్లి అంత్యక్రియలు అయిన మర్నాడు ఈ మనిషి స్విమ్మింగ్‌పూల్‌కి వెళ్ళాడు. ఒక అమ్మాయితో సంబంధం పెట్టుకున్నాడు. కామెడీ సినిమాకి వెళ్ళాడు. మీరు దీనిని దృష్టిలోకి తీసుకోవాలని కోరుతున్నాను. నేను చెప్పగలిగేది ఇంతే" అన్నాడు.

అతను కూర్చున్న తర్వాత కూడా కాసేపు ఆ నిశ్శబ్దం అలాగే వుండిపోయింది. అప్పుడు మేరీ వున్నట్టుండి కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుని గట్టిగా విలపించింది. అతను అంతా తప్పుగా అర్థం చేసుకున్నాడని, నిజానికి జరిగింది అది కాదని, తాను చెప్పదలచుకున్నదానికి అచ్చంగా వ్యతిరేకంగా అతను తనను మాటలతో మాయచేసి చెప్పించాడని మేరీ ఆరోపించింది. నేను ఆమెకు బాగా తెలుసని, నేను నిజంగా ఎలాంటి తప్పు చేయలేదని ఆమెకు బాగా తెలుసునని చెప్పింది. జడ్జి చేసిన సూచనమేరకు కోర్టు ఉద్యోగి ఒకరు ఆమెను పక్కకు తీసుకువెళ్ళిపోయాడు. తర్వాత విచారణ కొనసాగింది.

తర్వాత సాక్షిగా వచ్చిన మేసన్ చెప్పే మాటలపై ఎవరూ అంతగా శ్రద్ధ పెట్టలేదు. నేను గౌరవనీయమైన యువకుడినని, చక్కటి నడవడిక కల అబ్బాయినని అతను చెప్పాడు. సాలమనో చెప్పే మాటల్ని కూడా వాళ్ళు అంతగా లక్ష్యపెట్టలేదు. నేను అతని కుక్క అంటే ఎంతో దయగా వుండేవాడినని సాలమనో చెప్పాడు. నా గురించి, అమ్మ గురించి అడిగిన ప్రశ్నకు సమాధానంగా నాకు మా అమ్మకు మధ్య ఎలాంటి సారూప్యం లేదని అందుకే నేను ఆమెను వృద్ధాశ్రమంలో చేర్పించానని అన్నాడు. "దానిని మీరు అర్థం చేసుకోవాలి. దానిని మీరు అర్థం చేసుకోవాలి" అని ఒకటికి రెండుసార్లు చెప్పాడు. కానీ ఎవరూ ఆయనను అర్థం చేసుకోలేదు. అతన్ని బోను దిగమని చెప్పారు.

తర్వాతి వంతు రేమాండ్‌ది. సాక్షులలో అతను చివరివాడు కూడా. అతను నావైపు చూసి చెయ్యూపి నేను అమాయకుడినని చెప్పాడు. జడ్జి అతడిని కసురుకున్నాడు.

"నువ్వు ఇక్కడికి సాక్ష్యం చెప్పడానికి వచ్చావు. కేసు గురించి నీ అభిప్రాయం చెప్పడానికి కాదు. నిన్ను అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు చాలు" అని జడ్జి అన్నాడు.

చనిపోయిన వ్యక్తితో రేమాండ్ కున్న సంబంధాలను గురించి ప్రశ్నించగా చనిపోయిన వ్యక్తి అతనికి శత్రువని, నాకు అతనితో ఎలాంటి శత్రుత్వం లేదని, చనిపోయిన వ్యక్తి సోదరిని తాను కొట్టడంతో ఆ వ్యక్తి తనపై పగపెంచుకున్నాడని రేమండ్ జడ్జికి వివరించాడు. చనిపోయిన వ్యక్తి నన్ను ఇష్టపడకపోవడానికి కూడా కారణం ఏమీ లేదు కదా అని జడ్జి అడిగాడు. ఆ రోజు నేను బీచ్‌కు వెళ్ళడం అనేది యాదృచ్ఛికంగా

జరిగిందని రేమాండ్ స్పష్టం చేశాడు.

"అలా అయిన పక్షంలో ఈ విషాదానికి కారణమైన ఉత్తరాన్ని ఖైదీ ఎందుకు రాయవలసి వచ్చింది?" అని ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు.

అది కూడా కాకతాళీయంగా జరిగిన విషయమేనని రేమాండ్ చెప్పాడు.

ఈ కేసులో యాదృచ్ఛికాలు, కాకతాళీయాలు ప్రధానపాత్ర పోషిస్తున్నట్టు ఉన్నాయని ప్రాసిక్యూటర్ వ్యంగ్యంగా అన్నాడు. రేమాండ్ అతని ప్రియురాలిపై దాడి చేసినప్పుడు నేను జోక్యం చేసుకోకుండా వుండడం కూడా యాదృచ్ఛికమేనా అని అతను అడిగాడు. పోలీసుస్టేషన్లో రేమాండ్ తరపున నేను సాక్ష్యం ఇవ్వడానికి కూడా ఈ యాదృచ్ఛికం అనే వంకే కారణమా? అందుకే సాక్ష్యాలు రేమాండ్ తరపున అంత బలంగా వున్నాయా అని ప్రాసిక్యూటర్ ప్రశ్నించాడు. తర్వాత రేమాండ్ జీవనాధారం ఏమిటని అతను ప్రశ్నించాడు.

తాను గిడ్డంగుల శాఖలో పని చేస్తుంటానని సాక్షి చెబుతున్నాడని, అయితే అతను ఆడవాళ్ళు అనైతికంగా సంపాదించే డబ్బుపై ఆధారపడి బతుకుతుంటాడని అతన్ని గురించి అందరూ అంటుంటారని ప్రాసిక్యూటర్ అన్నాడు. నేను అలాంటి వ్యక్తికి ప్రాణస్నేహితుడినని, అనుచరుడినని ఆయన అన్నాడు.

అసలు మొత్తంగా ఈ నేరానికి సంబంధించిన నేపథ్యం అంతా పరమ చెత్తగా వుందని ప్రాసిక్యూటర్ వ్యాఖ్యానించాడు. అంతకన్నా అప్రియమైన విషయం ఏమిటంటే అది ఖైదీ వ్యక్తిత్వానికి సంబంధించినదని అతను ఏ మాత్రం మానవత్వం లేని రాక్షసుడిలాంటి వాడని, ఎలాంటి నైతిక విలువలు లేనివాడని ప్రాసిక్యూటర్ ఆరోపించాడు. రేమాండ్ మధ్యలో ఏదో చెప్పబోయాడు. మా న్యాయవాది కూడా ఆ మాటలకు అభ్యంతరం తెలిపాడు. అయితే ప్రాసిక్యూటర్‌ను పూర్తిగా మాట్లాడనిచ్చి అప్పుడు మీరు చెప్పేది చెప్పవచ్చని జడ్జి సూచించాడు.

"నేను మాట్లాడడం దాదాపు పూర్తయినట్టే అంటూ ప్రాసిక్యూటర్ రేమాండ్‌ని ఖైదీ నీ స్నేహితుడా' అని ప్రశ్నించాడు.

"అవును. మేం మంచి స్నేహితులమని అందరూ అంటారు." అని రేమాండ్ సమాధానం చెప్పాడు.

ప్రాసిక్యూటర్ నన్నుకూడా అదే ప్రశ్న అడిగాడు. నేను రేమాండ్ వైపు చూశాను. అతను నావంక అలాగే చూస్తున్నాడు. నేను కూడా "అవును" అని సమాధానమిచ్చాను.

ప్రాసిక్యూటర్ న్యాయమూర్తి వైపు తిరిగాడు.

"ఈ బోనులో మీ ఎదురుగా వున్న వ్యక్తి వాళ్ళ అమ్మ, అంత్యక్రియలు జరిగిన మరునాడే కొన్ని సిగ్గుమాలిన పనులు చేశాడు. వ్యభిచారులు, విటులకు సంబంధించిన

అధో జగత్తులో నీచమైన పగ, ప్రతీకారాలతో ఒక మనిషిని నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపాడు. ఈ ఖైదీ ఎలాంటి వాడో మీకు అర్థమైందనుకుంటాను" అని న్యాయమూర్తిని ఉద్దేశించి అన్నాడు.

ప్రాసిక్యూటర్ కూర్చోగానే అంత వరకూ ఎంతో సహనంతో వేచి ఉన్న మా న్యాయవాది చేయి పైకెత్తాడు.

"మా క్లయింట్‌ను విచారణ జరుపుతున్నది ఒక వ్యక్తిని చంపిన నేరానికా లేక అతని తల్లిని సమాధి చేసినందుకా" అని అడిగాడు.

కోర్టులో అక్కడక్కడా నవ్వులు వినిపించాయి. అప్పుడు ప్రాసిక్యూటర్ వెంటనే లేచి నిలబడి గౌను సర్దుకుంటూ ఈ రెండు విషయాల మధ్యా అంతర్లీనంగా వున్న బలమైన సంబంధాన్ని చూడడంలో నా మిత్రుడు ఘోరంగా విఫలం అవడం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోందంటూ వ్యాఖ్యానించాడు. ఆరెండిటిని మానసికపరమైన అంశం కింద విడదీసి చూడలేమని అన్నాడు.

"ఒక్క మాటలో చెప్పాలంటే నిందితుడు అతని తల్లి అంత్యక్రియలప్పుడు ప్రవర్తించిన విధానాన్ని బట్టి అతడు అప్పటికే నేర ప్రవృత్తి కలవాడని తేటతెల్లమవుతోంది" అంటూ ముగించాడు.

ఈ మాటలు న్యాయమూర్తులపైనా, ప్రజలపైనా తీవ్రమైన ప్రభావాన్ని చూపాయి. మా న్యాయవాది ఏమీ మాట్లాడకుండా భుజాలు ఎగురవేసి నుదుట పట్టిన చెమటను తుడుచుకుంటూ వుండిపోయాడు. అతని మానసిక స్థైర్యం దెబ్బతిన్నట్టు నాకు అనిపించింది. అంతేకాదు అక్కడ జరుగుతున్నది నాకు అంత మంచి చేయక పోవచ్చని కూడా నాకు అనిపించింది.

ఈ సంఘటన తర్వాత కోర్టు ముగిసింది. కోర్టు నుంచి జైలుకు తిరిగి వ్యానులో వెళుతున్నప్పుడు వేసవి సాయంత్రాల్లో నాకు తరచూ కలిగే అనుభూతి కొన్ని నిముషాల పాటు కళ్ళముందు కదలాడింది.

చీకటి నిండిన కదిలే వ్యానులో కూర్చుని నేను ప్రేమించిన పట్టణానికి సంబంధించిన అన్ని ధ్వనుల్ని, రోజులోని ఒక ప్రత్యేకమైన గంటలో నేను మరీ మరీ ఆనందించే విషయాన్ని గుర్తుచేసుకుంటూ ఆ జ్ఞాపకాలతో నా మస్తిష్కాన్ని నింపుకొంటూ వుండిపోయాను. గాలిలోంచి తేలివచ్చే పేపరబ్బాయిల అరుపులు, పార్కులో పిట్టలు విశ్రమించే ముందు చేసే ధ్వనులు, శాండ్‌విచ్ అమ్మే కుర్రాళ్ళ కేకలు, పట్టణంలో హడావుడిగా తిరిగే ట్రాముబళ్ళు, చీకటి ముసురుకుంటున్నపుడు హార్బర్ నుంచి వినిపించే మర్మరధ్వని – వీటన్నిటినీ ఆ మూసిన వ్యాను తలుపుల వెనుక కూర్చుని జైలుకు తిరిగి వెళుతున్నప్పుడు ధ్వనులను బట్టి మనోనేత్రం ముందు ఊహించుకున్నాను. అణువణువూ

హృదయానికి సుపరిచితమైన దారిలో ఒక గుడ్డివాడు చేస్తున్న ప్రయాణంలా ఇది నాకు అనిపించింది.

నిజం. ఈ సాయం సమయాల్లో నేను ఒకప్పుడు ఎంత హాయిగా వున్నాను? నేను జీవితంలో ఎప్పుడూ సంతృప్తి పడుతూనే వచ్చాను. అందుకు ఫలితంగా నాకు కలలు కూడా రాని చక్కటి రాత్రులు లభించాయి. ఇది కూడా అలాంటి సమయమే. అయితే చిన్న తేడా వుంది. నేను జైలులోని నా గదికి తిరిగి వెళుతున్నాను. అయితే రేపు ఏం జరగనుందో అనే ఆలోచనలతో నిద్రరాని రాత్రి నా కోసం అక్కడ ఎదురు చూస్తూ వుంది.

వేసవి సాయం సమయాల్లో కనిపించే పరిచితమైన ఆ కాలి బాటలు అమాయకమైన, స్వేచ్ఛాపూరితమైన నిద్రకే కాదు ఒక్కోసారి జైలుకు కూడా దారి తీస్తాయని నేను తెలుసుకున్నాను.

ఒకళ్ళ గురించి మాట్లాడుతుంటే వినడం ఎప్పుడూ ఆసక్తి కలిగిస్తుంది. ఆఖరికి అది జైలులో వున్న ఖైదీ గురించి అయినా సరే. మా న్యాయవాది, ప్రభుత్వ ప్రాసిక్యూటర్ కోర్టులో చేసిన వాదనల్లో నా గురించి చాలా ఎక్కువగా ప్రస్తావించారు. నిజానికి నా నేరం గురించి కన్నా వ్యక్తిగతంగా నా గురించే ఎక్కువ మాట్లాడారు.

నిజానికి వాళ్ళ ఇద్దరి ప్రసంగాల్లో చెప్పుకోదగిన తేడా ఏమీలేదు. నా తరఫు న్యాయవాది స్వర్గానికి చేతులు చాచి అపరాధాన్ని మన్నించమని వేడుకున్నాడు. యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనగా భావించి నేర తీవ్రతను తక్కువచేసి చూడాలని ప్రాధేయపడ్డాడు. ప్రాసిక్యూటర్ కూడా అలాగే అభిప్రాయపడ్డాడు. నేను అపరాధం చేశాననే ఒప్పుకున్నాడు. అయితే యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనగా భావించి నేర తీవ్రతను తగ్గించడాన్ని నిరాకరించాడు.

## 4

ఈ దశలో కోర్టులో జరిగే విచారణల్లో ఒక అంశం నాకు చాలా చిరాకు కలిగించేది. వాళ్ళు నా గురించి మాట్లాడేటపుడు తరచుగా నేను కూడా ఏదైనా చెప్పాలని అనుకునేవాడిని. అయితే మా న్యాయవాది నన్ను ఏమీ మాట్లాడవద్దని సలహా ఇచ్చాడు. "మాట్లాడడం ద్వారా నీ కేసుకు నువ్వు ఏమీ మంచి చేయలేవు" అని ఆయన నన్ను హెచ్చరించాడు. నిజానికి విచారణ జరిగేటపుడు నేను లేకుండా చేయడానికి ఏదైనా కుట్రపన్నారేమోనని నాకు అనిపించేది. నా గురించి నేను చెప్పడానికంటూ ఏమీ లేకుండా పోయింది. నా విధి నా చేతుల్లో నుంచి జారిపోయింది.

వాళ్ళ వాద ప్రతివాదాల మధ్య అకస్మాత్తుగా జొరబడి "ఈ కోర్టులో విచారణ

చేస్తున్నది ఎవర్ని? ముందు నాకు అది తెలియాలి. ఇది హత్యానేరం మోపబడిన ఒక వ్యక్తికి సంబంధించిన జీవన్మరణ సమస్య. ఒక ముఖ్యమైన విషయం మీకు చెప్పాల్సింది నా దగ్గరుంది" అంటూ గొంతు చించుకుని అరవాలని అనిపించేది. అయితే తర్వాత ఆలోచించుకుని చూస్తే నాకు చెప్పడానికి ఏమీ లేదనిపించింది. ఒక వ్యక్తి అదేపనిగా మాట్లాడుతుంటే వినడానికి కొంత కాలానికి ఆసక్తి తగ్గిపోతుందేమో. ప్రభుత్వ ప్రాసిక్యూటర్ మాట్లాడుతుండగానే అతను ఇంకా సగం వాదనను కూడా పూర్తిచేయక ముందే అతని ప్రసంగం నాకు విసుగుపుట్టడం మొదలయింది. అతని మాట్లాడే పద్ధతి, అతని హావభావాలు, కొన్ని దీర్ఘ నిందా వాక్యాలు మాత్రం నా దృష్టిని ఆకర్షించాయి.

నాకు అర్థమైన దానిని బట్టి అతను నేను చేసిన నేరాన్ని ముందుగా ఆలోచించి పథకం ప్రకారం చేసిన కుట్రగా నిరూపించాలని అనుకుంటున్నాడు. ఒక సందర్భంలో అతను ఆ మాట అన్నాడు కూడా. "నేను దీనిని రుజువు చేయగలను. మొదట మీరు నేరానికి సంబంధించిన వాస్తవాలను స్పష్టంగా తేటతెల్లంగా చూడండి. తర్వాత దాని వెనుక దాగివున్న చీకటి కోణాలు, నేర పూరితమైన మానసిక ప్రవృత్తి చేయించిన చీకటి పని అర్థమవుతుంది." అని న్యాయమూర్తులతో అతను ఆవేశంగా అనడం గుర్తొచ్చింది.

మా అమ్మ చనిపోయిన తర్వాత జరిగిన సంఘటనల నుంచి మొదలుపెట్టి అతను కేసుకు ఒక తుదిరూపం ఇవ్వడం మొదలుపెట్టాడు. నాకు హృదయం అనేదే లేకపోవడాన్ని, అమ్మ వయసు ఎంతో నేను చెప్పలేకపోవడాన్ని, స్విమ్మింగ్ పూల్‌కి వెళ్ళి అక్కడ మేరీని కలవడాన్ని, ఫెర్నాండెల్ నటించిన కామెడీ సినిమాకు వెళ్ళడాన్ని, చివరిగా మేరీతో కలిసి నా గదికి రావడాన్ని అతను పదేపదే నొక్కి ప్రస్తావించడం మొదలుపెట్టాడు. అతను మాటిమాటికి 'ఖైదీ ప్రియురాలు' అంటుంటే నేను మొదట అర్థంచేసుకోలేక పోయాను. తర్వాత అర్థమయింది అది మేరీ గురించని. నా వరకూ ఆమె వట్టి 'మేరీ' మాత్రమే. తర్వాత అతను రేమాండ్ సంగతి ఎత్తేవాడు. అతను వాస్తవాలను తనదైన ఒక తెలివైన పద్ధతిలో యుక్తిగా చెప్పేవాడు. వినేవాళ్ళకి అతను చెబుతున్నవన్నీ అక్షరసత్యాలన్నట్టు అనిపించేవి.

రేమాండ్ ప్రియురాలిని అతని గదికి పిలిపించి అవమానించాలనే వుద్దేశంతోనే నేను రేమాండ్‌తో కుమ్మక్కయి అతని ప్రియురాలికి వుత్తరం రాశానట. ఫలితంగా ఆమె రేమాండ్ లాంటి సందేహాస్పదమైన చరిత్రగల వ్యక్తి చేతిలో అవమానం పొందవలసి వచ్చిందట. అంతేకాదు బీచ్‌లో రేమాండ్ శత్రువులతో జరిగిన ఘర్షణను నేనే ప్రేరేపించానట. ఫలితంగా రేమాండ్ గాయపడడం, నేను రేమాండ్‌ని రివాల్వర్ అడిగి తీసుకుని దానిని ఉపయోగించే ఉద్దేశంతోనే తిరిగి బీచ్‌కు వెళ్ళడం అక్కడ అరబ్‌ని కాల్చి చంపడం అన్నీ నా మూలంగానే జరిగినట్టు వర్ణించేవాడు. మొదటిసారి కాల్చిన

తర్వాత నేను కాసేపు ఆగడం, చేసిన పనిని మంచిగా పూర్తిచేయాలనే ఉద్దేశంతో తిరిగి మళ్ళీ కావాలనే నాలుగుసార్లు కాల్చడం ఇవన్నీ కరడు కట్టిన నేరస్థుడి లక్షణాలని అతను పదేపదే చెబుతూ పోయాడు.

"ఈ కేసులో నేను చెప్పేది ఇదే. ఈ వ్యక్తి హత్య చేయడానికి దారితీసిన సంఘటనలను నేను వరుసగా వివరించి చెప్పాను. ఖైదీ తను ఏం చేస్తున్నదీ స్పష్టంగా తెలిసే చేశాడు. నేను ఈ విషయాన్ని నొక్కి మరీ చెబుతున్నాను. ఇది క్షణికోద్రేకం వల్ల యాదృచ్ఛికంగా జరిగిన హత్య కాదు. ఈ సందర్భంగా మీకు ఒక విషయాన్ని గుర్తుచేస్తున్నాను. ఖైదీ విద్యావంతుడు. నేను అడిగిన ప్రశ్నలకు అతను సమాధానం చెప్పిన తీరును మీరు గమనించే వుంటారు. అతను తెలివైన వాడు. మాటల విలువ తెలిసినవాడు. అతను నేరం చేసినపుడు తను ఏం చేస్తున్నాడో తెలీని పరిస్థితిల్లో వున్నాడనేది ఏ మాత్రం నమ్మశక్యంగా లేదు" అంటూ గట్టిగా వాదించాడు.

అతను నా తెలివితేటల గురించి ప్రత్యేకంగా ప్రస్తావించడం గమనించాను. ఒక సాధారణ వ్యక్తిలో మంచి లక్షణంగా చెప్పబడే 'తెలివితేటలు' అనే పదం ఒక నేరస్థుడి విషయానికి వచ్చేసరికి అతను చేసిన నేరానికి తిరుగులేని సాక్ష్యం ఎలా అయిందనే విషయం నన్ను ఆశ్చర్యానికి గురి చేసింది.

ఈ విషయం గురించి ఆలోచిస్తూ నేను అతను తర్వాత ఏం అన్నదీ వినిపించు కోలేదు. అతను గట్టిగా అరవడం విని మళ్ళీ అటు దృష్టి పెట్టాను.

"అతను తను చేసిన పనికి పశ్చాత్తాప పడుతున్నట్టు కనీసం ఒక్కమాట అన్నా అన్నాడా? ఒక్కమాట ఒక్కమాటంటే ఒక్కమాట కూడా అనలేదు. ఈ విచారణ జరుగుతున్నన్ని రోజుల్లో కనీసం ఒక్కసారన్నా పశ్చాత్తాపపడినట్టు కనిపించాడా?" లేదు బోనులో నిలబడ్డ నన్ను వేలెత్తి న్యాయమూర్తికి చూపిస్తూ అతను ఇదే పద్ధతిలో వాదన కొనసాగించాడు. ఇదే విషయాన్ని అతను పదేపదే ఎందుకు ప్రస్తావిస్తున్నాడో నాకు అర్థం కాలేదు.

అయితే కొంతవరకు అతను సరిగానే చెప్పాడు. నేను నిజంగానే చేసిన పనికి అంతగా పశ్చాత్తాపపడలేదు. అయితే అతను దానిని ఇంకా ఎక్కువచేసి చూపిస్తున్నాడు. అందుకే నేను అవకాశం కుదిరితే స్నేహపూర్వకంగానే, ప్రేమ పూర్వకంగానే ఒక విషయాన్ని వివరించి చెప్పగలిగితే బాగుండనుకున్నాను. నేను జీవితంలో ఇంతవరకూ ఎప్పుడూ పశ్చాత్తాపపడి ఎరుగనని అట్లా పశ్చాత్తాపపడడం అంటే ఏంటో కూడా నాకు చేతకాదని చెబుదామనుకున్నాను. నేను ఎప్పుడూ 'ఈ క్షణం' మీదే దృష్టిపెడతానని లేకపోతే సమీప భవిష్యత్తు గురించే ఆలోచిస్తాను తప్ప గతం గురించి కాదని అతనికి చెప్పాలనుకున్నాను.

అయితే అప్పుడు నేనున్న పరిస్థితుల్లో ఆ రకమైన మాటల్ని ఎవరితోనూ నేను అనగలిగిన ప్రశ్నేలేదు. ఎవరిపైనైనా స్నేహభావాన్ని ప్రదర్శించడానికి గానీ నాకు మంచి ఉద్దేశాలు వున్నట్టు చెప్పుకోడానికి గానీ నాకు హక్కులేదు. తర్వాత ఏం జరగబోతోందో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాను. ప్రభుత్వ ప్రాసిక్యూటర్ ఇక ఇప్పుడు 'నా ఆత్మ' గురించి ప్రస్తావించడం మొదలుపెట్టాడు. తను నా ఆత్మను నిశితంగా అధ్యయనం చేసి చూశానని తనకు అక్కడ ఖాళీ తప్ప ఏం కనిపించలేదని ఆయన అన్నాడు. నాకు ఆత్మ అనేదే లేదని నాలో మానవత్వం మచ్చుకైనా లేదని, సాధారణ మానవులకు వుండే నైతిక లక్షణాలకు నా మనస్తత్వంలో ఎలాంటి స్థానం లేదని ఆయన వాదించాడు. అయితే దీనికి మనం అతన్ని నిందించలేము. మంచి లక్షణాలను సాధించడంలో అతని అశక్తతను మనం తప్పు పట్టలేం. అయితే న్యాయస్థానం ఇలాంటి విషయాల్లో చూపించే సహనం వల్ల న్యాయం అనే ఆదర్శం దెబ్బతింటుంది. మంచి లక్షణాలు లోపించినపుడు మీ ఎదురుగా వున్న ఈ వ్యక్తిలాగా అతను కూడా సమాజానికి ప్రమాదకారిగా అవుతాడు" అంటూ అతను మా అమ్మ విషయంలో నా ప్రవర్తన గురించి చర్చించడం మొదలుపెట్టాడు. విచారణ జరిగేటపుడు అతను చెప్పిన విషయాల్నే తిరిగి చెప్పడం మొదలెట్టాడు. దానితోపాటు నేను చేసిన నేరాన్ని ఎంతో పెంచి చెబుతున్నాడు. నేను ఎంత పెద్ద నేరం చేశానో అతను చెబుతుంటే నిజానికి నాకు దాని అంతు కూడా దొరకలేదు. అందుకే ఉన్నకొద్దీ పెరుగుతున్న వేడి తప్ప నేను ఇంకేం పట్టించుకోలేదు.

ఒక నిముషం తర్వాత ప్రాసిక్యూటర్ కొద్దిసేపు వాదించకుండా నిశ్శబ్దంగా వుండిపోయాడు. తర్వాత చిన్నగా గాఢంగా వున్న గొంతుతో, "రేపు ఇదే న్యాయస్థానం అన్ని నేరాల్లోకి ఘోరాతిఘోరమైన నేరం, కొడుకు తండ్రిని హత్య చేసిన కేసును విచారించబోతోంది. అలాంటి నేరాన్ని ఊహించను కూడా ఊహించలేం. అయితే ఆ కేసులో ఎలాంటి తేడా లేకుండా న్యాయం జరుగుతుందని ఆశించడంలో తప్పులేదు. అయితే తండ్రిని హత్య చేయడం లాంటి అంత భయంకరమైన నేరం కూడా నిర్లక్ష్యంతో కూడిన అనుభూతి రహితమైన ఇతని ధోరణి ముందు వెలాతెలా పోతోంది. అతని తల్లి చనిపోవడానికి నైతికంగా ఇతను బాధ్యుడు. తండ్రిని చంపిన వ్యక్తికి సమాజంలో స్థానం లేనట్టుగానే ఇతనికి కూడా సమాజంలో ఎలాంటి స్థానం వుండకూడదు. నిజానికి ఒక నేరం రెండోదానికి దారితీస్తుంది. ఈ ఇద్దరు నేరస్తులలో బోనులో వున్న వ్యక్తి నేరానికి ముందుగా బాటవేశాడు. రెండోనేరం జరగడానికి అధికారికంగా అవకాశం ఇచ్చాడు. ఇది నేను పూర్తిగా నమ్ముతున్నాను. రేపు ఇదే న్యాయస్థానంలో విచారణ జరగబోయే కేసుకు కూడా ఇతనే బాధ్యత వహించాలని చెప్పడంలో ఖైదీ నేరాన్ని నేను ఎక్కువచేసి చెబుతున్నానని మీరు అనుకోవాల్సిన అవసరం లేదు. అది నిజం. దానిని

దృష్టిలో పెట్టుకుని మీరు తీర్పు ఇవ్వగలరని కోరుతున్నాను."

ప్రాసిక్యూటర్ నుదుటిన పట్టిన చెమటను తుడుచుకోవడానికి మరోసారి ఆగాడు. తర్వాత మాట్లాడుతూ నిజానికి తను చేస్తున్న పని తనకు చాలా బాధాకరంగా వుందని అయితే విధి నిర్వహణ కోసం సంకోచపడకుండా ఈ పని చేస్తున్నట్లు ఆయన చెప్పాడు.

"మానవ జాతి ప్రాథమిక సూత్రాలను ఈ మనిషి తిరస్కరిస్తాడు. వెక్కిరిస్తాడు. పశ్చాత్తాపం అనేదే ఎరగడు. అలాంటి వ్యక్తికి ఈ సమాజంలో స్థానం లేదు. అతను ఎంత హృదయం లేనివాడంటే ఎలాంటి దయను ఆశించడానికి కూడా అర్హత లేనివాడు. చట్టప్రకారం ఇతనికి భయంకరమైన శిక్ష విధించాలని నేను కోరుతున్నాను. ఎలాంటి బాధ, పరితాపం లేకుండా అతనికి శిక్ష విధించవచ్చు. చాలాకాలంగా నా వృత్తిలో భాగంగా నేను కఠినమైన శిక్ష విధించాలని చాలా కేసుల్లో కోరి వున్నాను. అయితే ఈ కేసుకన్నా ఆ కేసులేవీ నా మనస్సును అంతగా బాధించలేదు. యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనగా భావించకుండా ఇతనికి మరణ శిక్ష విధించాలని గట్టిగా కోరుతున్నాను. ఈ విషయంలో నేను నా అంతరాత్మ ప్రబోధాన్ని పాటించడమే కాదు దాన్ని నా పవిత్రమైన ధర్మంగా భావిస్తున్నాను. మనుషులకు వుండాల్సిన ఎలాంటి అనుభూతులు లేని నేరపూరితమైన స్వభావంగల ఈ మనిషిపై సహజమైన, న్యాయబద్ధమైన ఆగ్రహంతో నేను ఈ కోరిక కోరుతున్నాను."

ప్రాసిక్యూటర్ కూర్చొనగానే చాలసేపు కోర్టులో నిశ్శబ్దం రాజ్యమేలింది. వాతావరణంలో వేడితో ఓ పక్క వుక్కిరిబిక్కిరై పోతున్న నేను ఈ వాదనతో పూర్తిగా ఆశ్చర్యంలో మునిగిపోయాను. ప్రధాన న్యాయమూర్తి ఒకసారి చిన్నగా దగ్గి చిన్న గొంతుతో నేను చెప్పుకోవలసినది ఏదన్నా వుందా అని అడిగాడు.

నేను లేచి నిలబడ్డాను. నేను అప్పుడు మాట్లాడాలనే ఉద్దేశంతో కూడా వున్నాను. నా మనస్సులో మొదటగా తట్టిన మాట "అరబ్బుని చంపాలని నేను అనుకోలేదు" ఆ మాటనే న్యాయమూర్తికి చెప్పాను. ఈ విషయాన్ని కోర్టు పరిగణనలోకి తీసుకుందని న్యాయమూర్తి సమాధానమిచ్చాడు. నేను నేరం చేయడానికి ఉన్న వుద్దేశాలను గురించి న్యాయవాది కోర్టుకి ముందే వివరించాడని నిజానికి నేరానికి దారి తీసిన పరిస్థితులను గురించి ఇంతవరకూ తనకు ఒక అవగాహన రాలేదని ఆయన అన్నాడు. హత్యకు దారితీసిన పరిస్థితుల నేపథ్యం కూడా తనకు అర్థం కాలేదని ఆయన అన్నాడు. భరించలేనంత ఎండ, వేడిమి కారణంగా హత్య జరిగిందని నేను చెప్పడానికి ప్రయత్నించాను. అయితే నేను గబగబా మాట్లాడడంతో మాటలు ఒకదానిపై ఒకటి దొర్లిపడి సరిగా అర్థం కాకుండా పోయాయి. పైగా ఆ కారణం చాలా అసందర్భంగా ఉందని నాకే తట్టింది. నిజానికి కోర్టులోని వారు నవ్వుకోవడం కూడా నాకు వినిపించింది.

మా న్యాయవాది భుజాలు ఎగురవేశాడు. అతను తన వంతు వాదనను వినిపించాలని కోర్టు ఆదేశించింది. అయితే అప్పటికే సమయం మించిపోయిందని, కేసును మర్నాటి మధ్యాహ్నం వరకూ వాయిదా వేయాలని కోరడం తప్ప అతను ఇంకేం చేయలేకపోయాడు. దీనికి న్యాయస్థానం అనుమతించింది.

మర్నాడు నన్ను కోర్టుకి తీసుకువచ్చేసరికి ఎలక్ట్రిక్ ఫ్యాన్లు గదిలో ఉన్న వేడిగాలిని చెల్లా చెదురుచేస్తున్నాయి. న్యాయమూర్తులు వాళ్ళ చేతుల్లోని విసనకర్రలతో విరామం లేకుండా విసురుకొంటున్నారు. మా న్యాయవాది వాదన అంతూ పొంతూ లేకుండా సుదీర్ఘంగా సాగింది. ఒకసారి మాత్రం నేను ఆయన వాదనపై దృష్టి పెట్టాను.

"అవును నిజమే. నేను ఒక వ్యక్తిని హత్య చేశాను" అంటున్నాడు. నా గురించి చెబుతూ తనే చేసినట్టు 'నేను' 'నేను' అంటూ అదే ధోరణిలో మాట్లాడుతున్నాడు. అతని మాటల ధోరణి నాకు వింతగా అనిపించింది. నేను నా కుడివైపున వున్న పోలీసు వైపు వంగి దాని గురించి అడిగాను. అతను నన్ను నోరు మూసుకోమని కసిరాడు. కాసేపాగి గుసగుసగా "వాళ్ళంతా అలాగే మాట్లాడుతారు" అన్నాడు.

ఈ కేసు నుంచి నన్ను ఇంకా దూరం చేయడానికి ఇది కూడా ఒక మార్గమేమోనని నాకు అనిపించింది. న్యాయస్థానపు పటం నుంచి నన్ను దూరంగా పెట్టడానికే న్యాయవాది నాకు ప్రత్యామ్నాయంగా మారాడని అనిపించింది. అయినా అదేమంత పెద్ద విషయం కాదు. నేను అప్పటికే ఈ కోర్టుహాలు నుంచీ, విసుగెత్తించే విచారణ నుంచీ తప్పించుకుని వేరే ప్రపంచంలోకి అడుగుపెట్టేసి ఉన్నాను.

మా న్యాయవాది నాకు ఎందుకో బలహీనంగా కనిపించాడు. ప్రభుత్వ ప్రాసిక్యూటర్ చెప్పిన దానికి వ్యతిరేకంగా ఆయన తన వాదనను ప్రారంభించాడు. ఆయన కూడా నా 'ఆత్మ' నుంచే వాదనను మొదలుపెట్టాడు. అయితే ప్రభుత్వ ప్రాసిక్యూటర్ కన్నా మా న్యాయవాది ప్రతిభాసామర్థ్యాలు చాలా తక్కువగా వున్నాయని నాకు అనిపించింది.

"నేను కూడా ఈ మనిషి ఆత్మను నిశితంగా అధ్యయనం చేశాను. అయితే నా మిత్రుడైన ప్రభుత్వ ప్రాసిక్యూటర్ చెప్పినట్టు కాకుండా నాకు అక్కడ కొంత కనిపించింది. నిజానికి నేను ఖైదీ మనస్తత్వాన్ని తెరచి వున్న పుస్తకం మాదిరిగా చదివాను. నేను చదివిన ప్రకారం అతను ఒక అద్భుతమైన యువకుడు. నెమ్మదైన, చక్కటి చైతన్యం కలిగిన ఉద్యోగి. యజమానికి ఉపయోగపడేందుకు శాయశక్తులా కృషి చేసే వ్యక్తి. అతను అందరితో మంచిగా మెలుగుతాడు. ఇతరుల కష్టాలకు సానుభూతితో స్పందిస్తాడు. అతను బాధ్యతాయుతమైన కొడుకు కూడా. తనకు చాతనైనంతవరకూ తల్లి బరువు బాధ్యతలు మోశాడు. ఎంతో ఆలోచించి వృద్ధురాలైన తల్లి తన దగ్గర వుండేదానికన్నా వృద్ధాశ్రమంలో ఉంటేనే ఎక్కువ సౌకర్యాలు అమరుతాయని భావించి

తన ఆదాయం అందుకు ఏ మాత్రం సరిపోకపోవడంతో తల్లిని వృద్ధాశ్రమంలో చేర్చాడు. ఈ వృద్ధాశ్రమం గురించి - మిత్రుడు వ్యక్తం చేసిన అభిప్రాయం నన్ను ఆశ్చర్యానికి గురిచేస్తోంది. అలాంటి సంస్థల గొప్పదనం తెలుసుకోవడానికి సాక్ష్యం కావాలంటే అవి ప్రభుత్వం అందజేసే ఆర్థిక సహాయంతో, ప్రభుత్వ ప్రోత్సాహంతో నడవడమే దానికి నిదర్శనం" అని అతను అన్నాడు.

మా అమ్మ అంత్యక్రియలకు సంబంధించిన ప్రస్తావనను న్యాయవాది అసలు తీసుకురాలేదు. అది ఘోరమైన పొరబాటని నాకు అనిపించింది. అయితే ఆయన చేసిన సుదీర్ఘ ఉపన్యాసం, నా ఆత్మ గురించి రోజుల తరబడి, గంటల తరబడి వాళ్ళు చేసిన చర్చలు వ్యాఖ్యానాలతో నా బుద్ధికి మసకేసినట్టయింది. కళ్ళముందు ఏదో పొగమంచు కమ్మినట్టు అంతా అస్పష్టంగా అనిపిస్తోంది.

ఒక్క సంఘటన మాత్రం బాగా గుర్తుంది. చివరిలో మా న్యాయవాది వాదన ముగుస్తున్న సమయంలో వీధిలో నుంచి ఐస్‌క్రీమ్ బండివాడి గంట, కోర్టులోని మాటల ప్రవాహం మధ్యలో అతని కీచు గొంతుక స్పష్టంగా వినిపించి అలా గుర్తుండిపోయింది. అదే సమయంలో నా మనస్సులోకి ఒక్కసారిగా రకరకాల జ్ఞాపకాలు దూసుకువచ్చాయి. నా జీవితానికి సంబంధించిన ఆ జ్ఞాపకాలు ఇంక ఏ మాత్రం నావి కావు. ఒకప్పుడు నన్ను ఆనందంతో ముంచెత్తినవేవీ ఇంక నావి కావు. నులివెచ్చని వేసవి వాసనలు, నాకు ఇష్టమైన వీధులు, సాయంసమయాల్లోని అందమైన ఆకాశం, మేరీ దుస్తులు, చక్కటి ఆమె నవ్వు - ఇక వీటితో నాకు సంబంధం లేదు. ఇక్కడ జరుగుతున్న వ్యవహారాలు, వ్యర్థ చర్చలు చూస్తుంటే గొంతుకు ఏదో అడ్డు పడ్డట్టయింది. కడుపులో తిప్పుతున్నట్లుగా వాంతి వస్తున్నట్లు అనిపించింది. ఆక్షణంలో నా మనస్సులో ఒకే ఒక ఆలోచన వుంది. ఇదంతా అయిపోనీ... ఇదంతా పూర్తయినాక నేను జైల్లోని నా గదికి వెళ్ళిపోయి నిద్రపోవాలి.... నిద్ర... కరువుదీరా నిద్రపోవాలి. అలాంటి స్థితిలోనే నా తరపు న్యాయవాది కోర్టుకు విన్నవించుకుంటున్న తుది విజ్ఞప్తి చెవుల్లో పడింది.

"విజ్ఞత తెలిసిన న్యాయమూర్తులరా! ఒక చక్కటి కష్టపడే స్వభావం ఉన్న మంచి యువకుడిని తనపై తనకు అదుపు లేకపోవడం వల్ల జరిగిన విషాద సంఘటన కారణంగా మృత్యుదేవతకు సమర్పిస్తారా? జీవితాంతం అతను పడే పశ్చాత్తాపమే అతనికి సరైన శిక్ష అని మీరు భావించటం లేదా? మీ తీర్పుకోసం, అనుకోని పరిస్థితుల్లో యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనగా భావించి ఈ హత్యానేరంలో మీరు ఇచ్చే విజ్ఞత నిండిన తీర్పు కోసం నేను వేచిచూస్తున్నాను" అని ఆయన ముగించాడు.

కోర్టులోని వారందరూ లేచి నిలబడ్డారు. అలసిపోయిన మా న్యాయవాది కుర్చీలో కూలబడ్డాడు. అతని సహోద్యోగులు కొందరు అతని దగ్గరకు వచ్చి కరచాలనం చేసి,

"నువ్వు చాలా బాగా వాదించావు" అంటూ అభినందిస్తున్నారు. ఇంకో న్యాయవాది నా సాక్ష్యం అడుగుతున్నట్టుగా నావంక చూస్తూ "బాగా వాదించాడు కదూ" అన్నాడు. నేను తప్పనిసరై మొహమాటంతో అవునన్నట్టు తలాడించాను. అతని ప్రసంగం బాగుందా లేదా అని కూడా ఆలోచించలేనంతగా నేను అలసిపోయి వున్నాను.

అప్పటికి సాయంత్రం కావస్తోంది. ఎండ తీవ్రత కూడా తగ్గుముఖం పట్టింది. వీధులనుంచి అందిన కొన్ని అస్పష్టమైన సంకేతాల ద్వారా సాయంకాలపు చల్లదనం పరచుకున్నట్టు నేను అర్థం చేసుకున్నాను. మేం అందరం తీర్పు కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాం. నిజానికి అది అందరి కన్నా ఎక్కువగా నాకే ఒక్క నాకే సంబంధించినది. నేను కోర్టు గది అంతా కలయజూశాను. అది మొదటి రోజు ఎలా వుందో ఇప్పుడూ అలాగే వుంది. నేను ఆ జర్నలిస్టు యువకుడు, కుందేలు లాంటి అమ్మాయి కళ్ళల్లోకి చూశాను. అలా చూస్తుంటే, విచారణ జరిగిన అన్ని రోజుల్లో నేను ఒక్కసారి అంటే ఒక్కసారి కూడా మేరీ వైపు చూడలేదని గుర్తొచ్చింది. అది ఆమెను మర్చిపోవడం వల్ల జరిగింది కాదు. నా మనసంతా రకరకాల ఆలోచనలతో నిండి పోవడం వల్ల జరిగింది. ఇప్పుడు ఆమెను చూశాను. రేమాండ్, సెలెస్టిల మధ్యన కూర్చొని వుంది.

నన్ను చూడగానే ఆమె చిన్నగా చెయ్యూపి "చివరకు" అన్నట్టు అర్థం వచ్చేలా నవ్వింది. ఆమె నవ్వుతున్నప్పటికీ ఆమె ఎంతో ఆందోళనగా ఉద్విగ్నంగా వున్నట్టు నాకు అర్థమయింది. అయితే నా హృదయం మాత్రం కదలని బండరాయిలా మారిపోయింది. ఆమె నవ్వుతుంటే కనీసం తిరిగి నవ్వడం కూడా చేయలేకపోయాను.

న్యాయమూర్తులు తమ స్థానాల్లోకి తిరిగివచ్చారు. ఒకతను న్యాయమూర్తికి చాలా వేగంగా ప్రశ్నల పరంపర చదివి వినిపిస్తున్నాడు. నాకు అక్కడోముక్క అక్కడో ముక్క అర్థమయింది. విద్రోహపూరితమైన హత్య... రెచ్చగొట్టడం.. అదుపు తప్పి యాదృచ్ఛికంగా జరిగిన సంఘటన... అలా కొనసాగుతూ వుండగానే నన్ను కోర్టు గదికి, ఆనుకుని వున్న చిన్న గదిలోకి తీసుకువెళ్ళారు. మా న్యాయవాది నా దగ్గరకు వచ్చాడు. అతను చాలా ఉత్సాహంగా వున్నాడు. గడగడా మాట్లాడేస్తున్నాడు. అంతకు ముందుకన్నా నాతో స్నేహంగా మాట్లాడాడు. అంతకు ముందులేని ఆత్మవిశ్వాసం అతనిలో కనిపించింది. అంతా మంచిగానే జరగబోతోందని నేను కొద్ది సంవత్సరాల జైలుశిక్షతోనో, దేశాంతరవాస శిక్షతోనో తప్పించుకోవచ్చని అతను చెప్పాడు. శిక్ష రద్దు చేయడానికి ఏమైనా అవకాశాలున్నాయా అని నేను అతన్ని అడిగాను. దానికి అవకాశంలేదని అతను చెప్పాడు. తాను చట్టపరంగా ఎలాంటి అంశాలను ప్రస్తావించలేదని అందువల్ల న్యాయమూర్తులకు కేసుపై అంత ప్రతికూల అభిప్రాయం వుండకపోవచ్చని అతను అన్నాడు. సాంకేతిక పరమైన అంశాలపై తప్ప శిక్ష రద్దు అయేలా తీర్పు రావడం

కష్టమని అతను వివరించాడు. అతను చెప్పిన దానితో నేను ఏకీభవించాను. "ఏది ఏమైనా నువ్వు సాధారణమైన పద్ధతిలో ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేసుకోవచ్చు. అయితే తీర్పు మనకు అనుకూలంగా రావచ్చు అనుకుంటున్నాను" అని అతను చెప్పాడు. మేం చాలా సేపు వేచి ఉన్నాం. దాదాపు ముప్పావుగంట పాటు వేచి ఉన్న తర్వాత గంట మోగింది. మా న్యాయవాది లేచి వెళుతూ "న్యాయమూర్తుల్లో ఒకరు సమాధానాలు చదువుతారు. తీర్పు వినడానికి తర్వాత నిన్ను పిలుస్తారు" అని చెప్పాడు.

తలుపులు తెరిచిన శబ్దం అయింది. హాల్లో ఉన్న వాళ్ళు గబగబా మెట్లు దిగుతున్న చప్పుడు వినిపించింది. అయితే అవి దూరంగా ఉన్నాయో, దగ్గరగా ఉన్నాయో నాకు తెలియలేదు. గంట మళ్ళీ మోగినప్పుడు నన్ను తిరిగి బోనులో నిలబెట్టారు. కోర్టు హాల్లోని నిశ్శబ్దం నా చుట్టూరా అలముకొన్నట్టనిపించింది. ఆ నిశ్శబ్దం నాకు ఒక విచిత్రమైన అనుభూతిని కలిగించింది. మొదటి సారి ఆ జర్నలిస్టు యువకుడు నా వైపు నుంచి చూపులు మళ్ళించాడు. నేను మేరీ ఉన్న వైపు చూడలేదు. ప్రధాన న్యాయమూర్తి తీర్పు చెప్పడం మొదలు పెట్టడంతో నిజానికి ఆవైపు చూడడానికి కూడా నాకు సమయం చాలలేదు. అతని అర్ధహీనమైన మాటల సారాంశం... ఫ్రెంచి ప్రజల పేరిట నన్ను ఏదైనా ఒక బహిరంగ ప్రదేశంలో శిరచ్ఛేదం చేయడం. అక్కడున్న వారందరి మొహాలపై అప్పుడు కనిపించిన భావాన్ని నేను గమనించాను. అది ఒక గౌరవప్రదమైన సానుభూతి. పోలీసులు కూడా మృదువుగా వ్యవహరించారు. మా న్యాయవాది నా చేయిపై తనచేతిని ఉంచాడు. నేను అప్పటికే ఆలోచించటం మానేశాను. చెప్పుకోవడానికి ఏదైనా ఉందా అని నన్ను అడుగుతున్న న్యాయమూర్తి గొంతు నాకు వినిపించింది. నేను ఒక్క నిముషం పాటు ఆలోచించి 'లేదు' అని సమాధానమిచ్చాను. పోలీసులు నన్ను బైటకు తీసుకు వెళ్ళిపోయారు.

# 5

జైలు మతాధికారిని చూడడానికి వరుసగా మూడోసారి నేను నిరాకరించాను. నేను అతనికి చెప్పడానికి ఏమీ లేదు. అతనితో మాట్లాడాలని కూడా లేదు. అయినా అతన్ని నేను త్వరలోనే చూడక తప్పదు. ఇప్పుడు నాకు ఆసక్తి కలిగిస్తున్న విషయం ఒకటే ఒకటుంది. అది యంత్రాన్ని మోసం చేయగల తంత్రం గురించి. ఏదన్నా తప్పించుకునే ఉపాయం దొరుకుతుందా అని.

వాళ్ళు నన్ను ఇంకో గదికి మార్చారు. ఈ గదిలో నేను వెల్లికిలా పడుకుని ఆకాశం వంక చూడగలను. అది తప్ప చూడడానికి ఇంకేమీ లేదు. పగలు గడిచి రాత్రి అయ్యే లోపల ఆకాశం నిదానంగా మార్చుకునే రంగుల్ని గమనించడమే ఇప్పుడు నా ప్రధాన

దినచర్య. చేతులు తల కింద పెట్టుకుని పడుకుని చూడడం, వేచి ఉండడం ఇదే నా పని.

ఉరి శిక్షనుండి తప్పించుకోవడం అనే విషయం నన్ను వేధిస్తోంది. ఉరి పడబోయే ముందు ఆఖరి నిముషంలో ఏ ఖైదీ అయినా తప్పించుకున్న సందర్భాలు ఇంతకు ముందు ఏమన్నా ఉన్నాయా అనే ఆలోచన నాకు పదే పదే కలగ సాగింది. బహిరంగ ఉరి శిక్షల గురించి అంతకు ముందు అంత శ్రద్ధ పెట్టకపోవడంపై నన్ను నేను చాలా సార్లు నిందించుకున్నాను. ప్రతి ఒక్కరూ అలాంటి విషయాలను ఆసక్తిగా తెలుసుకుని ఉండాలి. ఎప్పుడు ఏ అవసరం వస్తుందో తెలీదు. అందుకే తెలియనిది అంటూ ఎప్పుడూ ఏదీ ఉండకూడదు. మిగితా అందరిలాగానే నేను కూడా పత్రికల్లోని ఉరిశిక్షల వర్ణనలు చదవటం మొదలు పెట్టాను. అయితే ఈ అంశానికి సంబంధించిన సాంకేతిక పరమైన పుస్తకాలు కూడా ఉండి ఉండవచ్చని నాకు అనిపించింది. అప్పట్లో అదంటే నాకు అంత ఆసక్తి లేకపోవడం వల్ల వాటిని చదివి ఉండను. ఈ పుస్తకాల్లో తప్పించుకున్న కథలు ఉండి ఉండొచ్చు. ఒకసారి ఒక కేసులో ఇలాగే చక్రాలు తిరగడం ఆగిపోయాయని వాళ్ళు చెప్పారు. ఒక్కసారి ఒకే ఒక్కసారి మాత్రమే నిర్దాక్షిణ్యమైన ఆ సంఘటనల పరంపరలో అదృష్టం ఒక సంతోషకరమైన ముగింపు ఇచ్చింది. ఒకే ఒక్కసారి అయినా ఆ ఒక్క సంఘటనే నాకు సరిపడా తృప్తిని కలిగించింది. నా ఉద్వేగం మిగిలిన పనిని పూర్తి చేసింది. పత్రికలు అప్పుడప్పుడు 'సమాజానికి బాకీ ఉన్న రుణం' అంటూ వార్తలు రాస్తున్నాయి. ఆ రుణాన్ని వాళ్ళ ఉద్దేశం ప్రకారం నేరస్థుడు తప్పక చెల్లించాలి. అలాంటి రకమైన మాటల వల్ల ఏం ప్రయోజనం ఉండదు. అలాంటిది చదివినప్పుడల్లా నాకు వాటన్నిటికీ స్వస్తి పలికేలా చేసే అవకాశం ఏదన్నా ఉందా అనిపించేది. స్వేచ్ఛకోసం బలమైన కోర్కె నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేది. ఏదన్నా జరక్కపోతుందా అనే క్షణమాత్రపు ఆశ నన్ను ఆవరించింది. అయితే అలాంటి ఆశ కూడా వీధి చివర ఆగిపోయింది. నా వీపులో బుల్లెట్ దిగనే దిగింది. ఆలోచించి చూస్తే నాకు ఈ తప్పించుకునే ఆశ కూడా అందని చందమామ అనిపించింది. తప్పించుకోలేని విధంగా ఎలుకల బోనులో పడిపోయాను.

అయినా సాధ్యమైనంత వరకూ ప్రయత్నించాలి అనుకున్నాను. ఈ దుర్మార్గమైన శిక్ష నాకు ఇంకా జీర్ణం కావడం లేదు. నిజానికి తీర్పులో ఏదో అసమతౌల్యం ఉందని ఆలోచించిన ఎవరికైనా అనిపించక మానదు. తీర్పు ఇవ్వడానికి దారి తీసిన సంఘటనలకు తీర్పు ఇచ్చిన తక్షణం నుంచి జరుగుతున్న సంఘటనలకు మధ్య స్పష్టంగా కనిపించేంత అసమతౌల్యం ఉంది. తీర్పు సాయంత్రం ఐదింటికి కాక ఎనిమిదింటికి చదివారు. అంతకు ముందు జరిగిన దానికి ఇది చాలా భిన్నంగా ఉంది. అంతే కాక ఈ తీర్పును

చాలా అస్పష్టంగా 'ఫ్రెంచి ప్రజలకు' ఉద్దేశించి అంటూ చెప్పడం జరిగింది. ఆ మాటకు వస్తే చైనీస్ వారికో, జర్మన్ ప్రజలకో ఉద్దేశించి ఎందుకు ఉండకూడదు? ఈ అన్ని వాస్తవాలు కలగలిపి కోర్టు ఇచ్చిన తీర్పులోని సాంద్రతను తగ్గించాయి. అయితే తీర్పు వెలువడినప్పటి నుంచీ దాని ప్రభావం చాలా బలంగా, ప్రత్యక్షంగా స్పష్టంగా తెలియడం మొదలయింది. ఎంత బలంగా అంటే ఇప్పుడు నేను పడుకున్న గోడ నా వీపును తాకుతున్నంత బలంగా దాని ప్రభావం తెలుస్తోంది.

అలాంటి ఆలోచన నా మనసులో మెదిలినప్పుడల్లా నాన్న గురించి అమ్మ ఎప్పుడూ చెప్పే విషయం ఒకటి జ్ఞాపకం వస్తూ ఉండేది. నేను నాన్నను ఎప్పుడూ చూడలేదు. నాకు ఆయన గురించి తెలిసిందల్లా అమ్మ చెప్పే మాటల ద్వారానే. వాటిల్లో ఒకటి ఏంటంటే ఒక సారి ఆయన ఒక హంతకుడిని ఉరివేయడాన్ని ప్రత్యక్షంగా చూశాడు. ఆ ఆలోచన వచ్చిందంటే చాలు ఆయన వాంతి చేసుకునేవాడు. ఆ సంఘటన చూసిన తర్వాత ఆయన ఇంటికి వచ్చి తీవ్రంగా జబ్బు పడ్డాడు. మా నాన్న ప్రవర్తన మరీ వింతగా ఉందని అప్పుడు నేను అనుకునేవాడిని. కానీ ఇప్పుడు నాకు అది అర్థం అయింది. అది అత్యంత సహజం. ఉరి తీయడం కంటే ముఖ్యమైన విషయం ఇంకోటి ఉండదని గుర్తించడంలో నేను ఎందుకు విఫలం అయ్యాను? ఇంకో కోణంలో చూస్తే ఒక మనిషికి నిజంగా ఆసక్తి కలిగించే విషయం ఇదొక్కటే అనిపించింది. ఒకవేళ నేను కనుక జైలు నుంచి బైట పడితే ప్రతి ఉరిశిక్షకు తప్పక హాజరుకావాలని నిర్ణయించు కున్నాను. ఈ విషయం ఆలోచించడంలో కూడా నేను సాధ్యాసాధ్యాలను పట్టించుకో లేనంత అవివేకంగా ఉన్నాను అనిపించింది. ఒక్క క్షణం పాటు స్వేచ్ఛగా ఉన్నట్టు ఊహించుకున్న వెంటనే ఒక దృశ్యం నా కళ్ళ ముందు కనిపించింది. రెండు వరుసలుగా నిలబడిన పోలీసుల వెనుకగా కుడివైపున ఈ ప్రదర్శనను చూడడానికి వచ్చిన జనంలో నేను కూడా ఉండడం ఉరి శిక్షచూసిన తర్వాత ఇంటికి వెళ్ళి వాంతి చేసుకోవడం లాంటి విచిత్రమైన ఊహలు కాసేపు నన్ను చుట్టుముట్టాయి. అలాంటి పిచ్చి ఊహలకు అవకాశం కలిగేలా నా మనసును స్వేచ్ఛగా వదిలేయడం వట్టి మూర్ఖత్వమని నాకు తెలుస్తూనే ఉంది. ఒక్క క్షణం తర్వాత నాకు వెన్నులో వణుకు లాంటిది పుట్టింది. దానితో నేను దుప్పటినిలాగి పూర్తిగా ముసుగేసుకున్నాను. కానీ నా పళ్ళు టకటకా కొట్టుకోవడం ఆరంభించాయి. ఏదీ దాన్ని ఆపలేకపోయింది. అయితే నిజానికి ఏ మనిషీ అన్ని సమయాల్లో వివేకంగా ఉండలేడు. ఇంకో పరిహాసాస్పదమైన ఊహ ఏంటంటే కొత్త చట్టాలను రూపొందించడం. శిక్షలను మార్చడం. నేను అనుకుంటున్నది ఏమిటంటే నేరస్థుడికి ఒక అవకాశం ఇవ్వడం. ఒక కుక్కకు ఉన్నంత అవకాశాన్ని అయినా ఇవ్వడం. అంటే వెయ్యింటిలో ఒక్క అవకాశాన్ని ఇవ్వడం.

ఏదన్నా ఒక మాత్రను కానీ, లేదా కొన్ని మాత్రలను కానీ ఇచ్చి రోగిని చంపడం (అతన్ని నేను రోగి అని ప్రస్తావించాను). వెయ్యిలో తొమ్మిదివందల తొంభై వరకూ రోగిని చంపేశేలా మందులు ఇవ్వడం. ఇది తప్పనిసరని రోగి తెలుసుకోవాలి. నిదానంగా కాసేపు ఈ విషయం గురించి ఆలోచించగా ఉరిశిక్షలో ఉన్న తప్పు అల్లా అందులో నేరస్థుడికి ఎలాంటి అవకాశం ఉండకపోవడమే అని నాకు అనిపించింది. రోగి మరణించడం అనేది ఎటుతిరిగీ తథ్యం. అందులో తిరుగులేదు. అది ముందే నిర్ణయమయిపోయిన ముగింపు. ఏదైనా కారణం చేత కత్తి పని చేయలేక పోతే తిరిగి పని ప్రారంభిస్తారు. ఈ విషయంలోనైనా అంతే. శిక్ష అనుభవించే వ్యక్తి పరికరాలు చక్కగా పనిచేసేలా ఉండాలని కోరువాలి. ఈ పద్ధతిలో ఇదే లోపం అని నాకు అనిపించింది. ఈ విషయంలో నా అభిప్రాయం కూడా సరైనదేనని నేను అనుకున్నాను. అయితే ఇది వ్యవస్థ యొక్క సామర్థ్యాన్ని నిరూపిస్తోందని నేను అంగీకరించక తప్పదు. శిక్షని అనుభవించే వ్యక్తి దానికి మానసికంగా సంసిద్ధుడై ఉండి మానసికంగా సహాయపడేలా ఉండాలి. ఎందుకంటే ఏ చిక్కు తలెత్తకుండా అంతా సాఫీగా జరిగిపోవడం అతని మంచి కోసమే. నేను గుర్తించిన ఇంకో విషయం ఏమిటంటే ఇంతవరకూ నేను ఉరితీయడం పైన అన్నీ తప్పుడు అభిప్రాయాలే కలిగి ఉన్నాను. ఉరి మెడకు బిగించుకోవడానికి మెట్లు ఎక్కి ఉరికంబం దగ్గరకు వెళ్ళాలని నేను భావిస్తూ ఉండేవాడిని. బహుశా అది 1789 విప్లవం వల్ల అనుకుంటాను. స్కూల్లోనూ, నేను చూసిన సినిమాల ద్వారానూ ఆ అభిప్రాయం ఏర్పరుచుకున్నాను. అయితే ఒక రోజు ఒక ప్రముఖ నేరస్థుడిని ఉరితీసిన ఫోటోను పత్రికలు ప్రచురించడం నాకు అకస్మాత్తుగా గుర్తుకు వచ్చింది. వాస్తవానికి ఆ పరికరాన్ని నేలపై ఉంచారు. అది అంత ఇదిగా మనసుపై ముద్ర పడేలాగ ఏమీ లేదు. నేను ఊహించుకున్నదాని కన్నా చాలా చిన్నగా ఉంది. ఈ చిత్రం ఇంత వరకూ నాకు గుర్తుకు రాకపోవడం అసందర్భంగా అనిపించింది. ఆ సమయంలో నేను గిలెటన్ యంత్రం చూపులకు శుభ్రంగా ఉన్న విషయంపైనే దృష్టి పెట్టాను. మెరుస్తున్న దాని ఉపరితలం, దాన్ని తీర్చిదిద్దిన తీరు చూస్తే ఏదో ప్రయోగశాలలోని పరికరాన్ని గుర్తుకు తెచ్చేలా ఉంది. నిజానికి మనకు తెలియని దాన్ని గురించి గోరంతలు కొండంతలుగా ఊహించుకోవడం చేస్తాం. ఇప్పుడు నాకు అర్థమయింది. ఉరిశిక్ష అనేది చాలా సులువైన పద్ధతని అంగీకరించక తప్పదు. యంత్రం కూడా మనిషి ఉన్నంత ఎత్తులోనే ఉంటుంది. దాని వైపు కొన్ని అడుగులు వేస్తే అక్కడ అందిరికీ తెలిసిన వ్యక్తి ఒకడుంటాడు. అయితే, అది కూడా నిరుత్సాహం కలిగించే విధంగానే ఉంది. నిజానికి ఉరికంబం ఎక్కడానికి పైకి వెళ్ళి ప్రపంచాన్ని కిందకి వదిలేయడమనేది ఒక రకంగా ఊహించుకోవడానికి కూడా బాగుంటుంది.

అయితే ఆ పరికరం ఉన్నది ఉన్నట్టుగానే ఎలాంటి మార్పులు అవసరం లేకుండానే అన్నిటిపై ఆధిపత్యం చెలాయించగలదు. అది నిన్ను విచక్షణారహితంగా చంపుతుంది. మానవ జాతికి సిగ్గు, అవమానం కలిగేలా చంపుతుంది. అందులోనూ అత్యంత సమర్ధవంతంగా ఆపని చేస్తుంది.

నేను ఎక్కువగా ఆలోచించే విషయాలు ఇంకో రెండున్నాయి. ఒకటి ఉదయం గురించి, రెండు ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేయడం గురించి. అయితే నేను చాలా వరకు నా మనసును ఇలాంటి ఆలోచనలకు దూరంగా ఉంచుతున్నాను. వెల్లకిలా పడుకుని ఆకాశం వంక చూస్తూ దాన్ని అధ్యయనం చేయడం ఒక్కటే నేను చేస్తున్న పని. కాంతి ఆకుపచ్చగా మారిందంటే దాని అర్ధం రాత్రి అవబోతుందన్న మాట. నేను చేసే ఇంకో పని, నా గుండె చప్పుడుని వినడం. వినిపించీ వినిపించనట్టుగా సన్నగా ఈ గుండె చప్పుడు నన్ను ఎంతో కాలం నుంచి అంటుపెట్టుకుని ఉంది. అది ఎప్పుడైనా ఆగిపోతుందనేది నా ఊహకు కూడా అందని విషయం. ఊహలకు సంబంధించి నాకు ఎప్పుడూ అంత ప్రావీణ్యం లేదు. అయినప్పటికీ నా గుండె చప్పుడు నా తలలో ప్రతిధ్వనించని క్షణం ఎలా ఉంటుందో ఆ దృశ్యాన్ని నేను ఊహించుకోవడానికి ప్రయత్నించాను. కాని ఫలితం లేకపోయింది. ఇంక ఉదయం అవటం ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేయడం గురించి ఆలోచించాల్సింది ఎటూ ఉంది. ఒకరి ఆలోచనలను బలవంతంగా ఇంకో వైపు దారి మళ్ళించడం అనవసరమని నాకు అనిపించడంతో ఊహలకు స్వస్తి చెప్పాను.

వాళ్ళు ఎప్పుడూ తెల్లవారు జామునే వస్తారు. ఆ విషయం నాకు తెలుసు. అందుకే నా రాత్రులన్నీ ఆ ఉదయం కోసం ఎదురు చూడడంలోనే గడిచిపోయేవి. నన్ను ఏదైనా ఆశ్చర్యంలో ముంచెత్తడం అనేది నాకు అంత ఇష్టం ఉండదు. నాకు ఏదైనా జరుగబోతున్నప్పుడు నేను దాని కోసం సిద్ధంగా ఉండాలి. అందుకే నేను పగలు ఎక్కువగా నిద్రపోవడాన్ని అలవాటు చేసుకున్నాను. రాత్రంతా ఆ కళ్ళు పొడిచే చీకటిలోకి తొంగి చూస్తూ వెలుగు రేకలు ఎప్పుడు విచ్చుకుంటాయా అని నిద్రపోకుండా ఉండిపోయేవాడిని. ఇక తెల్లవారుతుందనగా అత్యంత దుర్భరంగా అనిపించే సమయం ఒకటి ఉంది. అది సాధారణంగా వాళ్ళు ఎప్పుడూ వచ్చే సమయం. అర్ధరాత్రి దాటిన తర్వాత ఎప్పుడైనా వాళ్ళు రావచ్చు. ఆ శబ్దం కోసం నేను చెవులు రిక్కించుకుని ఎదురు చూస్తుండేవాడిని. అంతకుముందు నా చెవులు ఎప్పుడూ అంత చిన్న చిన్న శబ్దాలను గుర్తించగలిగేవి కాదు. అయితే ఒక రకంగా నేను అదృష్టవంతుడిని.

అట్లా ఎదురు చూసిన రోజుల్లో ఎప్పుడూ నేను ఆ అడుగుల చప్పుడు వినలేదు. అమ్మ ఎప్పుడూ అంటుండేది. ఒకరి జీవితం ఎంత దుర్భరంగా ఉన్నా కృతజ్ఞతలు

తెలియజేయడానికి వీలుగా ఏదో ఒక మంచి జరుగుతూనే ఉంటుందని. ప్రతి ప్రభాత సమయాన ఆకాశం ఎరుపెక్కి నా గదిని వెలుతురుతో నింపేసినప్పుడల్లా నేను ఆమెతో ఏకీభవిస్తూ ఉండేవాడిని. ఎందుకంటే నా గుండె చప్పుడుని ముక్కలు ముక్కలు చేసే ఆ అడుగుల చప్పుడు ఆ రోజుకి వినబడనందుకు. అయితే ఏ చిన్న చప్పుడు వినిపించినా తలుపు దగ్గరికి ఒక్క ఉదుటున వెళ్ళి చల్లటి ఆ కలప తలుపులకు చెవి ఆనించి వినేవాడిని. ఎంత శ్రద్ధగా ఆలకించేవాడినంటే నా గుండె వడివడిగా కొట్టుకునే చప్పుడు నా చెవులకు నాకే వినబడుతుండేది. కుక్క రొప్పుతుంటే వచ్చే శబ్దంలా ఉఛ్వాస నిశ్వాసాలు వేగంగా ఉండేవి. అయితే అదంతా ముగిసి పోయేది. నా గుండె ముక్కలయేది కాదు. అంతే కాదు నాకు ఇంకో ఇరవై నాలుగు గంటల సమయం లభించినట్టు అర్థం అయ్యేది.

ఇంక రోజంతా ఆలోచించుకోవడానికి నేను చేయాల్సిన అప్పీలు ఉండనే ఉంది గదా. ఉన్నత న్యాయస్థానానికి అప్పీలు చేస్తే రాబోయే ఫలితం ఎలా ఉంటుంది అనే విషయం గురించి ఎప్పుడూ రకరకాలుగా ఆలోచిస్తూ ఉండేవాడిని. ముందు కీడెంచి మేలెంచాలి అన్నట్టు నేను చేసిన అప్పీలు కొట్టి వేస్తే ఏమవుతుంది అన్న దగ్గర్నుంచీ ఆలోచించడం మొదలుపెట్టేవాడిని. అలా కొట్టి వేస్తే నేను చనిపోవాల్సి ఉంటుంది. బహుశా మిగిలిన వాళ్ళకన్నా తొందరగా చనిపోవాల్సి రావచ్చు. అయితే నాకు నేనే ఒక విషయాన్ని చెప్పుకుంటుండేవాడిని. జీవితం ఎలాగూ అంత విలువైనదేమీ కాదు. అనే విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఉండేవాడిని. ఇంకా విశాలంగా ఆలోచించి చూస్తే ఒక వ్యక్తి ముప్ఫయి ఏళ్ళకు చనిపోవడానికి డెబ్భై ఏళ్ళకు చనిపోవడానికి నిజానికి అంత తేడా ఏమీ లేదు. ఎందుకంటే ఆ వ్యక్తి చనిపోయినా మిగిలిన స్త్రీ పురుషులు జీవించే ఉంటారు. ప్రపంచం కూడా ఎప్పటిలానే కొనసాగుతూనే ఉంటుంది. నేను ఇప్పుడు చనిపోయినా ఇంకో నలభై ఏళ్ళ తర్వాత చనిపోయినా ఈ చనిపోవడం అనే ప్రక్రియ ఎటు తిరిగీ తప్పదు. ఇలా నాకు నేను నచ్చచెప్పుకోవడానికి చూసినా ఆ ఆలోచన వల్ల అంత ఓదార్పు లభించేది కాదు. నా చేతుల్లో ఉండాల్సిన నా అన్ని సంవత్సరాల జీవితం ఉండకుండా పోతుంది కదా అనిపించింది. అయితే ఈ శిక్షా కాలం ముగిసి నేను మృత్యువును ఎదుర్కోబోతున్న సమయం ఆసన్నమవుతున్నప్పుడు ఎలా ఉంటుంది అనే దృశ్యాన్ని ఊహించుకుంటూ నేను ఆ ఆలోచనలను పక్కకు నెట్టడానికి ప్రయత్నించేవాడిని. ఒక వ్యక్తి చనిపోవడానికి నిజానికి అంత ప్రాధాన్యం లేదు. అందుచేత నేను నా అప్పీలును న్యాయస్థానం కొట్టివేయడాన్ని ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉండాలి. అయితే ఈ ముగింపుకు రావడానికి నా వాదనను విరమించుకోవడం మనసుకి కష్టంగా అనిపించింది. అయితే ఇదే సమయంలో సరిగ్గా ఇదే సమయంలో నా ఆలోచనల్లోకి

ఇంకో ప్రత్యామ్నాయం దూసుకు వచ్చేది. ఒక వేళ నా అప్పీలు విజయవంతం అయితే? ఆ ఆలోచనకే వళ్ళంతా ఆనందంతో తుళ్ళి పడినట్టు అయేది. ఆకస్మికంగా కలిగిన ఆ పులకింతకు తట్టుకోవడం కష్టమై కళ్ళు నీటితో నిండిపోయేవి. అయితే ఆ ఉద్విగ్నతను తట్టుకుని మనస్సుని స్థిరంగా ఉంచుకోగలగడం అనేది నేనే చేయాలని నాకు తెలుసు. ఒకవేళ అప్పీలు గెలిస్తే అనే విషయాన్ని ఆలోచించడంలో కూడా నేను ఒక క్రమపద్ధతి పాటించేవాడిని. అప్పీలును కొట్టివేయడమే న్యాయబద్ధమైనదని నేను అనుకునేవాడిని. నేను కనుక కేసు గెలిస్తే కొంచెం మానసిక ప్రశాంతత కలుగుతుంది అనుకునేవాడిని. నిజానికి అది అంత తక్కువ ఏమీ కాదు.

ఆ రోజుల్లోనే నేను జైలు మతాధికారిని చూడడానికి ఇంకోసారి నిరాకరించాను. నేను నా గదిలో వెల్లికిల్లా పడుకుని ఆకాశంలో పరుచుకొన్న పసుపు రంగు కాంతి ద్వారా వేసవి కాలపు సాయం సమయం సమీపిస్తుండడాన్ని తిలకిస్తూ ఉన్నాను. అప్పుడే నా ఆలోచనల్లో అప్పీలును కొట్టివేసినట్టు ఊహించుకుంటున్నాను. నా శరీరంలో రక్తం వడిగా ప్రవహిస్తుండడం, గుండె కొట్టుకోవడం నాకు తెలుస్తోంది. నేను మతాధికారిని కలవదలుచుకోవడం లేదు. అప్పుడు నేను ఒక పని చేశాను. ఈ మధ్య కాలంలో నేను ఎప్పుడూ ఈ పని చేయ లేదు. అది మేరీ గురించి ఆలోచించడం. ఆమె దగ్గర్నుంచి ఉత్తరం వచ్చి చాలా కాలమయింది. ఉరిశిక్ష పడిన వ్యక్తికి ప్రియురాలిగా ఉండడమనే దానితో బహుశా ఆమె విసుగెత్తి పోయి ఉండాలి. లేక పోతే ఆమె జబ్బు పడి అయినా ఉండాలి. చనిపోయి అయినా ఉండాలి. అలా ఒక్కోసారి జరగవచ్చు కూడా. నాకు ఈ విషయం ఎలా తెలుస్తుంది? మా ఇద్దరి శరీరాలు వేరుపడి పోయినప్పటి నుంచీ మా ఇద్దరి మధ్యా ఎలాంటి సంబంధం లేకుండా పోయింది. మా ఇద్దరినీ ఒకళ్ళకు ఒకళ్ళని గుర్తుకు తెచ్చేది కూడా ఏమీ లేకుండా పోయింది. ఒకవేళ ఆమె చనిపోయి ఉంటే జ్ఞాపకాల వల్ల ఏమీ ఉపయోగం ఉండదు. చనిపోయిన యువతి విషయంలో నాకు ఆసక్తి ఎందుకు ఉంటుంది? ఇది నాకు చాలా సహజంగా అనిపించింది. నేను చనిపోయిన తర్వాత అందరూ నన్ను ఎలా మర్చిపోతారో ఇది కూడా అంతే. ఈ విషయం జీర్ణంకావడానికి నాకు కష్టం అనిపించలేదు. నిజానికి మనం ఆలోచిస్తే ఒక విషయానికి అలవాటు పడలేకపోవడం అంటూ ఎప్పుడూ ఉండదు.

నేను ఇలా ఆలోచిస్తూ ఉండగానే మతాధికారి చెప్పాపెట్టకుండా గది లోపలకు వచ్చేశాడు. ఆయనను చూసి కూడా నేను వెంటనే కదల్లేక పోయాను. ఆయన ఇది గమనించి నన్ను అంత కంగారు పడవలసిన అవసరం లేదని చెప్పాడు. సాధారణంగా ఆయన వచ్చే వేళలు ఇవి కావు కదా అని నేను అడిగాను. పైగా ఆయన వచ్చే సందర్భం కూడా వేరుగా ఉంటుందని అన్నాను. అయితే తనది స్నేహపూర్వకమైన సందర్శన

మాత్రమేనని ఆయన సమాధానమిచ్చాడు. ఆయన రాకకీ నా అప్పీలుకీ ఎలాంటి సంబంధం లేదని ఆయన అన్నాడు. నిజానికి నా అప్పీలు గురించి ఆయనకు ఏమీ తెలీదు. ఆయన నా మంచం పైన కూర్చుని నన్ను తన పక్కన కూర్చోమని చెప్పాడు. నేను నిరాకరించాను. అయితే ఆయన అంటే వ్యతిరేకత వల్ల మాత్రం కాదు. నిజానికి ఆయన మృదువుగా స్నేహపూర్వకమైన వ్యక్తిగా అనిపించాడు.

ఆయన కాసేపు నిశ్శబ్దంగా కూర్చుండి పోయాడు. చేతుల్ని మోకాళ్ళ పై అనించి తన చేతులవైపే నిశ్చలంగా చూస్తూ కూర్చున్నాడు. ఆయన చేతులు సన్నగా ఉన్నప్పటికీ దృఢంగా ఉన్నాయి. వాటిని చూస్తుంటే రెండు చురుకైన చిన్న జంతువులు గుర్తుకు వచ్చాయి. ఆయన రెండు చేతులు మృదువుగా రుద్దుకున్నాడు. ఆయన చాలా సేపు అలాగే కూర్చుండి పోయాడు. దానితో ఆయన గదిలో ఉన్నాడనే విషయాన్ని నేను దాదాపు మర్చిపోయాను.. ఆయన అకస్మాత్తుగా కదిలి తలను పైకెత్తి నా కళ్ళల్లోకి చూశాడు.

"నేను నిన్ను చూడడానికి నువ్వెందుకు అంగీకరించలేదు" అని నన్ను అడిగాడు.

నాకు దేవుడిలో నమ్మకం లేదని నేను చెప్పాను.

"నువ్వు నిజంగా ఆమాట అంటున్నావా"?

ఆ విషయం గురించి అంతగా బుర్ర బద్దలు కోవాల్సిన అవసరం ఏమీ నాకు కనిపించడం లేదని నేను అన్నాను. నేను దేవుడిని విశ్వసించినా విశ్వసించక పోయినా నా మనస్సుకి సంబంధించినంతవరకూ దానికి అంత ప్రాధాన్యం లేదని చెప్పాను. అప్పుడు ఆయన వెనుక గోడకు ఆనుకుని కూర్చుని మోకాళ్ళపై చేతులు ఉంచుకున్నాడు. తర్వాత కనీసం నా వంక కూడా చూడకుండానే మాట్లాడడం మొదలుపెట్టాడు. ఒకరు ఒక విషయం గురించి తమకు పూర్తిగా తెలుసని అనుకోవడం తాను తరచూ గమనిస్తూ ఉంటానని అయితే నిజానికి అది సరికాదని ఆయన వ్యాఖ్యానించాడు. నేనేమీ మాట్లాడకుండా ఉండిపోయేటప్పటికి ఆయన మళ్ళీ నా వైపు చూసి "నువ్వు ఒప్పుకోవా" అని అడిగాడు. అలా జరుగుతుండవచ్చుని నేను అన్నాను. అయితే నాకు ఆసక్తి కలిగించేదేదో నాకు కచ్చితంగా తెలియకపోయినప్పటికీ నాకు ఆసక్తి కలిగించనిదేదో నాకు కచ్చితంగా తెలుసని చెప్పాను. ఆయన లేవనెత్తిన ప్రశ్న అంటే నాకు ఏ మాత్రం ఆసక్తి లేదని స్పష్టంచేశాను. ఆయన తను కూర్చున్న భంగిమను ఏమాత్రం మార్చకుండా అలాగే కూర్చుని నేను తీవ్రమైన నిరాశా నిస్పృహలకు లోనై ఉండడం వల్ల అలా మాట్లాడుతున్నానా అని అడిగాడు.

నేను నిరాశా నిస్పృహలకు లోనవ్వలేదని మహా అయితే కొంత భయపడుతుండొచ్చని అయినా అది సహజమైనదేనని నేను అన్నాను.

"అలా అయిన పక్షంలో దేవుడు నీకు సహాయంచేస్తాడు. నీ స్థితిలో ఉన్న ప్రతి ఒక్కరూ కష్టాలు వచ్చినపుడు దేవుడిని ప్రార్థించడం నేను చూశాను" అని ఆయన అన్నాడు.

"అయిండొచ్చు. వాళ్ళు ఇష్టపూర్వకంగా అలా చేసి ఉండొచ్చు. దేవుడిని నమ్మి అలా ప్రార్థించి ఉండొచ్చు. అయితే నేను దేవుడు సహాయం చేయాలనుకోవడం లేదు. నాకు ఆసక్తి కలిగించని విషయం గురించి పని చేయడానికి నాకు సమయం లేదు" అని నేనన్నాను.

ఆయన కోపంగా చేతులు ఆడించాడు. తర్వాత కూర్చుని తన గౌను సరిచేసు కున్నాడు. తర్వాత మళ్ళీ మాట్లాడడం మొదలు పెట్టాడు. నన్ను 'స్నేహితుడా' అని సంబోధిస్తూ మాట్లాడాడు. నాకు మరణ శిక్ష పడడం వల్ల తాను అలా మాట్లాడడం లేదని ఆయన చెప్పాడు. తన ఉద్దేశ్యంలో భూమిపై ఉన్న ప్రతి మానవుడూ మరణ శిక్ష అనుభవిస్తున్న వారేనని ఆయన అన్నాడు. నేను దానికి అభ్యంతరం చెప్పాను. ఆ రెండింటి మధ్య తేడా ఉందని నేను అన్నాను. అది ఏరకంగానూ ఓదార్పు కూడా కాదని అన్నాను. ఆయన తలూపాడు.

"అయిండొచ్చు అయినా నువ్వు అంత త్వరగా చనిపోక పోయినా ఏదో ఒక రోజు చనిపోక తప్పదు. అప్పుడు కూడా ఇదే ప్రశ్న తలెత్తుంది. ఆ భయంకరమైన చివరి గడియల్ని నువ్వు ఎలా ఎదుర్కొంటావు" అని ఆయన అడిగాడు.

ఇప్పుడు ఎలా అయితే ఎదుర్కొంటున్నానో అప్పుడు కూడా అలాగే ఎదుర్కొంటానని నేను సమాధానం ఇచ్చాను.

అప్పుడు ఆయన లేచి నుంచుని నా కళ్ళలోకి సూటిగా చూశాడు. అది ఒకలాంటి యుక్తి, గారడి అని నాకు తెలుసు. నేను దీనిని ఇమాన్యుయల్ మీదా సెలెస్టి మీదా అనేక సార్లు ప్రయోగించి చూసి ఆనందించే వాడిని. అలా చేసిన పది సార్లలో కనీసం తొమ్మిది సార్లు వాళ్ళు అసౌకర్యంగా అనిపించి ఇబ్బంది పడేవాళ్ళు. మతాధికారి ఈ విద్యలో అందెవేసిన చెయ్యిలా ఉన్నాడు. ఆయన దృష్టి అణువంత కూడా చెక్కు చెదరలేదు. ఆయన గొంతు కూడా ఏ మాత్రం హెచ్చు తగ్గులు లేకుండా గంభీరంగా ఉంది.

"నీకు ఏమాత్రం ఆశలేదా? నువ్వు చనిపోయేటప్పుడు ఏమీ జరగకుండా అమాంతం చనిపోగలనని అనుకుంటున్నావా? ఏమీ మిగలదని అనుకుంటున్నావా" అని ఆయన అడిగాడు.

"అవును" అని నేను సమాధానమిచ్చాను.

ఆయన కళ్ళు వాల్చి తలదించుకుని మళ్ళీ కూర్చుండి పోయాడు. ఆయన నా గురించి నిజంగా చాలా బాధ పడుతున్నట్టు చెప్పాడు. నాలాగా ఆలోచించే మనిషికి

జీవితం సహింప రానిదిగా ఉంటుందని ఆయన అన్నాడు. మతాధికారి అంటే నాకు విసుగు పుట్టడం మొదలయింది. నేను భుజాన్ని గోడకు ఆనించి దూరంగా కనపడుతున్న పలుచని సూర్యకాంతి కేసి చూస్తూ ఉండి పోయాను. ఆయన ఏం అంటున్నాడో తర్వాత నేను అంత పట్టించుకోనప్పటికీ నన్ను ఏదో అడుగుతున్నాడని అర్థం చేసుకున్నాను. ఆయన గొంతు ఉద్వేగంగా ఉంది. ఆయన నిజంగా నిరాశ చెందాడని నాకు అర్థం అయింది. అందుకే ఆయన చెప్పేదానిపైన కాస్త దృష్టి పెట్టాను.

నేను అప్పీలు చేసిన పక్షంలో గెలవచ్చని తాను అనుకుంటున్నానని అయితే నేను అపరాధ భావంతో కుంగిపోక మాత్రం తప్పదని అన్నాడు. దానిని నేను తప్పక వదిలించుకోవాలని అన్నాడు. తన దృష్టిలో మనిషి చేసే న్యాయానికి విలువ లేదని దేవుడు చేసే న్యాయమే నిజమైనదని అన్నాడు.

అయితే మనిషి మూలంగానే నేను శిక్షించబడుతున్నానని నేను ఆయనకు గుర్తు చేశాను. అవునని ఆయన అంగీకరించాడు. అయితే అది నా పాపాన్ని పూర్తిగా కడిగివేయలేదని అన్నాడు. అయితే నేను పాపం చేశానని అనుకోవడం లేదని చెప్పాను. కేవలం నేరం చేసినట్టు మాత్రమే భావిస్తున్నాని చెప్పాను. చేసిన నేరానికి గాను శిక్షరూపంలో మూల్యాన్ని చెల్లిస్తున్నానని ఇంక నా నుంచి అంత కన్నా ఎక్కువ ఆశించడానికి ఎవరికీ హక్కు లేదని అన్నాను.

అప్పుడు ఆయన మళ్ళీ లేచి నిలబడ్డాడు. అప్పుడు నాకు తట్టింది – ఆయన లేచి నడవడానికి కూడా నా గదిలో అవకాశం లేకపోవడం వల్ల ఆయన అలా లేవడం, కూర్చోవడం చేస్తున్నాడని. నేను నేల వైపు చూస్తూ కూర్చున్నాను. ఆయన నా వైపు ఒక అడుగువేసి అంత కన్నా ముందుకు రావడానికి సాహసించలేనట్టు ఆగిపోయాడు. తర్వాత కిటికీ ఊచల్లోంచి ఆకాశం వైపు చూశాడు.

"నువ్వు పొరబాటు పడుతున్నావు నీ నుంచి ఆశించబడుతున్నది చాలా ఉంది. బహుశా నీ నుంచి ఒకటి ఆశించబడుతూ ఉండొచ్చు" అని ఆయన విచారంగా అన్నాడు.

"మీరనేదేమిటి" అని నేనన్నాను.

"దాన్ని చూడమని నిన్ను అడుగవచ్చు"

"దేన్ని చూడమని" అని నేను ప్రశ్నించాను.

ఆయన నిదానంగా నా గది అంతా చుట్టూరా చూస్తూ ఉన్నాడు. ఆయన మాట్లాడుతున్నప్పుడు ఆయన గొంతులో వినిపించిన విషాదం నన్ను కట్టిపడవేసింది.

"ఈ రాతి గోడలు మానవుల బాధలతో పూర్తిగా నానిపోయి ఉన్నాయని నాకు తెలుసు. శరీరంలో వణుకు లేకుండా నేను ఎప్పుడూ వాటిని చూడలేదు. అయినప్పటికీ నన్ను నమ్ము. నేను నా గుండె లోతుల్లోంచి మాట్లాడుతున్నాను. మీలో ఉన్న క్రూరమైన

దుర్మార్గులకు కూడా కొన్నిసార్లు ఆ తెల్లని గోడల్లోంచి ఒక దివ్యమైన ముఖం గోచరిస్తుంది. ఆ దివ్యమైన ముఖాన్నే నిన్ను చూడమని అంటున్నది" అని ఆయన అన్నాడు.

ఇది నన్ను కొంచెం కదిలించింది. నేను కొన్ని నెలలుగా ఆ గోడలను తదేకంగా చూస్తున్నానని ఆయనకు తెలిపాను. అక్కడ నాకు ఏదీ కనపడలేదని ఆయనకు చెప్పాను. అంతకు ముందు మాత్రం నేను ఒక ముఖాన్ని చూడడానికి ప్రయత్నం చేసేవాడినని అయితే అది బంగారం రంగుతో మెరిసిపోయే మేరీ ముఖమని ఆయనకు చెప్పాను. "అయితే నాకు అదృష్టం లేదు. నేను ఎప్పుడూ ఆ మొహాన్ని చూడలేక పోయాను. అందుకే ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాను" అని ఆయనకు చెప్పాను. ఆ తెల్లని గోడలపై ఆయన చెప్పినట్టు నిజానికి నేను ఏనాడూ ఏ ఆకారాన్నీ చూడలేదు కూడా.

మతాధికారి నా వంక విషాదంగా చూస్తూ కూర్చున్నాడు. నేను గోడకు ఆనుకుని కూర్చున్నాను. వెలుతురు నా నుదిటిపై పడుతోంది. ఆయన ఏదో గొణిగాడు. అయితే అవి నాకు వినపడలేదు. అకస్మాత్తుగా ఆయన నన్ను ముద్దుపెట్టుకోవచ్చునా అని అడిగాడు. నేను 'వద్దు' అన్నాను. ఆయన తిరిగి గోడ దగ్గరికి వచ్చాడు. గోడ మీద చేతితో నెమ్మదిగా రాస్తూ ఉండిపోయాడు.

"ఈ భూమి మీద వస్తువుల్ని నువ్వు నిజంగా అంత ఇష్టపడుతున్నావా" అని మెల్లగా అడిగాడు. నేను సమాధానం చెప్పలేదు. కాసేపు ఆయన ఇంకో వైపు చూస్తూ కూర్చున్నాడు. ఆయన సమక్షం నాకు ఉన్న కొద్దీ కోపాన్ని విసుగునీ తెప్పిస్తోంది. ఆయన్ని అక్కడి నుంచీ వెళ్ళి పొమ్మని నన్ను మనశ్శాంతితో వదిలేయమని చెబుదామనుకున్నాను.

అంతలో ఆయన అకస్మాత్తుగా లేచి నన్ను పట్టుకుని ఊపుతూ "లేదు. లేదు. నేను దీన్ని నమ్మలేకపోతున్నాను. నువ్వు మరణానంతర జీవితం ఉండాలని తప్పక కోరుకుంటావు. నాకు తెలుసు" అని ఉద్వేగంగా అన్నాడు.

అలా కోరుకున్నది నిజమేనని నేను అంగీకరించాను. ప్రతి ఒక్కరూ ఏదో ఒకసారి అలా కోరుకుంటారని నేను అన్నాను. అయితే ధనవంతుడిగా ఉండాలనో, వేగంగా ఈదాలనో, చక్కటి నోరు ఉండాలనో కోరుకోవడం లాంటిదే ఆ కోరిక కూడానని, దానికి అంతకన్నా గొప్ప ప్రాధాన్యం ఏమీ లేదని నేనన్నాను. ఆ కోరికల జాబితాలోకే ఇది కూడా వస్తుందని చెప్పాను. నేను అదే పనిగా చెప్పుకుపోతుండగా ఆయన ఒక ప్రశ్నతో నాకు అడ్డుతగిలాడు. చనిపోయిన తర్వాత నా జీవితాన్ని నేను ఎలా ఊహించుకుంటున్నానని ఆయన అడిగాడు.

"నాకు గుర్తు ఉండే జీవితం అల్లా ఈ భూమి మీద నేను గడిపిన జీవితమే. నాకు కావలసింది అది మాత్రమే" అని నేను గట్టిగా అరిచాను. తర్వాత అదే గొంతుతో ఇంక ఆయనతో గడపాలని నేను అనుకోవడం లేదని నేను చెప్పాను. అయితే, ఆయనకు

దేవుడి గురించి చెప్పాల్సింది ఇంకా మిగిలిపోయినట్లుంది. అప్పుడు నేను ఆయన దగ్గరకు వెళ్ళి నాకు చాలా కొద్ది సమయం మాత్రమే ఉందని దానిని నేను దేవుడి కోసం వ్యర్థం చేసుకోదలుచుకోలేదని ఆయనకు వివరించే ప్రయత్నం చేశాను.

అప్పుడు ఆయన సంభాషణని మార్చి నేను ఆయనను ఒక్కసారి కూడా మతాధికారి అని తెలిసినా 'ఫాదర్' అని సంబోధించలేదెందుకు అని అడిగాడు.

అది నాకు ఇంకా కోపాన్ని తెప్పించింది. ఆయన నాకు 'తండ్రి' కాదని పైగా ఆయన అవతలి పక్షానికి చెందిన మనిషని నేను అన్నాను.

"లేదు. లేదు. కుమారా" అంటూ ఆయన నా భుజాల చుట్టూ చేతులు వేశాడు.

"నేను నీ పక్షాన్నే ఉన్నాను. నువ్వు తెలుసుకోలేకపోతున్నావు. ఎందుకంటే నీ గుండె గట్టిపడిపోయి ఉంది. అయినప్పటికీ నేను నీ కోసం ప్రార్థిస్తాను" అని అన్నాడు.

అప్పుడు నాకు ఏమయిందో నాకు తెలీదు. నా లోపల ఏదో బద్దలైనట్టు అనిపించింది. పెద్దగొంతుతో గట్టిగట్టిగా కేకలు వేయడం మొదలుపెట్టాను. ఆయన్ని నోటికి వచ్చినట్టు దూషించాను. ఆయన ప్రార్థనల్ని నా కోసం వృధా చేయవద్దని చెప్పాను. అదృశ్యం అయిపోయేదానికన్నా మండిపోవడమే మంచిదని అన్నాను. నేను ఆయన గౌనుని మెడ పట్టీ దగ్గర పట్టుకుని లాక్కుపోయాను. ఒక రకమైన పిచ్చి ఆనందంతో ఉద్రేకంతో నా మనసులోని ఆలోచనలన్నింటినీ ఆయనపై గుమ్మరించాను. ఆయన ఎంతో దృఢమైన నమ్మకం కల వ్యక్తిగా కనిపించాడు. అయితే ఆయన నమ్మకాలలో ఏదీ కూడా ఒక మహిళ తలలోని వెంట్రుక పాటి చెయ్యదని నాకు అనిపించింది. ఆయన ఒక శవం లాగా బతుకుతూ తాను జీవించి ఉన్నాననే స్పృహ కూడా లేకుండా గడిపాడు. నా చేతులు ఖాళీగా ఉన్నట్లు కనిపించవచ్చు. అయితే నిజానికి నేనేంటో నాకు కచ్చితంగా తెలుసు. అన్నింటి గురించీ కచ్చితంగా తెలుసు. ఆయన కన్నా కూడా ఖచ్చితంగా తెలుసు. నా ప్రస్తుత జీవితం గురించి సమీపిస్తున్న మృత్యువు గురించీ తెలుసు. నాకు ఉన్నదంతా అదే. నా గురించి నాకు ఆ నమ్మకం నేను ఏర్పరుచుకున్నాను. నమ్మకం కూడా నా మీద నమ్మకాన్ని కలిగించుకుంది. నేను ఒకప్పుడు బాగానే ఉన్నాను. ఇప్పుడూ మంచిగానే ఉన్నాను. నేను ఎప్పుడూ మంచిగానే ఉన్నాను. నేను నా జీవితాన్ని ఒక రకమైన పద్ధతిలో గడపాను. ఇప్పుడు ఇంకో భిన్నమైన పద్ధతిలో గడపాల్సి ఉంది. నేను ఎలా ఉండాలనుకున్నానో అలాగే ఉన్నాను. ఇంకోలా ప్రవర్తించలేదు. నేను 'ఎక్స్' అనే పని చేయలేదు. వై, జడ్ అనే పని చేశాను. అంటే దాని అర్థం ఏమిటి? అంటే నేను ఆ మొత్తం సమయం అంతా ఈ ప్రస్తుత క్షణం కోసమే ఎదురుచూస్తూ గడిపాను. ఆ 'ఉదయం' కోసం ఎదురు చూస్తూ గడిపాను. అది రేపు కావచ్చు ఇంకో రోజు కావచ్చు. అదే నాకు న్యాయం చేస్తుంది. దేనికీ తక్కువ ప్రాధాన్యం

లేదు. అది నాకు తెలుసు. ఆ విషయం ఆయనకి కూడా తెలుసు. నా భవిష్యత్తు అనే నల్లటి దిక్చక్రం నుంచి ఒక రకమైన మెల్లటి గాలి నా వైపు వీస్తూ ఉంది. నా జీవితం పొడవునా, రాబోయే కాలానికి కూడా అది వీస్తూనే ఉంటుంది. వచ్చే దారి పొడవునా ఆ గాలి, ప్రజలు నా పై రుద్దిన అభిప్రాయాలన్నిటినీ సమంచేస్తూ వస్తుంది. అప్పుడు నేను గడిపిన జీవితం నిజమైనది కాదు. వాళ్ళ మూలంగా నా జీవితంలో ఏం మార్పు వస్తుంది? ఇతరులు చనిపోవడంవల్ల కానీ, తల్లి ప్రేమవల్ల కానీ, పోనీ ఆయన దేవుడి వల్ల కానీ ఏదన్నా మార్పు వస్తుందా? ఒకళ్ళు ఒక విధంగా జీవించాలనుకుంటారు. కానీ విధి ఇంకోలా పరిణమిస్తుంది. అయితే ఒకే రకమైన విధి నన్నే కాదు నాతో పాటు వేలాది మంది లక్షలాది మంది భాగ్యశాలురిని కూడా ఎంచుకుంటోంది. ఆయన లాగే వాళ్ళు కూడా నా సోదరులనే భావిస్తాను. అయితే ఆయన తప్పక ఒకటి గమనించాలి. బతకడానికి అవకాశం ఉన్న ప్రతి మనిషీ బ్రతికి ఉన్న ప్రతి మనిషీ భాగ్యశాలుడి కిందే వస్తాడు. మనుషుల్లో ఒకే ఒక వర్గం ఉంది. అదే జీవించి ఉండగలిగిన అదృష్టవంతుల వర్గం. అందరూ కూడా ఏదో ఒక రోజున మరణించేవారే. మిగిలిన వారి లాగే ఒక రోజు ఆయన వంతూ వస్తుంది.

అయితే హత్యానేరం మోపబడిన తర్వాత చనిపోయే చావుకి ఆయన చావుకి తేడా ఏం ఉంది? తల్లి అంత్యక్రియలప్పుడు ఏడవలేదని ఒక వ్యక్తిని ఉరితీయడానికీ మిగిలిన చావులకీ తేడా ఏం ఉంది? అన్ని రకాల మృత్యువులు చివరికి ఒకే ముగింపునకు వచ్చినపుడు దేనికైనా తేడా ఏం ఉంటుంది? సాలమనో భార్య ఎలా మృత్యువు ఒడిలోకి చేరిందో సాలమనో కుక్క కూడా అలాగే మృత్యువు పాలయింది. కుందేలులాంటి ఆ యువతి, పారిస్ నుంచి వచ్చి మేసన్‌ను పెళ్ళి చేసుకున్న అమ్మాయి, నన్ను వివాహం చేసుకోవాలనుకున్న మేరీ అందరూ ఒకేలాంటి తప్పు చేసినవారే. సెలెస్టి లాగానే రేమాండ్ కూడా నాకు సన్నిహిత మిత్రుడు. సెలెస్టి నిజానికి రేమాండ్ కన్నా గొప్పవాడైనా, మంచివాడైనా తేడా ఏముంది? మేరీ ఈ క్షణంలో తన కొత్త స్నేహితుడిని ముద్దు పెట్టుకుంటూ ఉండొచ్చు. అంత మాత్రాన ఏమౌతుంది? ఒక మతాధికారిగా ఆయన నా భవిష్యత్తు నుంచి వీస్తున్న నల్లటి గాలిని గ్రహించలేడా?

నేను ఎంత గట్టిగా అరుస్తున్నానంటే నాకు గాలి పీల్చుకోవడం కూడా కష్ట మనిపించింది. అదే సమయంలో జైలు వార్డర్లు పరిగెత్తుకుని వచ్చి మతాధికారిని నా పట్టునుంచి విడిపించడానికి ప్రయత్నించారు. ఒక అతను నన్ను కొట్టబోయాడు కూడా. మతాధికారి వాళ్ళను నిశ్శబ్దంగా ఉండమని చెప్పి ఒక నిముషంపాటు ఏమీ మాట్లాడ కుండా నన్నే చూస్తుండి పోయాడు. ఆయన కళ్ళు నీటితో నిండిపోయి ఉన్నాయి. తర్వాత ఆయన వెనుదిరిగి గదిలో నుంచి వెళ్ళి పోయాడు.

ఆయన వెళ్ళి పోగానే నేను ప్రశాంతంగా ఉండిపోయాను. అయితే ఈ ఉద్వేగం వల్ల ఉద్రిక్తత వల్ల బాగా అలసిపోయినట్టు అనిపించింది. నేను నా మంచం మీదకి బరువుగా వాలి పోయాను. నేను చాలా సేపే నిద్రపోయి ఉండాలి. తిరిగి నేను లేచేటప్పటికి నక్షత్రాలు నా మొహంపై మెరుస్తూ కనిపించాయి. పక్క ఊరినుంచి చిన్నగా శబ్దాలు వినిపిస్తున్నాయి. నేల వాసనతో ఉప్పు వాసన కలగలిసిన చల్లటి నిశా సమీరం నా చెంపలను మృదువుగా తాకుతోంది. గాఢమైన వేసవి రాత్రుల్లో ఉండే అద్భుతమైన కాంతి నన్ను ఒక అలలా ముంచెత్తింది. తర్వాత తెల్లవారు జాము కావస్తుండగా ఓడ సైరన్ వినిపించింది. ప్రజలు ఇంక ఎప్పటికీ నాకేమాత్రమూ సంబంధంలేని ప్రపంచయాత్రకు బయలుదేరినట్టున్నారు. చాలా కాలం తర్వాత మొదటి సారిగా నాకు మా అమ్మ గుర్తుకు వచ్చింది. ఇప్పుడు నాకు అర్థమవుతూ ఉన్నట్టుంది ఆమె తన జీవితపు చివరి గడియల్లో కూడా ఒక 'తోడు' కావాలని ఎందుకు అనుకుందో. ఆమె జీవితాన్ని కొత్తగా ఎందుకు ప్రారంభించాలనుకుందో అర్థమవుతోంది. ప్రాణాలు గాలిలో రెపరెపలాడే దీపాల్లా ఉండే ఆ వృద్ధాశ్రమంలో కూడా సంధ్యా సమయం ఒక విషాదకరమైన సౌఖ్యాన్ని కలిగించేది. మృత్యువు సమీపిస్తున్నప్పుడు కూడా అమ్మ స్వేచ్ఛగా ఉండేవారి లాగే తాను కూడా జీవితాన్ని సరికొత్తగా ప్రారంభించాలని అనుకుంది. ప్రపంచంలో ఎవరికీ, ఏ ఒక్కరికీ ఆమె కోసం ఏడవడానికి ఎలాంటి హక్కు లేదు. నేను కూడా జీవితాన్ని సరికొత్తగా ప్రారంభించాలని అనుకుంటున్నాను. ఇంతకు ముందటి తీవ్రత, కోపం నా దోషాలను తుడిచివేసి నన్ను పరిశుభ్రం చేసినట్టు అనిపించింది. ఇక నాకు ఏ ఆశా మిగల్చకుండా చేసింది. నక్షత్రాలతో తళతళలాడుతున్న చక్కటి ఆకాశాన్ని చూస్తున్నప్పుడు మొట్టమొదటిసారిగా దయాళువైన ప్రపంచపు ఉదాశీనత స్పష్టంగా కళ్ళకు కట్టినట్టు అనిపించింది. అది నాకు నాలాగే అనిపించింది. నిజమైన సోదరుడిలాగా అనిపించింది. నేను సంతోషంగా జీవితాన్ని గడిపానన్న విషయాన్ని అది గుర్తుకు తెచ్చింది. నేను ఇంకా సంతోషంగానే ఉన్నాను. ఇంక నేను చేయవలసిందల్లా ఒంటరితనాన్ని దగ్గరికి రానివ్వకపోవడమే. ఇంక మిగిలిన కోరికల్లా నన్ను ఉరితీసే రోజున పెద్ద సంఖ్యలో ప్రజలు హాజరు కావాలని ఆశించడమే. పెద్దపెద్దగా అరుస్తూ బొబ్బలు పెడుతూ నన్ను శపించాలని కోరుకోవడమే.



APA CHITHUDU (The S er)
lbert Camus



# అపరిచితుడు

ఆల్బర్ట్ కామూ నోబెల్ బహుమతి గ్రహీత. నోబెల్ కమిటీవారు అతనికి రాజకీయ కారణాలతో నోబెల్ ఇచ్చారని కొందరంటారు. కామూ అభిమానులు ఆ మాట ఏమాత్రం ఒప్పుకోరు. అతని అసమాన ప్రతిభే అతనికి నోబెల్ బహుమతిని తెచ్చిపెట్టిందంటారు వారు. **అపరిచితుడు** (The Stranger/The Outsider) కామూ రచనల్లో అత్యంత ప్రసిద్ధం. ఈ చిరుపుస్తకానికి ప్రపంచవ్యాప్తంగా అభిమానులున్నారు.



Peacock Classics